# ద్వాదశ దర్శనాలు




మైసూరు అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు
I.C.C.T, మెంఫిస్, USA ఆస్థాన [illegible]
కనకాభిషేకగ్రహీత, గండపెండేర సన్మానిత
సువర్ణఘంటాకంకణ, శ్రీవిద్యారత్నకర, శ్రీవిద్యావిశారద

**డా॥ క్రోవి పార్థసారథి**

(స్వామి పరమానందనాథ)

# ద్వాదశ దర్శనాలు

గ్రంథకర్త :
డా॥ క్రోవి పార్థసారధి (స్వామి పరమానందనాథ)

ప్రథమ ముద్రణ : డిసెంబర్, 2010

ప్రతులు : 1000



**వెల : రూ. 80-00**

ప్రతులకు :

1. క్రోవి రమాదేవి
   23-11/1-10/2, ఓగిరాలవీధి,
   సత్యనారాయణపురం, విజయవాడ-11.
   ఫోన్ : 0866-2530672, 2532634

2. శివకామేశ్వరి గ్రంథమాల
   41-22/4-36, భ్రమరాంబాపురం,
   కృష్ణలంక, విజయవాడ-520 013
   ఫోన్ : 0866-2522824

ముద్రణ :
మెట్రో ప్రింటర్స్,
ఏలూరురోడ్డు, విజయవాడ-2.
ఫోన్ : 0866-2



1-1-2010 నుండి 25-12-2010 వరకు జరిగిన

వనదుర్గా మహావిద్య మహాయాగము యొక్క

పూర్ణాహుతి సందర్భముగా

ఈ గ్రంథము విడుదల చేయబడినది.

# श्री अवधूत दत्त पीठम्

श्री गणपति सच्चिदानन्द आश्रमः

दत्त नगरम्, नीलगिरि मार्गः, मैसूरु ५७००२५

---

जयतु गुरु दत्तः

स्वस्तिश्री चान्द्रमान पार्थिव नाम संवत्सरे वैशाखमासे

कृष्णपक्षे षष्ठ्यां तिथौ भानुवासरे

(२९-५-२००५ दिनाङ्के)

**श्रीविद्या क्षेत्रे**

कृत निरुपमान परिश्रमाः

**श्रीमन्तः डा. क्रोवि पार्थसारथि** महोदयाः

तद्विरचिताभिः सेवाभिः परितुष्टैः

श्रीमदवधूत दत्तपीठाधीशैः जगद्गुरुभिः परमपूज्यैः

**श्री श्री श्री गणपति सच्चिदानन्द स्वामीजी पूज्यपादैः**

# दत्तपीठ आस्थान विद्वान्

इति उपाधि प्रदानेन सम्भावितास्सत्कृता अनुगृहीताश्च।




| | | |
|---|---|---|
| *कुप्पा वेङ्कट कृष्णमूर्तिः* | | *प्रसाद शर्मा* |
| विद्याधिकारी | पीठमुद्रा | कार्य निर्वाहकः |

INDIA CULTURAL CENTER AND TEMPLE
12005 Hwy 64 E, Eads, TN 38028 USA

*The Board of Trustees are pleased to appoint*

**Sri Vidyaratnakara, Sri Vidyavisarada**
**Dr. Krovi Parthasarathi**

**as**

ASTHANAVIDWAN

***in recognition of his outstanding contribution to the understanding of Sri Vidya***
*during "Sri Lakshmiganapathi Maha Yaga Sahitha Srichakra Prana Prathista Mahotsavam" in the presence of*
*Karunamayi Bhagavathi Sri Sri Sri Vijayeswari Devi*

***on March 28, 2010***






Phone : 2707 (Tenkasi)

HIS HOLINESS JAGADGURU

SRI SIVA CHIDANANDA BHARATHI SWAMI

Sri Siddheswari Peetadhipati

Courtallam - 627 802

(Via) Tenkasi - Tirunelveli Dist. ----- South India

With Narayanasmritis

---

# అభినందన

5-5-1997

దేవీ పూజలో కౌళ, సమయమతములు, శ్రీ చక్రాంతర్గత రహస్యములు.
భిన్న సంప్రదాయములలో పంచదశీమహామంత్రము, షట్చక్రభేదన-
దేవి సాక్షాత్కారము. మొదలైన విషయములు పామరులకు కూడా
అర్థమయ్యేరీతిలో
శ్రీ క్రోవి పార్థ సారథిగారు వ్రాసిన

## "శ్రీ విద్యాదర్శనము"

గ్రంథావిష్కరణ సమయమున వారిని అభినందిస్తూ
కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠ మహా సంస్థానామోదమున గ్రంథకర్తను

## "శ్రీ విద్యారత్నాకర"

అను బిరుదరాజముతో సన్మానించడమయినది.

ఇతి నారాయణస్మృతిః

# క్రోవి పార్థసారథిగారి పరిచయం

పూర్తిపేరు : క్రోవి పార్థసారథి

తల్లిదండ్రులు : సత్యపర్వత వర్ధనమ్మ, కృష్ణమూర్తి

గోత్రము : హరితస

దీక్షా నామము : పరమానందనాథ

వృత్తి / ఉద్యోగము : రిటైర్డ్ వాణిజ్యశాస్త్ర ఉపన్యాసకులు, శాతవాహన కళాశాల, విజయవాడ.

ఇంటి అడ్రస్ : 23-11/1-10/2, దేవీ నిలయం, ఓగిరాల వారి వీధి, సత్యనారాయణపురం, విజయవాడ-520 011. ఫోన్ : 2530672

సత్కారాలు :

1. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వ ఉగాది పురస్కారము 21-3-2004
2. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయ పురస్కారము 5-9-2004
3. మైసూర్ అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసునిగా నియామకము 29-5-2005
4. ఆస్థాన విద్వాంసులు ICCT, MEMPHIS, USA.
5. కృష్ణాజిల్లా కలెక్టర్ వారిచే సత్కారము 15-8-2005
6. కృష్ణా మహోత్సవములో పండితునిగా సత్కారము 28-1-2006
7. శాతవాహన కళాశాల యాజమాన్యముచే ఉత్తమ ఉపాధ్యాయునిగా సత్కారము 23-2-2005
8. శాతవాహన కళాశాల యాజమాన్యముచే రజిత పతకము బహూకరణ 5-2-2002
9. శాతవాహన కళాశాల సెక్రటరీ శ్రీ అండవల్లి సత్యనారాయణ గారిచే రూ. 500 లు నగదు బహూకరణ
10. గణపతిస్వామివారిచే నవరత్న ఉంగరము బహూకరణ 11-1-2004
11. కనకాభిషేకము 13-12-1999
12. సువర్ణ ఘంటాకంకణ ప్రదానము 1-8-1998
13. గండపెండేర ప్రదానము 3-11-2002

రచించిన గ్రంథాలు :

1. శ్రీవిద్యాసారథి (లలితా సహస్రానికి విశేష వ్యాఖ్య)
2. శ్రీకైవల్యసారథి (విష్ణు సహస్రానికి విశేష వ్యాఖ్య)
3. శ్రీవిద్యాలహరి (సౌందర్యలహరికి విశేష వ్యాఖ్య)
4. శ్రీవిద్యా దర్పణము (గౌడపాదుల సుభగోదయస్తుతికి వ్యాఖ్య)
5. శ్రీవిద్యా సర్వస్వము (పుణ్యానంద మునీంద్రుల కామకలా విలాసానికి వ్యాఖ్య)
6. శ్రీవిద్యా హృదయము (యోగినీ హృదయానికి వ్యాఖ్య)
7. శ్రీవిద్యా పంచదశి (పంచదశి మహామంత్రానికి వివరణ)
8. శ్రీవిద్యా రహస్యము
9. శ్రీవిద్యా మహాయంత్రము (శ్రీచక్రానికి విశేషవ్యాఖ్య)
10. సప్తశతి భాష్యము
11. దేవీ కథాసుధ
12. శ్రీవిద్యా దర్శనము
13. ఉపనిషత్సర్వస్వము (దశోపనిషత్తుల మీద కథలు)
14. శ్రీచక్ర సర్వస్వము
15. భావనోపనిషత్తు
16. త్రిపురా రహస్యదీపిక
17. బ్రహ్మసూత్రమంజరి
18. శ్రీచక్రము
19. తొలి ఏకాదశి
20. శివపురాణము
21. సర్వదేవతా హోమవిధానము
22. లలితారహస్యోపనిషత్తు
23. ఆత్మసాక్షాత్కారము
24. వరివస్యా రహస్యము
25. శ్రీవిద్య
26. శ్రీచక్రనవావరణార్చన
27. ద్వాదశ దర్శనాలు
28. వేదాంత విద్యాసారథి
29. శతరుద్రీయము
30. మహావాక్య దర్పణము

ప్రవచించిన సి.డి.లు :

1. గణపతిస్వామి వారి జీవిత చరిత్ర (40 గం॥)
2. శ్రీవిద్యాసారథి (లలితారహస్యనామ భాష్యము) (24 గం॥)
3. సప్తశతిభాష్యము (12 గం॥)
4. లలితారహస్యోపనిషత్తు (1గం॥)
5. ఉపనిషద్దర్శనము (12 గం॥)

6. బ్రహ్మసూత్రాలు (12 గం॥)
7. దేవీభాగవతము (12 గం॥)
8. శివారాధన (11 గం॥)
9. శ్రీచక్రము (4 గం॥)
10. సాయిచరితము పారాయణ క్రమం (12 గం॥)
11. శ్రీవిద్యాలహరి (సౌందర్యలహరి) (18 గం॥)
12. శ్రీ కైవల్యసారథి (విష్ణుసహస్రనామ వివరణ) (12 గం॥)
13. లలితాసహస్రనామ వివరణ (12 గం॥)
14. ఆత్మసాక్షాత్కారము (10 గం॥)
15. శ్రీకృష్ణలీలామృతము (15 గం॥)
(శ్రీమద్భాగవత సప్తాహ ప్రవచనాలు)
16. సీతారామకళ్యాణము (1 గం॥)
17. గురుగీత (17 గం॥)
18. గాయత్రీ మహామంత్రము (9 గం॥)
19. గురుతత్త్వము (9 గం॥)
20. త్రిపురా రహస్యము (45 గం॥)
21. గీతామహాయజ్ఞము (72 గం॥)
22. రామాయణ కథా సుధ (7 కాండలు) (172 గం॥)
23. శ్రీసూక్త భాష్యము (1 గం॥)
24. ఉత్తరగీత (16 గం॥)
25. అష్టావక్రగీత (25 గం॥)
26. శ్రీవిద్య (25 గం॥)
27. భావనోపనిషత్తు (1 గం॥)
28. భావనోపనిషత్తు (1 గం॥)
29. వనదుర్గా మహావిద్య (1 గం॥)
30. వేదాంతోపన్యాసాలు (16 గం॥)
31. హోమప్రకరణము (1.30 గం॥)
32. వేదాంతపంచదశి (42 గం॥)
33. శ్రీచక్రాన్ని ఎందుకు పూజించాలి? (1 గం॥)
34. శతరుద్రీయం (10.45 గం॥)
35. శ్రీచక్రనవావరణార్చన (2 గం॥)
36. ద్వాదశ దర్శనాలు (26.40 గం॥)

బిరుదులు :

1. చక్రవిద, శ్రీవిద్యారత్నాకర, శ్రీవిద్యా విశారద, శ్రీవిద్యానిధి.

సన్మానాలు :

1. గుజరాత్ గవర్నర్ శ్రీ నావల్ కిశోర్ శర్మ గారిచే
2. కర్నాటక గవర్నర్ శ్రీ టి.ఎన్. చతుర్వేది గారిచే
3. శ్రీ డి.పాదరావు ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఎస్సెంబ్లీ స్పీకర్ గారిచే
4. జనాబ్ యం.కె. బేగ్ (రాష్ట్ర టెక్నికల్ విద్యాశాఖామాత్యులు) గారిచే
5. శ్రీ దేవినేని రాజశేఖర్ (నెహ్రూ) (రాష్ట్ర టెక్నికల్ విద్యాశాఖామాత్యులు) గారిచే
6. శ్రీ జలగం ప్రసాదరావు, మాజీమంత్రివర్యులచే
7. శ్రీ ఉపేంద్ర, మాజీ కేంద్రమంత్రినర్యులచే
8. రసభారతి (సాహిత్య సంస్థ) వారిచే 8-4-2003
9. భారత వ్యవసాయ పారిశ్రామిక ఎగ్జిబిషన్ సొసైటీ వారిచే
10. అవధూత దత్త పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామి
11. కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ శివచిదానంద భారతిస్వామి
12. గన్నవరం భువనేశ్వరీ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ చిదానంద భారతి స్వామి
13. గుంటూరు శృంగేరి శ్రీ విరూపాక్ష పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ శివకళ్యాణానంద భాగతి మహాస్వామి
14. విశ్వబంధు తపోవనం ట్రస్ట్ అధిపతులు శ్రీశ్రీశ్రీ వాసుదేవానందగిరి స్వామి
15. చైతన్యతపోవనం ట్రస్ట్ అధినేత శ్రీశ్రీశ్రీ మాతా శివచైతన్య
16. కాళీగార్డెన్స్ అధిపతులు శ్రీశ్రీశ్రీ చంద్రకాళీ ప్రసాదమాతాజీ
17. విజయవాడ లలితా పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ మాతా శివలీల

# ప్రణతులు

మానవుడు ఎక్కడ నుంచి వచ్చాడు? మరణానంతరము ఎక్కడికి పోతాడు? ఈ జగత్తుకు కారణం ఎవరు ? పునర్జన్మ ఉన్నదా ? ఈ ప్రశ్నలు అనాదిగా మానవుణ్ణి పీడిస్తూనే ఉన్నాయి దీనికి సంబంధించిన శాస్త్రాన్నే తత్త్వశాస్త్రము అంటారు. మనదేశంలోనే కాదు. ప్రపంచంలోని అన్ని దేశాలలోను ఈ ప్రశ్నలకు సమాధానాలు వెతుకుతున్నారు. ఈ విషయంలో భారతదేశం ముందున్నది. తత్త్వశాస్త్రంలో ముఖ్యమైనవి దర్శనాలు. దర్శనము అంటే చూడటానికి సాధనమైనది, చూపటానికి సాధనమైనది అని అర్థం. భారతీయ తత్త్వాన్ని కళ్ళకు చూపేదే దర్శనశాస్త్రము. వీటిలో ఆస్తికదర్శనాలు-6, నాస్తికదర్శనాలు-3 కాగా అద్వైతము, ద్వైతము, విశిష్టాద్వైతము. వెరసి-12 వీటినే 'ద్వాదశ దర్శనములు' అంటారు. ఇవి కాక శైవ, శాక్తేయ దర్శనాలున్నాయి. కాని అవి కూడా అద్వైతాన్నే బోధిస్తాయి.

తెలుగుభాషలో దర్శనశాస్త్రం మీద పుస్తకము అనేది లేదు. సర్వదర్శన సంగ్రహము అనేది విద్యారణ్యుడు వ్రాసిన సంస్కృత గ్రంథానికి తెలుగు అనువాదం. అందుచేత దర్శనశాస్త్రం అంటే ఏమిటి ? అందులో ఏం చెప్పబడింది? అనే విషయాలు జిజ్ఞాసువులందరికీ తెలియచెయ్యాలనే ఉద్దేశ్యంతో "ద్వాదశ దర్శనములు" అనే పేరుతో ఈ గ్రంథాన్ని ప్రచురించటం జరుగుతోంది. దర్శనశాస్త్రం గురించి కొంతవరకైనా తెలియాలనేదే నా ఆకాంక్ష, బ్రహ్మసూత్రాలు చదవాలన్నా, లలితాసహస్రనామ భాష్యం చదవాలన్నా దర్శనాల జ్ఞానం తప్పనిసరి అందుచేతనే ముఖ్యమైన దర్శనాలను ఇందులో పొందుపరుస్తున్నాను. 2010 జనవల నుంచి నేను చేస్తున్న "వనదుర్గా మహాయాగం"లో భాగంగా ఈ గ్రంథాన్ని ప్రచురించటం జరుగుతోంది. ఈ గ్రంథాన్ని వ్రాసి, ఉపన్యాసాలుగా చెప్పి సిడిలు కూడా విడుదల చేస్తున్నాను. గతంలో నేను ప్రచురించిన పుస్తకాలు, సి.డి.లుగా లాగానే దీన్ని కూడా ఆదరిస్తారని భావిస్తూ....

వికృతినామ సంవత్సర కార్తీక పూర్ణిమ,
ఆదివారం, 21-11-2010

క్రోవి పార్థసారథి
(పరమానందనాథ)

# విషయసూచిక

# ద్వాదశ దర్శనాలు

"వేదాలలో చెప్పబడిన విషయాలను నిర్ణయించి నిర్ధారించి చెప్పటం కోసం ఉత్పన్నమైనదే దర్శనశాస్త్రము" అని యాస్కుడు "నిరుక్తం"లో చెప్పాడు. నిరుక్తం అంటే వేదశబ్దాలకు నిఘంటువు. ఇదే మాటను సత్యవ్రతశ్యామస్వామి తన "నిరుక్తలోచనం"లో చెప్పాడు. దర్శనాలలో ముఖ్యమైనవి ఐదు విషయాలు. 1. వాదము 2. ప్రతివాదము 3. సిద్ధాంతము 4. ఖండన 5. స్థాపన. దర్శనకారుడు ఒక సిద్ధాంతాన్ని కలిగి ఉండి, దానిని స్థాపించటం కోసం అవతలి వ్యక్తితో వాదప్రతివాదనలు జరిపి, వారి వాదనను ఖండించి చివరకు తన సిద్ధాంతాన్ని స్థాపిస్తాడు. దర్శనాలు ప్రతిపాదించే విషయాలన్నింటికీ మూలము వేదమే. దర్శనశాస్త్ర మంటే 'బ్రహ్మవిద్య'

ఆత్మను చూడు, ఆత్మను గురించి విను, ఆత్మను గురించి మాట్లాడు, ఆత్మను గురించి తెలుసుకో, నిరంతరము ఆత్మను గురించి ధ్యానించు. ఈ విధంగా శ్రవణ, మనన, ధ్యానాదుల ద్వారా ఆత్మను గురించి తెలుసుకునేటట్లు చేసేది 'దర్శనశాస్త్రము' మానవుణ్ణి శోకము, మోహము, రాగము మొదలైన వాటినుంచి విముక్తుడుగా చేసేది దర్శనశాస్త్రం. అది బ్రహ్మవిద్య. ఆత్మవిద్య. మోక్షవిద్య. సంసార బంధనాలు త్రెంచివేసే విద్య. "దర్శనశాస్త్రాలన్నీ పరస్పరం విరుద్ధంగా ఉన్నాయి. ఒకరు చెప్పే విషయాన్ని ఇంకొకరు ఖండిస్తారు. కాబట్టి అవన్నీ తప్పుల తడకలు కావాలి లేదా వాటిలో ఒకటి సత్యమైతే, మిగిలినవన్నీ అసత్యాలు కావాలి" అని కొంతమంది వాదిస్తుంటారు. ఈ విషయాన్ని భారతీయ దర్శనాలు అంగీకరించవు. ఇంద్రియానుభవమే జ్ఞానానికి ఆధారమనే మాటను భారతీయ దర్శనకారులు అంగీకరించరు. ఇంద్రియాతీతమైన జ్ఞానం ఒకటి ఉన్నదని వీరు నమ్ముతారు. ఆత్మజ్ఞానమే అన్ని జ్ఞానాలకన్న ఉత్తమమైనది అని వీరు నమ్ముతారు. భారతీయుల దృష్టిలో జ్ఞానమనేది వస్తువుల నాశ్రయించి ఉండదు. ఆత్మని ఆశ్రయించి ఉంటుంది. ఆత్మజ్ఞాన సముపార్జన చెయ్యాలంటే, ఆత్మతత్త్వాన్ని తెలుసుకోవాలంటే దర్శనాలను చదివి తీరాలి.

దర్శనశాస్త్రం రెండు భాగాలుగా ఉన్నది. 1. ఆస్తిక దర్శనాలు 2. నాస్తిక దర్శనాలు

వేద ప్రమాణాన్ని అంగీకరించిన వారు ఆస్తికులు. వేదంలో చెప్పిన విషయాలను అంగీకరించి, వాటిని వృద్ధి చేస్తూ, వాటిని ఖండించిన వారితో వాదనకు దిగి,

వారి వాదాలు ఖండిస్తూ పోయే వారిని ఆస్తికులు అంటారు. ఆ రకంగా రూపొందిన దర్శనాలే ఆస్తిక దర్శనాలు. వీటిలో ప్రముఖమైనవి ఆరు. అవి

1. పతంజలి మహర్షి చెప్పిన యోగదర్శనము
2. జైమిని చెప్పిన పూర్వమీమాంస
3. వ్యాసమహర్షి చెప్పిన ఉత్తరమీమాంస
4. కపిలుడు చెప్పిన సాంఖ్య దర్శనము
5. కణాదుడు చెప్పిన వైశేషిక దర్శనము
6. అక్షపాదుడు చెప్పిన న్యాయదర్శనము

వేదప్రమాణాన్ని నిరాకరిస్తూ, వేదంలో పునరుక్తి దోషాలున్నాయని, అవన్నీ అభూత కల్పనలనీ, కొందరు స్వార్థపరులు కల్పించినవనీ చెప్పేవారు నాస్తికులు. వీరు చెప్పిన దర్శనాలే నాస్తికదర్శనాలు. వాటిలో ముఖ్యమైనవి.

1. చార్వాకుడు ఆదిపురుషుడుగా గల చార్వాక దర్శనము.
2. జినుడు ప్రచారం చేసిన జైన దర్శనము
3. గౌతమబుద్ధుడు ప్రతిపాదించిన బౌద్ధ దర్శనము

ఇవే కాకుండా ఆస్తిక దర్శనాలలో ద్వైతదర్శనము, అద్వైత దర్శనము విశిష్టాద్వైత దర్శనము, ఇలా అనేక దర్శనాలున్నాయి. మొత్తం మీద ఈ దర్శనాలన్నీ ఆత్మ, పరమాత్మ, మరణానంతరము మానవుని స్థితి, మోక్షము వీటిని గురించే వివరిస్తాయి.

ఇక్కడ ముఖ్యమైన ప్రశ్నలు కొన్ని ఉన్నాయి. లోకంలో పుట్టిన ప్రతిజీవి మరణిస్తుంది. మరణానంతరము ఏమవుతుంది? మరణించిన ప్రతిజీవి తిరిగి జన్మిస్తుందా? ఈ జీవితం శాశ్వతం కాదు. ఈ జగత్తు శాశ్వతం కాదు. మరి లోకంలో శాశ్వతమైనది ఏది ? కొంతమంది మానవులు ఉత్తములుగాను కొంతమంది అధములుగాను జన్మిస్తున్నారు. ఎందుచేత ? బంధము అంటే ఏమిటి ? మోక్షమంటే ఏమిటి ? లోకంలో మానవాతీతమైన శక్తి ఏదైనా ఉన్నదా ? ఉంటే అది ఎక్కడ ఉంది ? ఎలా ఉంటుంది ? మానవుడు అత్యంత సుఖాన్ని ఎలా పొందుతాడు? అసలు అత్యంత సుఖం అంటే ఏమిటి ? అనే విషయాలను వివరిస్తుంది దర్శనశాస్త్రం. ఇప్పుడు మనం ఆస్తికదర్శనాలను, నాస్తికదర్శనాలను విడివిడిగా చూద్దాం. ముందుగా ఆస్తికదర్శనాలు.

# 1. యోగదర్శనము

యోగదర్శనాన్ని చెప్పినవాడు పతంజలిమహర్షి. మానవుడికి అంతఃదృష్టి సామర్థ్యాన్ని కలుగచేసేదే యోగశాస్త్రం. ఇది అనుష్ఠాన ప్రాధాన్యత గల శాస్త్రం. సాంఖ్య ప్రవర్తకులు ఎక్కడ ఆగిపోయారో, అక్కడ నుంచి మొదలవుతుంది యోగశాస్త్రము. సాంఖ్యులు "ప్రకృతి పురుషుల సంయోగము బంధహేతువు. ప్రకృతి పురుష వివేక ఖ్యాతి బంధవిముక్తికి ఏకైక మార్గం. ఈ వివేకఖ్యాతి కావాలంటే యోగసాధన చెయ్యాలి" అని చెప్పి అక్కడ ఆగిపోయారు. యోగశాస్త్రం, ఆ యోగాన్ని వివరించి 'యోగదర్శనం' అయింది. సాంఖ్యులు చెప్పిన ఇరవై ఐదు తత్త్వాలకు ఇంకొకటి కలిపి ఈశ్వరుడు అనే ఇరవైఆరవ తత్త్వాన్ని చెప్పారు యోగులు. అంతేకాక సాంఖ్యులు చెప్పిన తత్త్వాలను సాక్షాత్కరించుకునే మార్గం దీనిలో చెప్పబడింది. ఈ రకంగా యోగదర్శనం సాంఖ్యదర్శనంతో గట్టి సంబంధం కలిగి ఉంది.

యోగదర్శనానికి మూలం వేదాలలో ఉంది. వేదాలలో దీన్ని 'ప్రాణవిద్య' అంటారు. ప్రసిద్ధి చెందిన 108 ఉపనిషత్తులలోను 21 ఉపనిషత్తులు యోగవిజ్ఞానానికి సంబంధించినవి. ప్రాచీన భారతీయ సాహిత్యంలోను, జైన బౌద్ధ గ్రంథాలలోను కూడా యోగరహస్యాలు అనేకం చెప్పబడ్డాయి. మనకి లభించిన గ్రంథాలలో పతంజలిమహర్షి వ్రాసిన స్మృతి ప్రకారం యోగశాస్త్ర ప్రవర్తకుడు హిరణ్యగర్భుడు. యోగసూత్రాలు శివప్రోక్తము అని సాంప్రదాయకుల విశ్వాసం. పతంజలి యోగసూత్రాలతో పాటు వ్యాకరణ సూత్రాలు వైద్యశాస్త్రం కూడా వ్రాశాడు అంటారు.

పతంజలి చెప్పిన యోగదర్శనంలో నాలుగు పాదాలున్నాయి. అవి 1. సమాధి పాదం 2. సాధన పాదం 3. విభూతి పాదం 4. కైవల్య పాదం. ఈ దర్శనంలో మొత్తం 195 సూత్రాలున్నాయి. అవి సమాధి పాదంలో 51. సాధన పాదంలో 55, విభూతి పాదంలో 55, కైవల్యపాదంలో 34 సూత్రాలున్నాయి.

**1. సమాధిపాదం :** ఇందులో యోగం యొక్క ఉద్దేశ్యము, లక్షణము, చిత్తవృత్తులు, యోగ ఉపాయాలు, యోగభేదాలు చెప్పబడ్డాయి.

**2. సాధనపాదం :** ఇందులో క్రియాయోగం, క్లేశాలు, కర్మవిపాకము, చతుర్వ్యూహాలు, అష్టాంగయోగం వివరించారు.

**3. విభూతిపాదం :** ఇందులో ధారణ, ధ్యాన, సమాధి, యోగంవల్ల కలిగే వివేక జ్ఞానము, విభూతి చెప్పబడ్డాయి.

**4. కైవల్యపాదం :** ఇందులో ముక్తికి యోగ్యమైన చిత్తం, పరలోక సిద్ధి, బాహ్యార్థసిద్ధి, ఆత్మసిద్ధి, ధర్మమేఘ సమాధి, జీవన్ముక్తి, విదేహ కైవల్యము చెప్పబడ్డాయి.

పతంజలి యోగదర్శనం మీద ప్రామాణికమైన వ్యాఖ్య **'వ్యాసభాష్యం'**. వ్యాస భాష్యానికి **వాచస్పతిమిశ్రుడు** వ్రాసిన **తత్త్వవైశారది** ముఖ్యమైనది. ఇది కాక సాంఖ్యకారుడైన విజ్ఞానభిక్షువు వ్రాసిన **యోగవార్తికము, యోగసార సంగ్రహము** యోగాన్ని వివరించాయి. ఇవి కాక భోజుడు వ్రాసిన **భోజవృత్తి**, భావగణేశుడు వ్రాసిన **భావగణేశవృత్తి**, రామానంద యతి వ్రాసిన **మణిప్రభ**, అనంత పండితుడు వ్రాసిన **యోగచంద్రిక**, సదాశివేంద్ర సరస్వతి వ్రాసిన **యోగసుధాకరము**, నాగోజీభట్టు వ్రాసిన **లఘు, బృహత్‌వృత్తులు** ప్రసిద్ధమైనవి. వీటన్నింటిలోకి భోజవృత్తి, అత్యంత శ్రేష్ఠమైనది.

యోగదర్శనం ప్రకారం జీవుడు స్వతంత్రుడు. అతడు సాధారణంగా స్థూలశరీరాన్ని, ముఖ్యంగా సూక్ష్మశరీరాన్ని (జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి) ఆశ్రయించి ఉంటాడు. స్వాభావికంగా అతడు శుద్ధచైతన్య స్వరూపుడు. శారీరక బంధనాలకు, మానసిక వికారాలకు అతీతంగా ఉంటాడు. అజ్ఞానంవల్ల తనను తాను చిత్తంగా భావించుకుంటాడు. ఆ చిత్తంతో తాదాత్మ్యం పొందుతాడు. చిత్తము అనేది ప్రకృతియొక్క మొదటి వికారం. ఇది త్రిగుణాత్మకం. ఇందులో సత్త్వగుణం ఎక్కువగా ఉంటుంది. చిత్తమనేది ప్రకృతి సంతానం కాబట్టి చిత్తంకూడా జడమే. కాని పురుషుడితో సాన్నిహిత్యం పొంది చైతన్యం పొందుతుంది. చిత్తం శుద్ధసత్త్వం. కాబట్టి అత్యంత నిర్మలం. దానిపై పురుషుని (ఆత్మ) ప్రతిబింబంపడి, దానికి చైతన్యం కలుగుతుంది. ఇంద్రియాల ద్వారా చిత్తానికి ఏదైనా వస్తువుతో సంబంధం కలిగితే, దాని ఆకారం పొందుతుంది. ఇలా చిత్తం వికారాలు పొందుతుంది. చిత్తం పొందే వికారాల ద్వారా పురుషుడికి

విషయజ్ఞానం కలుగుతుంది. స్వభావరీత్యా పురుషుడు నిర్వికారి. కాని నిత్యము పరిణామశీలమైన చిత్తవృత్తులలో ప్రతిబింబిస్తున్న కారణంచేత, అతనిలో పరిణామశీలత ఆభాస మాత్రంగా గోచరిస్తుంది. సరస్సులో నీరు కదులుతున్నప్పుడు, అందులోని చంద్రబింబం కూడా కదులుతున్నట్లుగా ఉంటుంది. అలాగే చిత్తవృత్తులు వికారాలకు లోనవుతుండగా, అవి పురుషుడిలోనే కలుగుతున్నట్లనిపిస్తుంది. ఇక్కడ ముఖ్యమైన విషయం ఏమంటే, వాస్తవానికి చిత్తం ఉపకరణం మాత్రమే. పురుషుడు ద్రష్ట. కాని నిరంతరము పరిణామశీలమైన చిత్తవృత్తులలో ప్రతిఫలిస్తున్న కారణంచేత అతనిలో వికారాల ఆభాసన కలుగుతుంది. చిత్తవృత్తులు ఆగిపోతే వికారాలు తగ్గుతాయి. అప్పుడు పురుషుడిలో వికారాల ఆభాస పోయి, అతడు స్వస్థితి పొందుతాడు. చిత్తవృత్తుల నిరోధాన్ని యోగదర్శనం వివరిస్తుంది.

**యోగస్వరూపము :** 'యోగ' అనే శబ్దానికి **'సమాధి'** అని అర్థం. చిత్తవృత్తులు లేని స్థితినే సమాధి అంటారు. 'యోగః సమాధిః' అని వ్యాసుడు భాష్యం చెప్పాడు. **'యోగశ్చిత్త వృత్తినిరోధః'** యోగం చిత్తవృత్తులను నిరోధిస్తుంది అని పతంజలి యోగసూత్రాలు వివరిస్తున్నాయి. యోగంవల్ల పురుషుడికి స్వస్వరూప జ్ఞానం కలుగుతుంది. చిత్తవృత్తి నిరోధము. ఇక్కడ నిరోధము అంటే లేకుండా చేయటం అని కాదు. అడ్డగించటము, లేదా నిలుపు చేయటము, ఆపటము అని అర్థం. అంటే చిత్తం ఏకాగ్రస్థితిని పొందినప్పుడు బాహ్యావృత్తులు అన్నీ అడ్డగించబడతాయి. క్రొత్తగా వృత్తులు ఏర్పడవు. ఈ రకంగా చిత్తంలో ఏ వృత్తులు లేని స్థితి **'నిరుద్ధస్థితి'** ఈ స్థితిలో అన్ని వృత్తులూ, సంస్కారాలు లీనమై పోతాయి. అప్పుడు చిత్తం శుద్ధ సత్త్వగుణం కలిగి, నిర్మలమైన దర్పణంలాగా ఉంటుంది. ఆ సమయంలో పురుషుడికి వివేకం కలుగుతుంది. అతడు స్వస్వరూప జ్ఞానం పొంది ముక్తుడౌతాడు.

గురూపదేశంతో అవిద్య, అజ్ఞానము నశిస్తుంది. కాని దేహములో ఉండే దోషాలను యోగంతో మాత్రమే నశింపచెయ్యాలి. దేహికి దేహము అద్దం లాంటిది. అద్దం స్వచ్ఛంగా ఉంటేనే, అందులో బింబం చక్కగా కనిపిస్తుంది. అద్దానికి మకిలపడితే, దాన్ని తోమి శుభ్రం చెయ్యాలి. అలాగే దేహంలో ఉండే మాలిన్యాలను యోగాభ్యాసంతో నశింపచెయ్యాలి. గురూపదేశంతో జ్ఞానాన్ని పొంది, విరక్తి చెందిన వాడి, దోషాలను నశింపచెయ్యటానికి యోగాన్ని మించిన మార్గం లేదు. ఇక్కడ

పంచక్లేశములు చెప్పబడుతున్నాయి. అవి 1. అవిద్య 2. అస్మితము 3. రాగము 4. ద్వేషము 5. అభినివేశం.

**1. అవిద్య :** ఇది జ్ఞానానికి విరోధమైన విపర్యజ్ఞానం. అసత్యాన్ని సత్యమని, అనిత్యాన్ని నిత్యమని, అనాత్మ వస్తువును ఆత్మవస్తువని, అపవిత్రమైన దాన్ని పవిత్రమని భావించటము.

**2. అస్మితము :** ప్రకృతి వికారమైన చిత్తం, దర్శనశక్తి భోగసాధనం మాత్రమే అయినప్పటికీ, తానే ద్రష్టనని, భోక్తనని భ్రమించి 'అహమస్మి' అనే అభిమానాన్ని పొందుతుంది. ఇదే అస్మితమనబడుతుంది. ఇక్కడ నిజానికి ద్రష్ట కాని, భోక్త కాని చిత్తమే. పురుషుడు మాత్రం కాదు.

**3. రాగము :** అస్మితవల్ల విషయాల పట్ల రాగద్వేషాలు పుట్టుకొస్తాయి. సుఖము అంటే ఏమిటో తెలుసుకుని దాన్ని పొందాలనే ఆసక్తి కలిగి ఉండటమే రాగం.

**4. ద్వేషం :** దుఃఖము అంటే ఏమిటో తెలుసుకుని,, దాన్ని వదిలించుకోవాలను కోవటం. దాని పట్ల వైరభావం కలిగి ఉండటం. దీన్నే ద్వేషం అంటారు.

**5. అభినివేశం :** అంటే మృత్యుభయం. గతజన్మలో దాన్ని అనుభవించాము. కాబట్టి దానియొక్క వాసనారూప సంస్కారము ఈ జన్మలో కూడా చిత్తాన్ని అంటి ఉంటుంది. అందుచేత మరణము అంటే భయం కలుగుతుంది. ఈ కారణంచేతనే ప్రతి ఒక్కడూ జీవించాలనే ఆశపడతాడు. ఇది పండితులకు గాని, పామరులకు గాని సమానంగానే ఉంటుంది.

ఈ దేహం నాది. ప్రతిపనీ నేనే చేస్తున్నాను వీరంతా నా వాళ్ళు. నా భార్య. నా పిల్లలు. నా ఆస్తిపాస్తులు అనుకుంటాడు అవిద్యతో కూడిన మానవుడు. అజ్ఞానం గనక నశించినట్లైతే, రాగద్వేషాలను వదిలి పెడతాడు. అప్పుడు ఈ లోకంలో గాని, పరలోకంలోగాని భోగాలు పొందాలనే కోరిక ఉండదు. అలా కోరిక లేని పురుషుడు ముక్తి కోసం యోగాన్ని అభ్యసించాలి.

చిత్తవృత్తులు ఐదు రకాలు. 1. ప్రమాణము 2. విపర్యము 3. వికల్పము 4.నిద్రా 5. స్మృతి

**1. ప్రమాణం :** ఇది యధార్థ జ్ఞానసాధనం. యోగదర్శనంలో ప్రత్యక్ష, అనుమాన, ఆగమ ప్రమాణాలు అంగీకరించబడ్డాయి. పురుష సాన్నిధ్యం వల్ల అనుప్రాణితమైన చిత్త చైతన్యం ఇంద్రియాల ద్వారా వస్తు సంసర్గాన్ని పొంది విషయాకార వృత్తి చెందుతుంది. అంటే వస్తువు యొక్క స్వరూపం ప్రత్యక్షంగా తెలుస్తుంది. ఉదాహరణకు ఒక కుండను చూశాం. అలాంటప్పుడు చిత్త చైతన్యం కంటి ద్వారా ఆ కుండ మీద పడి, ఆ కుండ ఆకారం చిత్తంమీద ఏర్పడుతుంది. అప్పుడు చిత్తంలో పురుషుడికి ఘటజ్ఞానం కలిగి, ఇది కుండ అని తెలుస్తుంది. ఇది ప్రత్యక్ష ప్రమాణం. ఇక్కడ ఇంద్రియాలన్నీ చిత్తవృత్తులకు ద్వారాలు. వస్తువు యొక్క ఆకారం, రూపం కంటి ద్వారా, వాసన ముక్కు ద్వారా, రుచి నాలుక ద్వారా తెలుస్తాయి.

**2. విపర్యము :** ఇది మిధ్యాజ్ఞానం. దీన్నే భ్రాంతి లేక భ్రమ అంటారు. దీనివల్ల ఒక వస్తువుని చూసి, వేరొక వస్తువుగా భావిస్తాము. తాడును పాముగా, ముత్యపు చిప్పను వెండి పాత్రగా భావిస్తాము.

**3. వికల్పం :** ఇది కేవలం ఊహ. లేని వస్తువును ఉన్నట్లుగా ఊహించుకోవటం. **'చైతన్యం పురుషస్య రూపం'** అన్నప్పుడు పురుషుడు వేరు చైతన్యం వేరు అంతే కాదు. అతనికి ఒక రూపం కూడా ఉన్నది అనిపిస్తుంది. కాని నిజానికి పురుషుడు, చైతన్యము వేరు వేరు కాదు. రెండూ ఒక్కటే.

**4. నిద్ర :** ఇది ఇంద్రియ వ్యాపారాలు లేని తమోగుణ ప్రాబల్యం గల స్థితి. అందుచేత జాగ్రస్వప్నాలలోని అనుభవాలు ఈ స్థితిలో ఉండవు. కాని నిద్రిస్తున్నాననే జ్ఞానం మాత్రం ఉంటుంది. ఇది కూడా ఒక చిత్తవృత్తే. అందుకే బాగా నిద్ర పోయినవాడు లేచిన తరువాత "హాయిగా నిద్రపోయాను. సుఖంగా ఉన్నది" అంటాడు. ఆ నిద్రలో హాయి, సుఖము అనేవి తెలుస్తాయి. ఇదే సుషుప్తి.

**5. స్మృతి :** గతంలో అనుభవించిన విషయాలను ఇంచుమించు అదే రూపంలో గుర్తు తెచ్చుకోవటం.

చిత్తం ఒక వృత్తికి లోనైనప్పుడు అతడికి అనేక అనుభవాలు కలుగుతాయి. తాను పుడుతున్నాడు, కూర్చున్నాడు, నుంచున్నాడు, పడుకున్నాడు, నడుస్తున్నాడు, తింటున్నాడు, మరణిస్తున్నాడు. ఇలా అనేక క్రియలు శరీరానికి సంబంధించినవి.

మనసుకు సంబంధించిన ఆలోచనలు. పురుషుడు అంటే ఆత్మ వీటన్నింటికీ అతీతమైనది.

చిత్తవృత్తులు ఏర్పడుతున్నంత కాలం, చిత్తం మీద పురుషుని ప్రకాశం పడుతూనే ఉంటుంది. జ్ఞానం లేని కారణం వల్ల విషయలాలసుడైన పురుషుడు చిత్తంతో తాదాత్మ్యం పొందుతాడు. దీని ఫలితంగానే రాగద్వేషాలు, సుఖదుఃఖాలు, సంసార బంధనాలు కలుగుతాయి. ఈ బంధాల నుంచి విముక్తి పొందాలంటే యోగమే శరణ్యము అంటాడు పతంజలి. చిత్తవృత్తులను గనక నిరోధించినట్లైతే, పురుషుడికి చిత్తంతో సంబంధం తెగిపోతుంది. అప్పుడు పురుషుడు స్వస్వరూపాన్ని పొందుతాడు. అదే మోక్షం. అదే యోగ లక్ష్యం అంటోంది యోగదర్శనం.

యోగము అంటే 'సమాధి' అని అర్థం. అది చిత్తవృత్తులు లేని సమాధి. దాన్నే నిర్వికల్ప సమాధి అంటారు. అందుకే **'యోగః చిత్తవృత్తి నిరోధకః'** అన్నాడు పతంజలి. యోగం యొక్క లక్ష్యం స్వస్వరూపాన్ని పొందటం. దీనికోసం చిత్తవృత్తులను నిరోధించాలి. ఇక్కడ నిరోధము అంటే అడ్డగించటము అని అర్థం అంతేకాని లేకుండా చేయటం కాదు "చిత్తం ఏకాగ్రస్థితి పొందినప్పుడు బాహ్యావృత్తులు అన్నీ అడ్డగించబడతాయి. క్రొత్తగా వృత్తులు ఏర్పడవు. ఇలా చిత్తంలో వృత్తులు ఏర్పడని స్థితినే 'నిరుద్ధస్థితి' అంటారు. ఈ స్థితిలో అన్ని వృత్తులు, సంస్కారాలు లీనమై పోతాయి. అప్పుడు చిత్తం శుద్ధ సత్త్వగుణం కలిగి ఉంటుంది. అతని చిత్తం నిర్మలమైన దర్పణం లాగా ఉంటుంది. పురుషుడికి వివేకం కలుగుతుంది. అతడు స్వస్వరూప జ్ఞానం పొంది, ముక్తి పొందుతాడు.

చిత్తానికి ఐదు భూమికలున్నాయి అంటున్నాడు పతంజలి మహర్షి. భూమిక అంటే – అవస్థ అని అర్థం. అవి 1. క్షిప్తావస్థ 2. మూఢావస్థ 3. విక్షిప్తావస్థ 4. ఏకాగ్రావస్థ 5. నిరుద్ధం

**1. క్షిప్తావస్థ :** ఈ దశలో చిత్తం రజోగుణం ఎక్కువగా కలిగి ఉంటుంది. మిక్కిలి చంచలమై విషయాల వైపు పరుగెడుతుంది. స్థిరత్వం అనేది ఉండదు. ఇటువంటి స్థితి యోగానికి అనుకూలం కాదు. ఇంద్రియ లోలురైన వారిలో ఈ స్థితి కనిపిస్తుంది. ఇలాంటివారు సుఖాల కోసం, భోగాల కోసం వెంపర్లాడుతుంటారు.

**2. మూఢావస్థ :** ఈ దశలో చిత్తం తమోగుణం ప్రధానమై ఉంటుంది. నిద్రమత్తుతో ఉన్నట్టుగా మూఢంగా ఉంటుంది. సారాయి, గంజాయి మొదలైన మత్తు మందులకు అలవాటు పడ్డవారి చిత్తం ఈ రకమైనది. వీరికి సోమరితనము, బుద్ధిమాంద్యము బాగా ఉంటాయి. ఈ రకమైన స్థితి కూడా యోగానికి అనుకూలం కాదు.

**3. విక్షిప్తావస్థ :** ఈ దశలో చిత్తం సత్త్వగుణ ప్రధానమై ఉంటుంది. అయితే అప్పుడప్పుడు రజోగుణ ప్రభావం వల్ల చిత్తచాంచల్యం కలుగుతుంటుంది. కొంతసేపు నిలకడగా ఉన్నప్పటికీ, ఆ నిలకడ అనేది స్థిరం కాదు. యోగసాధనలో ప్రాథమిక దశలో ఉన్న వారిలో ఈ స్థితి ఉంటుంది.

**4. ఏకాగ్రావస్థ :** చిత్తం సత్త్వగుణ ప్రధానమైనప్పుడు ఏ రకమైన ఒడిదుడుకులు లేకుండా, అటు ఇటు కదలకుండా, కావలసిన విషయం మీద నిలిచి ఉంటుంది. ఇది యోగసాధనకు బాగా అనుకూలమైన స్థితి.

**5. నిరుద్ధావస్థ :** ఈ స్థితిలో చిత్త వృత్తులు ఏవీ ఉండవు. వృత్తులన్నీ ఉపశమించినా, సంస్కారాలు మాత్రం మిగిలి ఉంటాయి.

వీటిలో మొదటి మూడు అంటే. క్షిప్తావస్త 2. మూఢావస్థ 3. విక్షిప్తావస్థలు యోగసాధనకు అనుకూలం కావు. అయినప్పటికీ, రోజూ అభ్యాసం చెయ్యటం వల్ల ఈ స్థితులన్నీ తొలగిపోయి, ఏకాగ్రస్థితి వస్తుంది. అలా నెమ్మదిగా నిరుద్ధావస్థ సిద్ధిస్తుంది. నిరుద్ధ స్థితి గనక సిద్దించినట్లైతే యోగలక్ష్యం నెరవేరినట్లే.

తీవ్రమైన సాధన చేసే వారికి ఇది ఎంతో కాలం పట్టదు. చాలా త్వరగా సిద్ధిస్తుంది. దీన్ని సాధించటానికి అష్టాంగ యోగసాధనను చెప్పాడు పతంజలి.

**అష్టాంగయోగ సాధన :**

**యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార,**
**ధారణ, ధ్యాన, సమాధయెఅష్టాంగాని** (2-29)

అంటున్నాయి యోగసూత్రాలు. చిత్తంలో మాలిన్యం నశించినట్లైతే, పరిశుద్ధమైన చిత్తం లభిస్తుంది. అప్పుడు పురుషుడికి ఆత్మజ్ఞానం కలుగుతుంది. దీని కోసం అష్టాంగ మార్గం అనుసరించాలి అంటాడు పతంజలి. యోగాంగాలు ఎనిమిది

1. యమము 2. నియమము 3. ఆసనము 4. ప్రాణాయామము 5. ప్రత్యాహారము 6. ధారణ 7. ధ్యానము 8. సమాధి. వీటిలో మొదటి ఐదింటినీ యమాది పంచకము అని మిగిలిన్న మూడింటినీ సంయమము అని అంటారు.

**1. యమము :** యమము అంటే – అణచివేయటము. వశములో ఉంచు కోవటము. అని అర్థము. ఇది ఐదు రకాలు 1. అహింస 2. సత్యము 3. అస్తేయము 4. అపరిగ్రహము 5. బ్రహ్మచర్యము. వీటిని దేశ కాలమానాది భేదం పాటించకుండా, సర్వకాల సర్వావస్థల యందు పాటించి తీరాలి. యమాన్ని పాటించే విషయంలో పట్టు విడుపులు, మినహాయింపులు ఏవీ లేవు. ఇది ఒక గొప్పవ్రతము అంటాడు పతంజలి. ఇవి పాటిస్తే ఏం జరుగుతుంది? అనే దానికి సమాధానం కూడా చెప్పాడు.

**1. అహింస :** ఏ ప్రాణికీ ఎటువంటి పరిస్థితిలోనూ కష్టము, బాధ కలిగించకుండా ఉండటం. దీన్ని సాధించిన వారి సన్నిధిలో అన్ని ప్రాణులు అత్యంత ప్రేమతో మెలగుతాయి. పూర్వకాలంలో ముని ఆశ్రమాలు, ఋషి ఆశ్రమాలలో లేళ్ళు, పులులు, జింకలు కలిసి తిరిగేవి అని చెబుతారు. దానికి కారణం ఇదే. అహింసను పాటించే యోగిసన్నిధిలో క్రూరజంతువులు కూడా సాధుస్వభావానికి అలవాటు పడతాయి. వైరము, శత్రుత్వము అనేవి ఉండవు.

**2. సత్యము :** మనోవాక్కాయ కర్మలలో ఐక్యతను పాటించటం. ఆలోచించేదే చెప్పాలి చెప్పిందే చెయ్యాలి. దీనివల్ల సాధకుడికి కోరిన ఫలితాలు కలుగుతాయి. అమోఘమైన వాక్కు లభిస్తుంది.

**3. అస్తేయము :** పరద్రవ్యాన్ని అపహరించటం దొంగతనం లాంటివి చెయ్యకుండా ఉండటము. దీని వల్ల సాధకుడికి కావలసిన సంపదలు వస్తాయి. దివ్యరత్న ప్రాప్తి కలుగుతుంది.

**4. అపరిగ్రహము :** పరద్రవ్యం కోసం ఆశపడకుండా ఉండటం. ఎవరైనా ఏదైనా ఇచ్చినా, అవసరానికి మించి తీసుకోకపోవటం. దురాశ, లోభత్వము లేకుండా ఉండటము, దీనివల్ల పూర్వజన్మ జ్ఞానం కలుగుతుంది. భూతభవిష్యద్వర్తమాన జన్మల జ్ఞానం కలుగుతుంది.

**5. బ్రహ్మచర్యము :** లైంగిక సుఖాలకు దూరంగా ఉండటము. విషయ సుఖాలు పూర్తిగా వదిలెయ్యటం. దీని వల్ల వీర్య రక్షణ జరిగి, యోగి శక్తిమంతుడవుతాడు.

**2. నియమము :** నియమము అంటే - ఏర్పాటు, కట్టు, ప్రతిజ్ఞ, ఆజ్ఞ, వ్రతనిష్ఠ. అని అర్థము. యమంలాగానే నియమాలు కూడా ఐదు. శౌచ - సంతోష - తపః - స్వాధ్యాయ - ఈశ్వర ప్రణిధానాని నియమాః (2-32) అవి 1. శౌచము 2. సంతోషము 3. తపస్సు 4. స్వాధ్యాయము 5. ఈశ్వర ప్రణిధానము.

**1. శౌచము :** శౌచము అంటే శుద్ధి, పరిశుద్ధము అని అర్థం. ఇది రెండు రకాలు 1. బాహ్యశుద్ధి 2. అంతఃశుద్ధి. బాహ్యశుద్ధి అంటే స్నానం చెయ్యటం, వళ్ళు శుభ్రంగా తోముకోవటం మొదలైన పనుల ద్వారా శరీరాన్ని శుభ్రంగా ఉంచుకోవటం. జుట్టు దువ్వుకోవటం, మంచి బట్టలు కట్టుకోవటం. ఇదంతా బాహ్యశుద్ధి. అంతఃశుద్ధి అంటే నిర్మలమైన మనస్సు కలిగి ఉండటం. మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష వంటి సద్గుణాలను అలవరచుకొని పవిత్రమైన ఆలోచనలు కలిగి ఉండటం. వీటివల్ల యోగియొక్క అంతఃకరణ పరిశుభ్రమవుతుంది. ప్రసన్నత పెరుగుతుంది. ఇంద్రియ నిగ్రహం అలవడుతుంది. ఏకాగ్రత సిద్ధిస్తుంది. మనస్సు గనక నిర్మలమైతే ఆత్మసాక్షాత్కారానికి వీలవుతుంది. ఏకాగ్రత అనేది యోగికి అత్యంతావశ్యకము.

**2. సంతోషం :** దొరికిన దానితో తృప్తి చెందటమే సంతోషము. తన సంతోషమే స్వర్గము, తన దుఃఖమే నరకము అన్నాడు సుమతీశతకకారుడు. దీనివల్ల సాధకుడికి అత్యంత సుఖం కలుగుతుంది.

**3. తపస్సు :** దీనివల్ల శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, ఆకలిదప్పికలు సహించ గల శక్తి లభిస్తుంది. ఇంద్రియాలన్నీ శక్తిమంతమైనాయి. ఇంద్రియ సిద్ధి, కాయసిద్ధి కలుగుతుంది. ఇంద్రియ సిద్ధివల్ల దూరదర్శనము, దూరశ్రవణము మొదలైన శక్తులు వస్తాయి. అణిమాది అష్టసిద్ధులు దివ్యశరీరం గల యోగికి మాత్రమే వస్తాయి.

**4. స్వాధ్యాయము :** తనకు తాను చదువుకోవటము. నియమబద్ధంగా వేదాలు, మంచి గ్రంథాలు, పురాణాలు పఠించటం. తనకు ఇష్టమైన మంత్రాన్ని జపించటం. దీనివల్ల ఇష్టదేవతా సాక్షాత్కారం కలుగుతుంది. గాయత్రి మొదలైన మంత్రజపం వల్ల, పుణ్యగ్రంథాలు పఠించటం వల్ల దేవతా సాక్షాత్కారము జరుగుతుంది.

**5. ఈశ్వరప్రణిధానం :** తనను తాను ఈశ్వరుడికి సమర్పించుకోవటాన్నే 'ఈశ్వరప్రణిధానము' అంటారు. దీనివల్ల యోగసాధన పరమార్థమైన నిశ్చలమైన సమాధి లభిస్తుంది.

**3. ఆసనము :** ఆసనము అంటే-కూర్చునే పీట, కూర్చునే విధానము. శరీరం దృఢంగా, ఆరోగ్యంగా, బలంగా ఉండాలి. అలా ఉంటేనే ఏకాగ్రత అనేది సిద్ధిస్తుంది. ఈ ఏకాగ్రత అనేది బాగా వృద్ధి చెంది 'సమాధినిష్ఠ' కలుగుతుంది కదలకుండా సుఖంగా కూర్చోవటమే ఆసనము అన్నాడు పతంజలి. ఆసనసిద్ధి వల్ల యోగిని శీతోష్ణాలు, సుఖదుఃఖాలు బాధించవు. ధ్యానానికి కూర్చునేటప్పుడు యోగి పద్మాసనంలో కూచోవాలి. ఇది ఎక్కువ మంది యోగులకు ఇష్టమైన ఆసనం. అయితే బద్ధపద్మాసనము, వీరాసనము, మయూరాసనము, వజ్రాసనము ఇలా అనేక రకాల ఆసనాలున్నాయి. వీటివల్ల శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. భగవద్ధ్యానం చేస్తూ ఈ ఆసనాలు వెయ్యాలి. అప్పుడే అవి యోగాసనాలవుతాయి. లేకపోతే కేవలం అది శరీర వ్యాయామం అవుతుంది.

**4. ప్రాణాయామము :** ఏ విధమైన ప్రయత్నము లేకుండా స్థిరంగా, సుఖంగా, నిటారుగా కూర్చునే సామర్థ్యం పెరిగి, మనస్సును ఏకాగ్రం చెయ్యగలిగితే ఆసనసిద్ధి కలిగినట్లే అంటాడు పతంజలి. అటువంటి స్థితిలో ఉచ్ఛ్వాస నిశ్శ్వాసలు ఆగిపోతాయి. ఆ స్థితినే ప్రాణాయామము అంటారు. పతంజలి ప్రాణాయామము నాలుగు రకాలు అన్నాడు.

**1. బాహ్యస్తంభన :** ప్రాణవాయువును బయట నిలపటం

**2. అంతఃస్తంభన :** ప్రాణవాయువును లోపల నిలపటం

**3. దీర్ఘం, సూక్ష్మం :** అవసరాన్ని బట్టి శరీరంలోని వివిధ భాగాలలో ప్రాణవాయువును కొంతసేపు ఆపటం.

**4. బాహ్యాంభ్యంతర విషయాక్షేపి :** దీన్నే సహజకుంభకము అంటారు. ప్రాణవాయువు లోపల నుంచి బయటకు గాని, బయట నుంచి లోపలికి గాని పోదు. ఈ స్థితిలో మనస్సు నిశ్చలంగా ఉంటుంది.

ప్రాణము అంటే శ్వాస. అపానము అంటే ప్రశ్వాస. వీటినే ఉచ్ఛ్వాస నిశ్శ్వాసలంటారు. వీటి గతిని నిరోధించటమే ప్రాణాయామము అనబడుతుంది. బయట

ఉన్న గాలిని లోపలికి పీల్చటం–నిశ్వాస. లోపలిగాలిని బయటకి వదలటం ఉచ్ఛ్వాస. ఈ రెండింటినీ నిరోధించటమే ప్రాణాయామము. ప్రాణాయామం చెయ్యాలి అంటే – ముందుగా ఆసనసిద్ధి జరగాలి. ప్రాణాయామము రేచకము, పూరకము, కుంభకము అని మూడు రకాలు. 1. గాలిని పూర్తిగా వదిలి కొంతసేపు ఉండటాన్ని రేచకము అంటారు. 2. గాలిని పీల్చి కొంతసేపు ఉండటాన్ని పూరకము అంటారు. 3. లోపలి గాలిని పూర్తిగా స్తంభింపచేయటాన్ని కుంభకము అంటారు. గాలిని స్తంభింప చేసినప్పుడు నిండుకుండలోని నీరులాగా ప్రాణవాయువు స్థిరంగా నిలచి ఉంటుంది. అందుకే దీన్ని కుంభకము అన్నారు. కుంభకము రెండు రకాలు 1. బాహ్యకుంభకము 2. అంతః కుంభకము. గాలిని విడిచిపెట్టిన తరువాత చేసే కుంభకము బాహ్యకుంభకము. గాలిని పీల్చి చేసే కుంభకాన్ని అంతఃకుంభకము అంటారు. ఈ రెండింటికీ విలక్షణమైనది 'కేవల కుంభకము' రేచకము, పూరకము, బహికుంభకము, అంతఃకుంభకము వీటన్నింటినీ వదిలేసి, లోపలిగాలి బయటకు వదలకుండా, బయట గాలి లోపలికి పీల్చకుండా ప్రాణవాయువును యథాస్థితంగా నిలిపి, చిత్స్వరూపం మీద మనసు లగ్నం చెయ్యటమే **'కేవల కుంభకము'** అనబడుతుంది. ఇది రేచక పూరక కుంభకాలకు వ్యతిరేకమైన నాల్గవ ప్రాణాయామము దీనివల్ల అజ్ఞానము, పాపాలు నశిస్తాయి. నిద్ర అలసత్వము గల మందమాధ్యమాధికారులకు రేచక, పూరక, కుంభకాలు చెప్పబడ్డాయి. నిద్ర, తంద్ర మొదలైనవి లేని ఉత్తమాధికారులకు కేవల కుంభకము చెప్పబడింది. రేచక పూరకాలను పూర్తిగా వదిలిపెట్టి సుఖంగా వాయుధారణ చేసి పరమాత్మను ధ్యానం చెయ్యటమే కేవల కుంభకం. ఇది సిద్ధించిన యోగికి ముల్లోకాల్లోనూ సాధ్యం కానిది ఏదీ లేదు అని యోగవాసిష్టంలో చెప్పబడింది. ఆసనాలలాగానే ప్రాణాయామంలో కూడా పతంజలి తరువాత కాలంలో అనేక రకాలు ప్రచారంలోకి వచ్చాయి. ఏది ఏమైనా ప్రాణాయామం చెయ్యటం వల్ల చిత్తాన్ని ఆవరించిన మాలిన్యాలు తొలగిపోయి ఏకాగ్రత పెరుగుతుంది. ధారణకు యోగ్యత కలుగుతుంది.

**5. ప్రత్యాహారము :** ఇంద్రియాలను బాహ్య విషయాలనుంచి మళ్ళించి, అంతర్ముఖం చెయ్యటాన్నే ప్రత్యాహారము అంటారు. చలిస్తున్న శ్రోత్రము మొదలైన ఇంద్రియాలను శబ్దము మొదలైన వాటి విషయాలనుంచి మళ్ళించి చిత్తాన్ని అనుసరింప చెయ్యటమే ప్రత్యాహారము. ప్రత్యాహారం వల్ల ఇంద్రియ వశీకరణ

జరుగుతుంది. ఇంద్రియాలన్నీ సాధకుడి వశంలో ఉంటాయి. ఇంద్రియాలు వాటి స్వరూపాన్ని వదిలిపెట్టి చిత్తాన్ని అనుసరించటంతో చిత్తనిరోధము, దానితో ఇంద్రియ నిరోధము జరిగి, ఇంద్రియ నిగ్రహము సులభంగా లభిస్తుంది.

**6. ధారణ :** శరీరంలోని ఏదైనా ఒక భాగంలో అంటే హృదయంలో, నాసికాగ్ర భాగంలో, భ్రూమధ్యంలో ఎక్కడైనా సరే చిత్తాన్ని లగ్నం చేయటమే ధారణ. ధారణ రెండు రకాలు 1. బాహ్యము 2. అంతరము. బాహ్య దేశములు. దేవతా ప్రతిమల యందు మనస్సును లగ్నం చెయ్యటమే బాహ్యధారణ. నాభిచక్రము మొదలైన స్థానములందు చిత్తాన్ని నిలపటం అంతర్ ధారణ. నాభిచక్రము అంటే మణిపూరము. శరీరంలో షట్చక్రాలున్నాయి. అవి

**1. మూలాధారము :** ఇది గుదస్థానంలో ఉండే నాలుగు దళాలు గల పద్మము.

**2. స్వాధిష్ఠానము :** లింగస్థానములో ఉండే ఆరుదళాలు గల పద్మము.

**3. మణిపూరము :** నాభిస్థానంలో ఉండే పది దళాలు గల పద్మము.

**4. అనాహతము :** హృదయ స్థానంలో ఉండే పన్నెండు దళాలు గల పద్మము.

**5. విశుద్ధిచక్రము :** కంఠస్థానంలో ఉండే పదహారు దళాలు గల పద్మము.

**6. ఆజ్ఞాచక్రము :** భృకుటి స్థానంలో ఉండే రెండు దళాలు గల పద్మము.

**7. సహస్రదళ పద్మము :** శిరస్సుపైన (నడినెత్తిన) అథోముఖంగా ఉండే వేయి దళాలు గల పద్మము.

చిత్తాన్ని నాసాగ్రాన కాని, షట్చక్రాలయందు గాని నిలపటాన్నే అభ్యంతరధారణ అంటారు. యమనియమాలు పాటిస్తూ నియమం తప్పకుండా ప్రాణాయామం చేస్తూ ఉండటం వల్ల చిత్తము నిర్మలమై ఏకాగ్రత సిద్ధిస్తుంది. సాధకుడు దేనిమీదనైనా మనసు లగ్నం చెయ్యగలుగుతాడు.

**7. ధ్యానం :** ఒకే విషయం మీద మనస్సును (చిత్తాన్ని) నిలిపి ఆ విషయాన్నే మననం చెయ్యటం. ధారణలో నిలిచిన చిత్తము ఇతర విషయాలకు అతీతమై, ధ్యేయమైన పరబ్రహ్మ యందే ఏకాగ్రతతో ఉండటాన్నే 'ధ్యానము' అంటారు.

**8. సమాధి :** యోగసాధనలో ఇది చివరిమెట్టు. విక్షేపాలు తొలగిపోయి, చిత్తం ధ్యేయవస్తువునందు ఏకాగ్రం కావటమే సమాధి అనబడుతుంది. ధ్యానించేవాడు

(ధ్యాత) ధ్యాన విషయము (ధ్యేయము) ధ్యానక్రియ (ధ్యానము) ఈ మూడు, సమాధిలో ఐక్యత పొందుతాయి. త్రిపుటిలో అంటే ధ్యాత ధ్యానము ధ్యేయము ఒకటే అయిన స్థితిలో ధ్యానము ధ్యేయాకారాన్ని పొంది స్వరూపశూన్యం అవుతుంది. ధ్యానస్థితిలో త్రిపుటి జ్ఞానం ఉంటుంది. సమాధిలో అవేవీ ఉండక ధ్యేయాకారాన్ని ధరిస్తాయి. ఇది ధ్యేయాకార వృత్తి. ధ్యాతకు తనను గూర్చిన ధ్యాస ఏ మాత్రము ఉండదు. తాను చేస్తున్న ధ్యానక్రియను గురించిన జ్ఞానము కూడా ఉండదు. కేవలము ధ్యేయ వస్తువు మాత్రమే నిలిచి పోతుంది. అంటే తాను ధ్యానం చేసే పరమేశ్వర స్వరూపం తప్పించి ఇంకేమీ ఉండదు. అదికూడా అర్థమాత్రంగా అంటే ఉండీ ఉండనట్లుగా ఉంటుంది.

**సమాధి రెండు రకాలు :** 1. సంప్రజ్ఞాత సమాధి 2. అసంప్రజ్ఞాత సమాధి

**1. సంప్రజ్ఞాత సమాధి :** చిత్తం యొక్క ఏకాగ్రావస్థని 'సంప్రజ్ఞాత యోగము' అంటారు. దీన్నే సంప్రజ్ఞాన సమాధి అని కూడా అంటారు. ఈ స్థితిలో చిత్తానికి ధ్యేయ వస్తువు జ్ఞానము. చిత్తం ఆ ధ్యేయ వస్తువులో లీనమై పోతుంది. ఇటువంటి స్థితి వల్ల సాధకుడిలో ప్రజ్ఞ పెరిగి, ఇతర వృత్తులన్నీ నశిస్తాయి. అయితే ఏకాగ్రతను సాధించటం కోసం ఏదైనా ఒక ధ్యేయ వస్తువుని ఆలంబనగా తీసుకుంటారు. అంటే ఎదురుగా ఏదైనా ఒక వస్తువును ఉంచి సాధన చేస్తారు. అందుకే దీన్ని 'సబీజ సమాధి' అంటారు. చిత్తం ఏకాగ్రమైనప్పుడు క్లేశాలు నశించిపోతాయి. సత్పదార్థం గోచరిస్తుంది. కర్మబంధనాలు తెగిపోతాయి. అది క్రమంగా నిరుద్ధస్థితికి చేరుతుంది. అయితే సంప్రజ్ఞాత సమాధి నాలుగు రకాలు 1. వితర్కానుగతము 2. విచరానుగతము 3. ఆనందానుగతము 4. అస్మితానుగతము.

**1. వితర్కానుగతము :** వస్తువులు స్థూలము, సూక్ష్మము అని రెండు రకాలు. చిత్తం స్థూలవస్తువులతో కలిసి, వాటి ఆకారాన్ని పొందినప్పుడు దాన్ని 'వితర్కానుగతము' అంటారు. స్థూలవస్తువును ధ్యానం చేస్తున్నప్పుడు, ఆ శబ్దము దాని అర్థము, అది దేనికి సంకేతమో ఆ వస్తువు, ఈ మూడు ఒకటై భావనలో నిలిచిపోతాయి. 'రామ' అనే శబ్దాన్ని ఉచ్ఛరించినప్పుడు పైన చెప్పిన మూడూ ఒకటై పోయి భావనలో రాముడి రూపం నిలిచిపోతుంది. ఈ స్థితినే **సవితర్కసమాధి** అంటారు. శబ్దం అవసరం లేకుండా అర్థ భావనలో ఉండిపోతే, దాన్ని '**నిర్వితర్కసమాధి**' అంటారు.

**2. విచరానుగతము :** చిత్తాలంబనం సూక్ష్మమై, అది ఆ ఆకారాన్ని పొందినట్లైతే దాన్ని **'విచరానుగతము'** అంటారు.

**3. ఆనందానుగతము :** సూక్ష్మవస్తువు యొక్క ఆలంబనం పొందటంతో, చిత్తం సత్త్వగుణ ప్రాధాన్యత పొందుతుంది. సత్త్వగుణ ప్రభావం వల్ల దానికి ఆనంద ప్రాప్తి కలుగుతుంది. అటువంటి స్థితినే **'ఆనందానుగతము'** అంటారు.

**4. అస్మితానుగతము :** చిత్ పదార్థం చేత ప్రతిబింబమైన అంతఃకరణే చిత్తం. ఇటువంటి చిత్తానికి అహం అనే బుద్ధి, ఇంద్రియాల వల్ల కలుగుతుంది. ఏకాగ్రత యొక్క అత్యంత సూక్ష్మావస్థలో చిత్పదార్థం, చిత్తం ఒకటే అనే జ్ఞానాన్ని పొందుతుంది. ఇంద్రియాలు సూక్ష్మమైనవి. వాటికన్న కూడా మిక్కిలి సూక్ష్మమైన అవస్థ ఇది. ఈ స్థితిలో **'అహమస్మి'** నేను ఉన్నాను అనే ఎరుక కలుగుతుంది. అందుకే దీన్ని **'అస్మితాను గతావస్థ'** అంటారు.

**2. అసంప్రజ్ఞాత సమాధి :** సాధకుడికి త్రిపుటి అంటే జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము ఒకటే అయిన స్థితి సూక్ష్మమైనప్పుడు, చిత్త వృత్తులన్నీ నాశనమయి పోతాయి. అప్పుడు నిరుద్ధస్థితి ప్రాప్తిస్తుంది. ఆ స్థితిలో అతడికి ఏ రకమైన ఆలంబన అవసరముండదు. సంస్కారాలు మాత్రమే మిగిలి ఉంటాయి. అటువంటి స్థితిని **'అసంప్రజ్ఞాత సమాధి'** అంటారు. ఇదే **నిర్బీజ సమాధి** లేదా **నిర్వికల్ప సమాధి** అసంప్రజ్ఞాత సమాధి రెండు రకాలు 1. భవప్రత్యయము 2. ఉపాయ ప్రత్యయము.

**1. భవప్రత్యయము :** ఇది అవిద్యతో కూడినది. భవము అంటే అవిద్య. ఇటువంటి సమాధి స్థితిలో చిత్త నిరోధం సిద్ధించినప్పటికీ, సంస్కారాలు ఇంకా మిగిలి ఉంటాయి. రక్తము, మాంసము, మేధ, మజ్జ, శుక్రము అనే పదార్థాలతో శరీరము కూడి ఉంటుంది. ఈ శరీరము పతనమైనప్పుడు సంస్కారాలు మనసును ఆశ్రయించి ఉంటాయి. అటువంటి స్థితిలో జీవుడు **విదేహుడు** అనగా దేహము లేనివాడు అనబడతాడు. ఈ విదేహావస్థ కైవల్యానికి చాలా దగ్గరగా ఉంటుంది. ఇక్కడ సంస్కారాలు మిగిలి ఉన్నాయి కాబట్టి పూర్తిగా వివేకం సిద్ధించదు. అందుచేత జీవుడు తిరిగి సంసారంలో ప్రవేశిస్తాడు. అంటే సంస్కారాలు పోయేదాకా పునర్జన్మ ఎత్తాలి. చిత్తనిరోధం సిద్ధించినప్పటికీ జీవుడి మనస్సు అవ్యక్తము, మహత్తత్త్వము,

అహంకారము, తన్మాత్రలు వీటిలో ఏదో ఒకదాన్ని ఆత్మగా భావిస్తుంది. ఇదే అవిద్య. స్థూలశరీరం నాశనమైనప్పుడు జీవిఅంతఃకరణ అవిద్యతో కూడి ఉంటుంది. అందుచేత మహదాదులలో లీనమై, కొంతకాలం తరువాత సంసారంలో తిరిగి ప్రవేశిస్తుంది. ఇటువంటి జీవులను **'ప్రకృతిలీనులు'** అంటే ప్రకృతిలో లీనమైన వారు అంటారు. మహదాదులు ప్రకృతి సంతానం అని గుర్తుంచుకోవాలి. వర్షాకాలం పూర్తయిన తరువాత కప్ప మట్టిలో కూరుకుపోయి, మళ్ళీ వర్షాకాలం వచ్చిన తరువాత బయటకు వచ్చినట్లుగానే ప్రకృతిలో లీనమయిన వారి స్థితి కూడా ఉంటుంది. అయితే ఇది **యోగి లక్షణం కాదు.** ఇది భవ ప్రత్యయ సమాధి.

**2. ఉపాయ ప్రత్యయము :** ఇది అత్యంత శ్రేష్ఠమైన స్థితి. యోగలక్ష్యం ఇదే. శ్రద్ధ, వీర్యము, స్మృతి, సమాధి, ప్రజ్ఞల వల్ల మాత్రమే ఈ స్థితి ప్రాప్తిస్తుంది అని యోగసూత్రాలు చెబుతున్నాయి. శ్రద్ధ అనేది యోగసాధన చేసే వారికి తల్లి లాంటిది. ప్రక్కత్రోవలు పట్టి పోకుండా అతణ్ణి రక్షిస్తుంది. వీర్యము అంటే బ్రహ్మచర్యం వల్ల లభించే ధారణశక్తి. స్మృతి అంటే ధ్యానం. సమాధి అంటే - సంప్రజ్ఞాత సమాధి అని అర్థం. సంప్రజ్ఞాత సమాధి వల్ల యోగిలో ప్రజ్ఞ ఉదయిస్తుంది. ఈ ప్రజ్ఞ వల్ల వివేకం పుడుతుంది. వివేకము అంటే ప్రకృతి వేరు, పురుషుడు వేరు అనే జ్ఞానం. అభ్యాసం వల్ల ఈ జ్ఞానం స్థిరపడితే వైరాగ్యం బలపడుతుంది. అప్పుడు **అసంప్రజ్ఞాత సమాధి** సిద్ధిస్తుంది. ఎన్ని అవాంతరాలు వచ్చినా, ఆగకుండా అభ్యాసం చేస్తేనే ఈ స్థితి సిద్ధిస్తుంది.

ధారణ, ధ్యానము, సమాధి అనే మూడింటికీ కలిపి సంయమము అని పేరు. ఇది యోగశాస్త్ర పారిభాషిక పదము. ఈ సంయమ జయము అంటే ధారణ ధ్యాన సమాధి సిద్ధివల్ల యోగికి ప్రజ్ఞాలోకము (సమాధి ప్రజ్ఞాప్రభ) లభిస్తుంది. ఈ ప్రజ్ఞా దీప్తికే **'ఋతంభర'** అని పేరు. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహారాల (యమాదిపంచకము) వల్ల ధారణ, ధ్యాన, సమాధులు (సంయమము) లభిస్తుంది. సంప్రజ్ఞాత సమాధికి యమాది పంచకము బహిరంగము. ధారణాదిత్రయము అంతరంగము. అసంప్రజ్ఞాత సమాధికి ధారణాదిత్రయము కూడా బహిరంగమే. యోగాభ్యాసం చేసేవారు ఈ భూమికలను ఒక దాని తరువాత ఒకటిగా అధిరోహిచాలి. అలా కాకపోతే అనేక ఉపద్రవాలు వస్తాయి. ఎక్కిళ్ళు, పడిసెము,

చెవిపోటు, పంటిపోటు, కంటిపోటు, మూగతనము, దగ్గు, జ్వరము ఇవన్నీ ఆ ఉపద్రవాలే. యోగం గనక సిద్ధించినట్లైతే అనేకమైన రోగాలు తగ్గిపోతాయి.

యోగం సిద్ధించబోతున్న దశలో అంటే 'సంయమ' దశలో యోగికి అనేక సిద్ధులు ప్రాప్తిస్తాయి. అనేక శక్తులు వస్తాయి. వీటిలో ఎనిమిది సిద్ధులు ముఖ్యమైనవి. అవి :

1. అణిమాసిద్ధి : శరీరం చిన్నదిగా చేయటం
2. లఘిమాసిద్ధి : శరీరం దూదిపింజలా తేలికగా చెయ్యటం.
3. మహిమాసిద్ధి : శరీరాన్ని పెద్దదిగా చెయ్యటం.
4. గరిమాసిద్ధి : శరీరాన్ని అతిబరువుగా చెయ్యటం.
5. ఈశిత్వసిద్ధి : అన్నింటిమీద అధికారం సంపాదించటం
6. వసిత్వసిద్ధి : సర్వప్రాణులను వశం చేసుకోవటం.
7. ప్రాప్తిసిద్ధి : కోరిన వస్తువులు పొందటం.
8. ప్రాకామ్యసిద్ధి : అన్ని కోరికలు పూర్తి కావటము.

ఈ స్థితిలో యోగి ఆకాశగమనము, దూరదృష్టి, దూరశ్రవణము మొదలైన సిద్ధులు కూడా పొందుతాడు. అష్టసిద్ధులు పొందిన యోగి పంచభూతాలను కూడా నియంత్రించగలుగుతాడు. అందమైన శరీరం, అపారమైన బలం, అద్వితీయమైన శక్తి కూడా ప్రాప్తిస్తాయి. ఈ విషయాలన్నీ విభూతిపాదంలో చెప్పబడ్డాయి. ఈ సిద్ధులన్నీ పరమార్థసాధనకు అంతరాయాలు. కాబట్టి యోగి వీటి వ్యామోహంలో పడరాదు.

**ఈశ్వరుడు :** యోగదర్శనంలో ఈశ్వరుడున్నాడు. సాంఖ్యులు చెప్పిన ఇరవై ఐదు తత్త్వాలు గాక ఇరవై ఆరవ తత్త్వంగా ఈశ్వరుణ్ణి చెప్పారు. అందుకే దీన్ని 'సేశ్వరసాంఖ్యము' అన్నారు.

ఇక్కడ ఈశ్వరుడు అంటే విశిష్టమైన పురుషుడు. అతడికి క్లేశాలు, కర్మలు, కర్మఫలితాలు ఉండవు. సాధారణ పురుషుడు ముక్తుడు కాక ముందు ప్రకృతిచేత బద్ధుడు. అతడు బంధనాలను త్రెంచుకోవాలి. యోగసాధనలో ప్రకృతిలో

లీనమైనవాడు తిరిగి ప్రకృతి బంధాలలో చిక్కుకుంటాడు. ఈశ్వరుడు అలా కాదు. అతడు సర్వకాల సర్వావస్థల యందు ముక్తుడే. అతడికి బంధనాలుండవు. రాగద్వేషాలుండవు. అసలు ఏవీ ఉండవు. అందుచేతనే ప్రకృతిలీనులకన్న, ముక్తపురుషుల కన్న కూడా ఈశ్వరుడు విశిష్టుడు. అతడు సర్వజ్ఞుడు. త్రికాలాతీతుడు. త్రిమూర్తులకన్న ముందున్న వాడు. బ్రహ్మకు వేదాలు ఉపదేశించిన వాడు.

యోగదర్శనంలో ఈశ్వరుణ్ణి గురించి అనేకసార్లు చెప్పారు. ఈశ్వరుని యందు మనస్సు నిశ్చలంగా నిలిపినట్లైతే సాధకుడికి సమాధి సిద్ధించి, సాధన పరమార్థం నెరవేరుతుంది. ఈశ్వరుని యందు మనస్సు లగ్నం చేసినట్లైతే అతడు ప్రసన్నుడవుతాడు. దాని ఫలితంగా అడ్డంకులు తొలగిపోయి సమాధి సులభంగా సిద్ధిస్తుంది. యోగదర్శనంలో ఈశ్వరుడే ఆదిగురువు. ముక్త పురుషులందరికీ అతడే గురువు. అతడే మోక్షప్రదాత. ప్రణవమే అతని సంకేతం. ప్రణవాన్ని జపిస్తూ, దాని అర్థాన్ని మననం చేస్తూ, ఈశ్వర ప్రణిదానం చెయ్యాలి. ప్రణిదానం అంటే మనస్సును నిశ్చలంగా ఉంచటం. అలా చేస్తే శ్రమ లేకుండా సమాధి స్థితి సిద్ధిస్తుంది. తాను ప్రకృతికన్న వేరైనవాణ్ణి అనే జ్ఞానం కలుగుతుంది. జీవితమంతా సమాధి స్థితిలో ఉండటం వీలుకాదు. కాని ఎక్కువ కాలం సమాధి స్థితిలో ఉండే వారికి పునర్జన్మ ఉండదు. అయితే యోగదర్శనంలో ఎక్కడా కూడా ఈశ్వరుడు సృష్టి స్థితి లయకారకుడని గాని, ముల్లోకాలు శాసించే వాడని గాని, సర్వవ్యాపకుడు అని గాని చెప్పలేదు.

సాంఖ్యుల మాదిరిగానే యోగులు కూడా ప్రకృతి పరిణామవాదాన్ని అంగీకరిస్తున్నారు. జ్ఞానులు జ్ఞానంవల్ల ముక్తి కలుగుతుంది అంటారు. యోగులు ముక్తికి సాధనము జ్ఞానమే కాక అష్టాంగయోగాన్ని కూడా అవలంబించాలి అంటున్నారు. సాంఖ్యులు చెప్పే పురుషులు నిర్గుణులు. ఈ విషయాలను వేదాంతులు కూడా ఒప్పుకుంటున్నారు. సాంఖ్యులు పురుషులు అనేకులు అంటారు. కాని అద్వైతుల దృష్టిలో ఆత్మ ఒక్కటే. ప్రకృతి బంధనాల నుంచి విడిపోవటమే మోక్షము. అటువంటి వారికి పునర్జన్మ లేదు.

# 2. పూర్వమీమాంస

క్రీస్తుపూర్వము 4వ శతాబ్దంలో కృష్ణద్వైపాయనుడి శిష్యుడైన జైమిని ఈ గ్రంథం వ్రాశాడు. దీనికి శబరస్వామి భాష్యం వ్రాశాడు. క్రీస్తుశకము 7వ శతాబ్దంలో కుమారిలభట్టు శబర భాష్యానికి వ్యాఖ్య వ్రాయగా క్రీ॥శ॥ 650కి చెందిన ప్రభాకర మిశ్రుడు కూడా 'బృహతి' అనే వ్యాఖ్య వ్రాశాడు.

వీరి సిద్ధాంతము ప్రకారము వేదాలు నిత్యములు, అపౌరుషేయాలు. ఇందులో అనుమానం లేదు. సర్వజ్ఞుడైన పురుషుడు ఎవరైనా వాటిని చెప్పి ఉండవచ్చు అనే వైశేషికులవాదన కూడా వీళ్ళు అంగీకరించరు. మీమాంసకుల ప్రకారము సర్వజ్ఞుడైన పురుషుడు ఈ కాలంలో గాని, పూర్వకాలంలో గాని ఎవ్వరూ లేరు. ఏ మానవుడు సర్వజ్ఞుడు కాలేడు. వేదాలు ఈశ్వర నిర్మితాలు కావు. అసలు ఈశ్వరుడున్నాడని వీరు ఒప్పుకోరు. ఈశ్వరుడు లేకుండా ఈ ప్రపంచం ఎలా ఆవిర్భవించింది? అంటే ఈ ప్రపంచం ఎవరిచేతా సృష్టించబడింది కాదు. ఇది శాశ్వతంగా ఇలాగే ఉంటుంది. ఈశ్వరుడున్నాడనటానికి ప్రమాణం ఏమీ లేదు. ఒకవేళ ఈశ్వరుడున్నా అతడు సర్వజ్ఞుడు కాడు. ఆయనకు నోరు లేదు. కాబట్టి మాట్లాడలేడు. నోరులేనివాడు వేదాలనెలా చెబుతాడు? వేదాలలో కొన్ని విశేషమైన అర్థాలున్నాయి. అవి స్వతస్సిద్ధాలు. అవి ఎవరితోనూ చెప్పబడినవి కావు. అందుకే అవి పరమప్రమాణాలు. వేదాలు ఈశ్వరుని నుంచి వచ్చినాయి. అంతేకాని ఈశ్వరుడు రచించినవి కాదు. మన దేశంలో అన్నింటికీ ప్రమాణం వేదం. మరి ఆ వేదానికి ప్రమాణం ఏముంటుంది? అందుకే వేదాలు స్వతఃప్రమాణాలు. ఈ వేదాలను సరిగా అర్థం చేసుకోటానికే షట్శాస్త్రాలు చెప్పబడ్డాయి. ఇవి ఆరు శాస్త్రాలు. 1. తర్కము 2. వ్యాకరణము 3. ధర్మము 4. మీమాంస 5. వైద్యము 6. జ్యోతిషము అని కొందరు, 1. శిక్ష 2. వ్యాకరణము 3. అలంకారము 4. జ్యోతిషము 5. ఛందస్సు 6. తర్కము అని కొందరు చెబుతారు. మాధవ విద్యారణ్యుడు పూర్వమీమాంసని ఆధారంగా తీసుకుని వేదానికి భాష్యం చెప్పాడు. పూర్వమీమాంస గనక తెలియకపోతే వేదవాక్య నిర్ణయం చెయ్యటం సాధ్యం కాదు. వేదవాక్య నిర్ణయానికి కావలసిన మర్యాదలు, సంప్రదాయాలను మీమాంసశాస్త్రం చెప్పింది. వేదవిద్య గ్రంథస్తం కాదు. అది కంఠస్తము. ఇది గురుశిష్య సంప్రదాయంగానే వచ్చింది. అందుకే ఇది

'శ్రూయమానము' అంటారు. గురుముఖతః అధ్యయనం చేస్తేనే అపూర్వత కలుగుతుంది. విధులు మూడు రకాలు 1. విధి 2. నియమవిధి, 3. పరిసంఖ్యావిధి అని వేదవాక్యాలను మూడు రకాలుగా మీమాంసకులు నిర్ణయించారు. కొన్ని వేదవాక్యాలు ఆయా కర్మలను విధిస్తాయి అంటే నియమాలను విధిస్తాయి. వడ్లనుంచి బియ్యం తియ్యాలి అన్నప్పుడు ఎన్నో రకాలుగా బియ్యం తియ్యచ్చు. వడ్లు దంచి, చేత్తోవలచి, కాళ్ళతో తొక్కి బియ్యం తియ్యవచ్చు కాని వడ్లు దంచి మాత్రమే బియ్యం తియ్యాలని చెబుతోంది వేదం. అలాగే వేదార్థం తెలుసుకుని, మీమాంస చెయ్యాలి.

వేదాన్ని ఎలా అధ్యయనం చెయ్యాలి? గ్రంథాలు చూసి చదువుకోవచ్చు అని కొంతమంది భావిస్తుంటారు. వేదంలో అనుదాత్తము, ఉదాత్తము, స్వరితము, దీర్ఘస్వరితము, ప్లుతము అని ఐదురకాలు ఉన్నాయి. వీటిని బాగా తెలుసుకుని వేదాధ్యయనం గురుముఖతః నేర్చుకోవాలి. సృష్టి ప్రారంభం నుంచి గురుశిష్య పరంపరగా వస్తోంది వేదాధ్యయనం. వేదాలలో చెప్పబడిన ధర్మానికే **'త్రయీధర్మము'** అని పేరు. యజ్ఞయాగాది క్రతువులు ఎప్పుడు చెయ్యాలి? ఎలా చెయ్యాలి? అనే విధానం అంతా బ్రాహ్మణములలో చెప్పబడింది.

ఈ మతంలో ఈశ్వరుడితో సంబంధము లేదు. యజ్ఞఫలం రావాలంటే పరమేశ్వరుడితో సంబంధం లేదు. కర్మే ఫలితాన్నిస్తుంది.

**ద్రవ్యములు :** ఈ మతంలో కుమారిలభట్టు, ప్రభాకరమిశ్రుడు ఇద్దరూకూడా ప్రసిద్ధి చెందినవారే. అయితే వీళ్ళిద్దరి మధ్యా అనేక విషయాలలో భేదమున్నది. కుమారిలభట్టు ప్రకారము పదార్థాలు రెండు రకాలు 1. భావములు 2. అభావములు. ఇందులో భావపదార్థాలు ఆరు అవి

1. ద్రవ్యము 2. గుణము 3. కర్మ 4. సామాన్యము 5. శక్తి 6. అభావము

అభావములు నాలుగు విధాలు

1. పూర్వము 2. పరము 3. పూర్ణములు 4. అన్యోన్య సంబంధములు.

వీటిలో ద్రవ్యము మళ్ళీ పదకొండు రకాలుగా ఉంటుంది. అవి 1. పృథివి 2. జలము 3. తేజస్సు 4. వాయువు 5. ఆకాశము 6. ఆత్మ 7. మనస్సు 8. దేశము 9. కాలము 10. తమస్సు 11. శబ్దము వీటిలో కొన్నింటిని ప్రభాకరమిశ్రుడు అంగీకరించలేదు.

**ఆత్మ :** ఆత్మని గురించి కూడా కుమారిలభట్టు, ప్రభాకరుడు, వీరిద్దరి మధ్య భేదమున్నది. కుమారిలభట్టు ప్రకారము ఆత్మ పూర్తిగా జడపదార్థం కాదు. జ్ఞానవిశిష్టమైనది. ఆత్మ తెలుసుకునే కర్తయే కాకుండా తెలియబడే విషయం కూడా. ఆత్మ కర్త కర్మకూడా

ఆత్మ పరిణామము పొందుతుంది. అయినప్పటికీ అది నిత్యమైనదే. ఆత్మలు అనేకములు. అవి శరీరము, బుద్ధి, ఇంద్రియాలకన్న భిన్నమైనవి. ఆత్మ జ్ఞానవిశిష్టమైనది. ఆత్మ సర్వవ్యాపి అయినప్పటికీ కర్మ చేస్తుంది. ఆత్మయొక్క అస్థిత్వాన్ని అనుమానంతోనే తెలుసుకోగలుగుతాము. సుఖము దుఃఖము మొదలైన ధర్మాలు ఆత్మవే కాని శరీరానివి కావు.

అయితే ఆత్మని గురించి ప్రభాకరుని వివరణ వేరుగా ఉంది. ఆత్మ పూర్తిగా జడము. జ్ఞానం కాదు. ఆత్మ తనను తాను గాని ఇతరాన్ని గాని ఎరగదు. జ్ఞానము చేత మాత్రమే ఆత్మ ఎరుగబడుతుంది. జ్ఞానము స్వయంప్రకాశము. ఆత్మ కర్త భోక్త. సమస్తమైన వస్తువిషయముల యందు ఆత్మప్రకటమవుతుంది. ఆత్మ కర్మ కాదు. ఆత్మకన్న ఇతరమైనవన్నీ కర్మలు అంటే జ్ఞానానికి విషయములు. ఆత్మపరిణామి కాదు.

ఈ మతంలో జీవుడు వేరు, ఆత్మ వేరు అనే వ్యవహారము లేదు. జీవుడే ఆత్మ. ఆత్మ మానస ప్రత్యయమని కుమారిలుడు, అహం ప్రత్యయమని ప్రభాకరుడు చెబుతారు. ఆత్మలు అనేకములని ఆత్మ నిత్యమని ఇద్దరూ చెబుతారు.

**శబ్దం :** శబ్దం అనిత్యము అని నైయాయికులు చెబుతారు. మీమాంసవాదులు దీన్ని అంగీకరించరు. వర్ణాలు నిత్యాలు. వాటికి అక్షరములు అని పేరు. అక్షరము అంటే క్షరము కానిది, నాశనము లేనిది అని అర్థం. వర్ణాలు ఘటపటాదుల లాగా కాదు. కుండ పగిలిపోయిన తరువాత కొత్తకుండను తయారుచేస్తే, అది పగిలిపోయిన కుండ కన్నా విలక్షణంగా ఉంటుంది. పగిలిపోయిన కుండే ఇది అని చెప్పటానికి వీలుండదు. ఒక వర్ణాన్ని పలికినప్పుడు అది నాశనమయిపోతుంది. కాని మళ్ళీ అదే వర్ణాన్ని పలకవచ్చు. కాబట్టి వర్ణానికి, శబ్దానికి నాశనం లేదు. ఒకే వర్ణాన్ని పదిమంది పదిరకాలుగా పలికినప్పుడు వారి శరీర నిర్మాణము, దేశము, కాలములను

బట్టి శబ్దంలో తేడా వచ్చినప్పటికీ దానిని గణనలోకి తీసుకోవలసిన అవసరం లేదు. అలాగే ఉచ్చరించగానే శబ్దం అవ్యక్త స్థితికి చేరుతుంది. అంతేకాని నశించదు.

**కర్మ :** జ్ఞానంవల్ల మాత్రమే మోక్షం సిద్ధిస్తుంది. కర్మలు చెయ్యటం వల్ల స్వర్గం వస్తుంది. స్వర్గసుఖాలు అనుభవించిన తరువాత పునర్జన్మ కలుగుతుంది. జ్ఞానం వల్ల సిద్ధించే మోక్షం అద్వైతం. అద్వైతం జీవన విధానం కాదు. లోకవ్యవహారంలో భేదబుద్ధి ఉంటుంది. అద్వైతం వ్యవహారయోగ్యం కాదు. తల్లితండ్రులు, అన్నదమ్ములు, అక్క చెల్లెళ్ళు ఇలాగే ఉంటుంది లోకం. భార్య, తల్లి ఒకటి కాదు. భేదబుద్ధితో సంచరించే భిన్న ప్రాణులలో, వేరువేరు వస్తువులలో క్రమంగా ఏకత్వాన్ని చూపాలి. భేదము సహజము అభేదం సాధ్యం. కాబట్టి వ్యావహారిక జగత్తులో వ్యావహారిక సత్యాలయిన పశువులు, పుత్రులు, స్వర్గఫలాలు బోధించి, వారికి కర్మలయందు మక్కువ కలిగించాలి. కర్మానుష్ఠానం ద్వారా చిత్తశుద్ధి కలిగించాలి. నిర్మలమైన మనసులో పరమేశ్వరుడు సాక్షాత్కరిస్తాడు. ఆ నిర్మలత్వము కర్మల ద్వారానే వస్తుంది. కాబట్టి కర్మలు జ్ఞానసాధనకు అంగాలు.

మీమాంసకుల ప్రకారము కర్మలు నాలుగు విధాలు.

**1. నిత్యకర్మలు :** మోక్షార్థియైనవాడు వీటిని ప్రతిదినము తప్పకుండా చెయ్యాలి. స్నానము, సంధ్య మొదలైనవి. వీటిని చేస్తే పుణ్యం రాదు. చెయ్యకపోతే పాపం వస్తుంది.

**2. నైమిత్తిక కర్మలు :** ఇవి ఏదో ఒక దాని నిమిత్తం చేసే కర్మ. ఇవి చెయ్యటం వల్ల పుణ్యం రాదు. చెయ్యకపోతే బాధ కలుగుతుంది. ఉదా॥ కాల్లో గ్రుచ్చుకున్న ముల్లు. దీన్ని తియ్యకపోతే బాధ కలుగుతుంది. ఈ రకమైన కర్మలు చెయ్యటంలో తప్పులేదు.

**3. కామ్యకర్మలు :** యజ్ఞయాగాది క్రతువులు. ఇవి చేస్తే పుణ్యం వస్తుంది. తద్వారా స్వర్గ సుఖము, పునర్జన్మ కలుగుతాయి. కాబట్టి మోక్షార్థి నిష్కామ్యకర్మలు చెయ్యాలి.

**4. నిషిద్ధకర్మలు :** సురాపానము, పరస్త్రీ సంగమము మొ॥వి ఈ పనులు చేస్తే పాపం వస్తుంది. నరకబాధలు కలుగుతాయి. నీచమైన జన్మలు కలుగుతాయి. కాబట్టి మోక్షం కోరేవాడు ఇలాంటి కర్మలు వదిలెయ్యాలి.

**యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణాం**

యజ్ఞము, దానము, తపస్సులాంటి కర్మలు మానవుణ్ణి పునీతునిగా చేస్తాయి. వీటిని కూడా నిష్కామ్యంగానే చెయ్యాలి.

**ధర్మము :** మీమాంసకుల దృష్టిలో ధర్మము చాలా గొప్పది. దీన్ని ప్రతివారూ పాటించి తీరాలి. వేదంలో చెప్పబడినది మాత్రమే ధర్మము. ఎన్ని కష్టాలు పడి అయినా సరే వేదంలో చెప్పిన పనులు చెయ్యాలి. వేదాధికారము అందరికీ లేదు. ద్విజులకు మాత్రమే ఉన్నది. నిషాదులు కూడా యజ్ఞాలు చేయవచ్చు.

అసలు ధర్మం అంటే ఏమిటి? ఏది కర్తవ్యమో అది ధర్మం. ఏది అకర్తవ్యమో, అది అధర్మం. ఈ రకంగా ధర్మనిర్ణయం జరుగుతూ ఉంటుంది. కర్తవ్యాకర్తవ్య ప్రమాణాలను తెలిపే ప్రామాణిక గ్రంథం వేదం. ధర్మాధర్మ స్వరూపం ఇంద్రియాలకు అతీతమైనది. అతిసూక్ష్మమైనది. ధర్మస్వరూపం అంతా వేదంలో చెప్పబడింది. భారతీయులకు వేదమే ప్రమాణం అందుచేత వేదంలో చెప్పబడినదే ధర్మము అని నిర్ణయం చేశారు. మీమాంసకారులు.

మహాత్ములు చేసినవన్నీ ధర్మాలు అని గ్రహించరాదు. ధర్మస్వరూపులైన మహర్షులు కూడా లోకం కోసం కొన్నిసార్లు సాహసకృత్యాలు చేస్తుంటారు. వారు సర్వసమర్థులు కాబట్టి ఏం చేసినా సమర్థించుకుంటారు. కాని సామాన్యుడు అలా సమర్థించుకోలేడు. అందుచేతనే మహాత్ములు చేసిన కార్యాలు మనం చెయ్యకూడదు. అవన్నీ ధర్మాలు అనుకోకూడదు. కుటుంబానికి, సమాజానికి క్షేమకరమైనదే ధర్మము. ఈ ధర్మాలన్నీ వేదంలో చెప్పబడ్డాయి. అందుచేత ధర్మనిర్ణయ విషయంలో శాస్త్రము, శాస్త్రాధ్యయనము చేసిన మహాత్ముల నిర్ణయాలే శిరోధార్యం. వేదాలు చెప్పినట్లుగానే కర్మలు చెయ్యాలి. ధర్మమనేది పురుషుని కర్మాచరణవల్లనే ఏర్పడుతుంది. ధర్మము వల్లనే పురుషుడికి ఇహము, పరము లభిస్తాయి. వేదాలు "కర్మవల్లనే మోక్షం లభిస్తుందని" చెబుతున్నాయి అంటున్నారు మీమాంసకులు. వీరి దృష్టిలో **'లోకోత్తరసుఖమే'** స్వర్గము.

కర్మఫలితాన్ని గురించి మీమాంసకులు ఏం చెప్పారో చూడండి. సాధారణంగా కర్మ చెయ్యగానే దాని ఫలితం రాదు. కర్మక్షణికము. చెయ్యగానే అది నశిస్తుంది.

నశించిన కర్మ ఫలితాన్ని ఎలా ఇస్తుంది? అనే ప్రశ్నకు వీరి సమాధానం – ప్రతికర్మలో సూక్ష్మంగా ఒక శక్తి ఉంటుంది. దీనికే **అపూర్వము** అని పేరు. దీన్నే నైయాయికులు 'అదృష్టము' అంటారు. ఈ అపూర్వము కర్తలోనే సూక్ష్మరూపంలో దాగి ఉండి, అనుకూల పరిస్థితులు కలిగినప్పుడు ఫలితాన్నిస్తుంది. ఫలితాన్నిచ్చేదాకా, పురుషుడు ఎన్ని జన్మలెత్తినా ఇది నశించకుండా అతనిలోనే దాగి ఉంటుంది.

కర్మ చెయ్యగానే దాని ఫలితాన్ని అనుభవించటానికి సిద్ధంగా ఉండాలి. మంచి కర్మ అయితే మంచి ఫలితము పొందుతారు. ఇది ఆనందమే. మరి చెడు కర్మ అయితే ? ఆ కర్మ ఫలాన్నుంచి తప్పించుకునే మార్గమేది? దీనికి రెండే మార్గాలు 1. కర్మఫలం అనుభవించటం 2. ప్రాయశ్చిత్తం చేసుకోవటము. ప్రాయశ్చిత్తము అంటే చేసిన తప్పుకు శిక్ష అనుభవించటం. అది కూడా ఇక్కడే. ఇప్పుడే. ఇది ఒక్కొక్కప్పుడు చాలా ఘోరంగా ఉంటుంది. జైమిని సూత్రాలకు భాష్యం వ్రాసిన కుమారిలభట్టు, జైనమతాన్ని ఖండించటం కోసం జైన గురువుల నాశ్రయించి, వారి రహస్యాలు అన్నీ తెలుసుకుని ఆ మతాన్ని ఖండించాడు. అయితే ఇది గురుద్రోహము అవుతుంది. దీనివల్ల మహాపాపం వస్తుంది. ఈ పాపము క్షయం కాకపోతే ముక్తిరాదు. పాపక్షయం కావాలంటే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. అందుకని శాస్త్రాలలో చెప్పినట్లుగా తుషాగ్నిలో దగ్ధమై ముక్తి పొందాడు. ఇక్కడ శిక్ష ఎలా ఉన్నదో చూడండి. తాను నుంచుని, తనచుట్టూ పీకల వరకు వరిపొట్టు అంటే ఊక పోయించుకుని, దానికి నిప్పు పెట్టించుకున్నాడు. ఆ నిప్పు ఒక్కసారిగా మండదు. కొద్ది కొద్దిగా కాలుతూ, ఊకను తగలపెడుతూ ఉంటుంది. ఆ ఊకలో ఉన్నాడు కుమారిలభట్టు. ఇది మహాభయంకరమైన మరణము. శరీరము కొద్దికొద్దిగా కాలుతూ చివరకు ప్రాణాలు తీస్తుంది. ఇది వీరి కర్మ సిద్ధాంతము. కుమారిలభట్టు అలాగే మరణించాడు జ్ఞానంచేత కర్మ దగ్ధమై పోతుందని వీరు ఒప్పుకోరు.



# 3. ఉత్తరమీమాంస (వేదాంత దర్శనము)

దీనిని వ్రాసినవాడు వ్యాసభగవానుడు. దీనికే వేదాంత దర్శనము, బ్రహ్మమీమాంస అని కూడా పేర్లు. మీమాంస అంటే చర్చ అని అర్థం. ఈ దర్శనము మిగిలిన అన్ని దర్శనముల కన్న గొప్పది. అందుచేతనే

**తావద్గర్జంతి శాస్త్రాణి జంబుకా విపినే యథా ।**
**నగర్జతి మహాశక్తిః యావద్వేదాంత కేసరీ ॥**

అడవిలో సింహగర్జన వినిపించనంత వరకే నక్కలు కూస్తుంటాయి. సింహగర్జన వినగానే నక్కలన్నీ తోకలు ముడుస్తాయి. అలాగే వేదాంత సింహము అనే ఈ దర్శనము రాగానే మిగిలినవన్నీ మౌనము వహిస్తాయి.

వేదాంతశాస్త్రము శాశ్వతమైన ఫలితాన్నిస్తుంది. అందుచేతనే దీనికి అంత ప్రాముఖ్యత ఉన్నది. భారతీయ తత్త్వశాస్త్రం మూడు భాగాలుగా ఉంటుంది. అవి 1. ఉపనిషత్తులు 2. భగవద్గీత 3. బ్రహ్మసూత్రాలు ఈ మూడింటినీ కలిపి ప్రస్థానత్రయము అంటారు. వేదవిభజన చేసినవాడు, భగవద్గీత, బ్రహ్మసూత్రాలు వ్రాసినవాడు కూడా కృష్ణద్వైపాయనుడే. ఆయనే వేదవ్యాసుడు అనబడతాడు. ఈ మూడింటినీ విడివిడిగా చూద్దాం.

**1. ఉపనిషత్తులు :** ఉప-సమీపమునందు, ని-దిగువ స్థానంలో, షద్-కూర్చొనుట. గురువుగారి దగ్గర, ఆయనకన్న దిగువస్థానంలో కూర్చొని వారు చెప్పే బ్రహ్మోపదేశం జాగ్రత్తగా వినటం. ఉపనిషత్తు అంటే - బ్రహ్మవిద్య. బ్రహ్మవిద్యా పరిశీలకులైన విద్వాంసులకు కర్మ, జన్మ, మరణాలను లేకుండా చేసేది. జనన మరణాలను నశింపచేసి బ్రహ్మ పదార్థ లాభాన్ని కలుగచేసేది.

వేదాలు మొత్తం మూడు కాండలుగా ఉంటాయి. 1. కర్మ 2. ఉపాసన 3. జ్ఞానకాండలు. వీటిలో చివరి రెండు కాండలను ఉపనిషత్తు అంటారు. ప్రతి ఉపనిషత్తు ఏదో ఒక వేదానికి సంబంధించినదే. ప్రతివేదశాఖకీ చివరన ఒక ఉపనిషత్తు చెప్పబడింది. ఇలా మొత్తం 1180 ఉపనిషత్తులున్నాయి అంటారు. కాని ముక్తికోపనిషత్తులో ముఖ్యమైన 108 ఉపనిషత్తుల పేర్లు మాత్రం చెప్పటం జరిగింది.

వీటికి ఉపనిషత్ బ్రహ్మేంద్ర అనే మహానుభావుడు వివరణ కూడా వ్రాశాడు. వీటిలో పది ఉపనిషత్తులు మాత్రమే శ్రేష్ఠమైనవి అన్నారు శంకర భగవత్పాదుల వారు. వాటికి ఆయన వ్యాఖ్య కూడా వ్రాశారు. వీటిలో

1. ఐతరేయోపనిషత్తు – ఋగ్వేదానికి
2. కఠోపనిషత్తు, తైత్తిరీయోపనిషత్తు – కృష్ణయజుర్వేదానికి
3. ఈశావాస్యోపనిషత్తు, బృహదారణ్యకోపనిషత్తు – శుక్లయజుర్వేదానికి
4. కేనోపనిషత్తు, ఛాందోగ్యోపనిషత్తు – సామవేదానికి
5. ప్రశ్నోపనిషత్తు, ముండకోపనిషత్తు, మాండూక్యోపనిషత్తు – అథర్వవేదానికి సంబంధించినవి.

ఈ ఉపనిషత్తులలో జీవాత్మ, పరమాత్మ, జగత్తులను గురించిన విచారము చెయ్యబడింది. ఉపనిషత్తులలో సగుణోపాసన, నిర్గుణోపాసన కూడా చెప్పబడింది. దేవతల యొక్క ధ్యానశ్లోకాలు, మంత్రాలు చెప్పబడ్డాయి. అయితే ఉపనిషత్తులలో ఎక్కువగా నిర్గుణోపాసన చెప్పబడింది.

**2. భగవద్గీత :** ఉపనిషత్తులలో సగుణ, నిర్గుణ ఉపాసనలు చెప్పినప్పటికీ, అవి మానవుడికి పూర్తిగా తృప్తినివ్వలేకపోయినాయి. ఎందుకంటే సర్వశక్తివంతుడు, సర్వజ్ఞుడు అయిన సర్వేశ్వరుడు, భక్తుల కోరికలు తీర్చగలిగేవాడు ఒకడు అవసరమైనాడు. "నన్ను శరణు పొందు. నిన్ను సమస్త పాపముల నుండి విముక్తుడు గావిస్తాను." అని అభయమివ్వగలిగేవాడు అవసరమైనాడు. ఈ కారణంచేతనే మహాభారతాంతర్గతమైన భగవద్గీత, అందులో శ్రీకృష్ణపరమాత్ముడు ఆవిర్భవించారు. భగవద్గీతను వ్రాసింది కృష్ణద్వైపాయనుడు. ఇందులో మొత్తం 18 అధ్యాయాలు 700 శ్లోకాలు ఉంటాయి. భగవద్గీతను కూడా ఉపనిషత్తుగానే భావిస్తుంటారు. భగవద్గీతకు త్రిమతాచార్యులే కాక, ఇంకా అనేకమంది భాష్యం వ్రాశారు.

**3. బ్రహ్మసూత్రాలు :** దీన్ని వ్రాసినవాడు కృష్ణద్వైపాయనుడు. వేదాలను విభజించిన తరువాత బ్రహ్మవిద్య మీద దృష్టి పెట్టాడు వ్యాసుడు. తనను గురించి తాను తెలుసుకోవాలి అనుకున్నాడు. తీవ్రంగా ఆలోచించాడు. అదే తపస్సు, అప్పుడు

'బ్రహ్మసత్యం - జగన్మిథ్య' అనే విషయం ఆయనకు తెలిసింది. ఈ రకంగా పరమేశ్వరుణ్ణి గురించి తీవ్రంగా ఆలోచించి, తాను దర్శించిన పరమార్థాన్ని చిన్న చిన్న సూత్రాలుగా క్రమబద్ధీకరించాడు. అవే బ్రహ్మసూత్రాలు.

పరబ్రహ్మతత్త్వాన్ని నిరూపించటమే దీని ప్రధానధ్యేయం. చరాచర జగత్తంతా బ్రహ్మపదార్థంతోనే సృష్టించబడింది. జగత్తంతా పరమేశ్వరుడి స్వరూపమే. మానవుడు ఎక్కడ నుంచి వచ్చాడు? మరణానంతరం మళ్ళీ ఎక్కడికి పోతాడు? పునర్జన్మ ఎందుకు ఎత్తాలి ? మోక్షం అంటే ఏమిటి ? ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానం చెప్పగలిగింది ఒక్క బ్రహ్మవిద్య మాత్రమే. బృంహణము అంటే అంతటా నిండి ఉండటం అని అర్థం. బృంహణశక్తి గలది బ్రహ్మము. ఇది విశ్వమంతా వ్యాపించి ఉంది. జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే. వ్యాసుడు బ్రహ్మపదార్థాన్ని బాగా తరచి చూసి, దాన్ని సూత్రబద్ధం చేశాడు. అలా చెయ్యటానికి ముందు చార్వాక, నాస్తిక, లోకాయిత, నిరీశ్వరవాదాలన్నీ పూర్తిగా అధ్యయనం చేశాడు. ఆ తరువాత తార్కికబుద్ధితో బాగా ఆలోచించి, జగత్తులో కనిపించేదీ, కనిపించనిదీ అంతా బ్రహ్మపదార్థమే అని తేల్చాడు. వ్యాసుడు ఉపనిషత్సారమంతా బ్రహ్మసూత్రాలలో నింపాడు. ఇది మొత్తం నాలుగు అధ్యాయాలుగా ఉంటుంది. ప్రతి అధ్యాయానికి నాలుగు పాదాలు ఉంటాయి. ప్రతిపాదంలోను కొన్ని అధికరణలు ఉంటాయి. ఇలా మొత్తం 192 అధికరణలు, 555 సూత్రాలతో ఈ గ్రంథం వ్రాయబడింది. ఇందులో అన్ని మతాలను ఖండించి అద్వైతమతాన్ని స్థాపించాడు వ్యాసుడు. దీనికి భాష్యం వ్రాశాడు శంకరుడు.

'బ్రహ్మసూత్రాలు' అనే మాటలో బ్రహ్మ అంటే - పరబ్రహ్మ. నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు, ఆదిమధ్యాంతరహితుడు, సృష్టిస్థితిలయకారకుడు, సర్వవ్యాపి. జగత్తంతా తానే అయి ప్రతివస్తువునందు, ప్రతిప్రాణియందు కూడా వ్యాపించి ఉన్నాడు. సూత్రము అంటే

**అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతో ముఖమ్ ।**
**అస్తోభం అనవద్యంచ సూత్రం సూత్రవిదో విదుః ॥**

కొద్ది అక్షరాలు మాత్రమే కలిగి, అనుమానానికి తావులేని అర్థాన్ని వివరిస్తూ, ఆకారంలో చిన్నదై, ఏ విధమైన దోషము లేని వాక్యాన్ని సూత్రము అంటారు.

సూత్రము అంటే దారము అని కూడా అర్థం. పూలన్నీ కలిపి గ్రుచ్చటానికి ఉపయోగపడేది. గ్రుచ్చిన తరువాత దారం కనిపించదు, పూలు మాత్రమే కనిపిస్తాయి. అలాగే ఈ సృష్టిలో మనకు కనిపించే 84 లక్షల రకాలైన జీవరాశి, పర్వతాలు, లోయలు, ఎడారులు, చెట్లు, చేమలు, నదులు, సముద్రాలు ఈ రకంగా ప్రాణమున్నవి, ప్రాణంలేనివి, అన్నీ ఒకే సూత్రంతో బంధించబడి ఉన్నాయి. ఈ రకంగా జగత్తు నంతటినీ ఒకటిగా కలిపి బంధించగలిగినది ఆత్మ ఒక్కటే.

బ్రహ్మసూత్రాలకు త్రిమతాచార్యులతో పాటుగా మొత్తం పదిమంది భాష్యం వ్రాశారు. వీరందరూ బ్రహ్మసూత్రాలు తమ మతాన్నే సమర్థిస్తున్నాయి అని చెప్పటానికి ప్రయత్నం చేశారు. ప్రస్థానత్రయానికి భాష్యం వ్రాసిన వారు చాలా కొద్దిమంది మాత్రమే. దీనికి భాష్యం వ్రాయాలంటే వేదపరిజ్ఞానము, శాస్త్రపరిజ్ఞానముతో పాటుగా అనుభవము కలిగి, ఆత్మసాక్షాత్కారం పొంది ఉండాలి. మొత్తంమీద వేదాంత దర్శనము అంటే అద్వైత సిద్ధాంత ప్రతిపాదితము. లోకంలో పాలు అంటే ఆవుపాలే. నూనె అంటే – నువ్వులనూనె అలాగే వేదాంతము అంటే అద్వైత సిద్ధాంతమే. ప్రస్థానత్రయాన్ని ఉపన్యాసం చెప్పి సి.డి.లుగా విడుదల చెయ్యటం జరిగింది.



# 4. సాంఖ్యదర్శనము

బ్రహ్మమానసపుత్రుడు కర్దముడు. స్వాయంభువ మనువు యొక్క కుమార్తె దేవహూతిని వివాహం చేసుకున్నాడు. వీరి కుమారుడే కపిలుడు. విష్ణ్వంశ సంభూతుడు. కర్దముడు స్వర్గస్థుడైన తరువాత, కపిలుని తల్లి దేవహూతి కుమారుడి దగ్గరకి వచ్చి "సంసారార్ణవము నుంచి తరించే జ్ఞానం ఉపదేశించమని" ప్రార్థించింది. అప్పుడు కపిలుడు తల్లికి సాంఖ్యయోగాన్ని బోధించాడు అని శ్రీమద్భాగవతం చెబుతోంది. అయితే సాంఖ్యాన్ని బోధించిన కపిలుడు, భాగవతంలోని కపిలుడు ఒకరు కాదు అన్నారు శంకర భగవత్పాదులవారు.

**సమ్యక్ఖ్యానమ్** అంటే సమ్యగ్విచారణ, మంచి ఆలోచన, వివేకబుద్ధి అని అర్థం. ఇక్కడ వివేకము అంటే ప్రకృతి పురుషుల వివేకం అని అర్థం. ఈ వివేకబుద్ధి, ప్రకృతి పురుష వివేచన సాంఖ్యశాస్త్రంలో చర్చనీయాంశమైంది. అందుచేతనే దీన్ని "సాంఖ్యదర్శనము" అన్నారు.

భగవద్గీతలో రెండవ అధ్యాయము "సాంఖ్యయోగము" శరణాగతుడైన అర్జునుడు తన శోకనివృత్తి కోసం తిరుగులేని ఒక ఉపాయం చెప్పమని భగవానుణ్ణి ప్రార్థించాడు. దానికి భగవానుడు ముప్పై శ్లోకాలలో ఆత్మతత్త్వాన్ని వివరించాడు. ఆ తరువాత స్వధర్మము, కర్మయోగము వివరించినప్పటికీ, అధ్యాయం ఆరంభం మాత్రం సాంఖ్యంతోనే జరిగింది. ఇక్కడ **సాంఖ్యము** అంటే **'ఆత్మతత్త్వము'** అని అర్థం. మిగిలిన అధ్యాయాలలో కన్నా, ఈ అధ్యాయంలోనే ఆత్మతత్త్వము ఎక్కువగా వివరించబడింది. అందుకే ఈ అధ్యాయాన్ని సాంఖ్యయోగము అన్నారు. మొత్తం మీద చూసినట్లైతే భగవద్గీతలో సాంఖ్యము అంటే ఆత్మతత్త్వము అని అర్థం. కాని "ప్రకృతి స్వరూపాన్ని వివేచించి, ఇరవైనాలుగు తత్త్వాలను గూర్చిన విజ్ఞానాన్ని వివరించటం చేత, వీరు సాంఖ్యులు అనబడ్డారు" అని మహాభారతం చెబుతోంది.

సాంఖ్యదర్శనం ఆరు అధ్యాయాలలో 527 సూత్రాలు గలది. దీనిలో

మొదటి అధ్యాయం – విషయప్రతిపాదన

రెండవ అధ్యాయం – 'ప్రధానం' యొక్క లక్షణ నిరూపణ

| | |
|---|---|
| మూడవ అధ్యాయం | - వైరాగ్యం |
| నాల్గవ అధ్యాయం | - సాంఖ్యతత్త్వాలను వివరించే చిన్న చిన్న కథలు |
| ఐదో అధ్యాయం | - విపక్షఖండనం |
| ఆరో అధ్యాయం | - సిద్ధాంతాల సంక్షిప్త పరిచయం చెప్పబడ్డాయి. |

సాంఖ్యదర్శనం మూల ప్రవర్తకుడు కపిలుడు. ఈయన 'ఆదివిద్వాన్' అని కీర్తించబడ్డాడు. ఈయన దేవహూతి, కర్దముల యొక్క కుమారుడు. సాక్షాత్తు శ్రీమహావిష్ణువు యొక్క అవతారము అని భాగవతంలో చెప్పబడింది. రామాయణంలో సగర పుత్రులను భస్మం చేసింది కూడా ఈ కపిలుడే. కాని వీరందరు వేరు వేరు అంటాడు శంకరుడు. కపిలుడి తరువాత ఆసురి, పంచశిఖాచార్యుడు, ఈశ్వరకృష్ణుడు, వింధ్యవాసి, విజ్ఞానభిక్షువు సాంఖ్యమతాన్ని బాగా ప్రచారం చేశారు.

ఈశ్వరకృష్ణుడు సాంఖ్యదర్శనానికి ఏడువందల కారికలను వ్రాశాడు. దీనికే **'కనకసప్తశతి, సాంఖ్యసప్తశతి, సువర్ణసప్తశతి'** అని కూడా పేర్లు. దీనిమీద అనేకమంది వ్యాఖ్యానాలు వ్రాశారు. వీటిలో **మాఠరవృత్తి, గౌడపాదభాష్యం, జయమంగళ, చంద్రిక, తత్త్వకౌముది, యుక్తిదీపిక, సువర్ణసప్తశతిశాస్త్రం** అనేవి ముఖ్యమైనవి. ఇవి కాకుండా అనేకమైన కారికలున్నాయి. వీటన్నింటిలోను **ఈశ్వరకృష్ణుడు** వ్రాసిన **"సాంఖ్యకారిక"లే అత్యంత ప్రామాణికం.**

సాంఖ్యమతంలో 'సేశ్వరవాదము', 'నిరీశ్వరవాదము' అంటే ఈశ్వరుడు ఉన్నాడని కొందరు, లేదని కొందరు చెప్పారు. సృష్టి జరగటానికి కారణం ఈశ్వరుడు మాత్రం కాదు అన్నారు కొంతమంది సాంఖ్యులు. ఈశ్వరసృష్టిని ఋజువు చెయ్యటానికి తగిన ఆధారాలు, ప్రమాణాలు లేవు అన్నారు. అంతమాత్రంచేత సాంఖ్యులు నాస్తికులు కాదు. ఈశ్వరుడున్నాడని చెప్పటానికి సరైన హేతువు లేదు అని మాత్రమే వీరు చెబుతారు. ప్రారంభంలో ఇది నిరీశ్వరమైనప్పటికీ ప్రస్తుతం మనకు లభిస్తున్న గ్రంథాలను బట్టి ఈ మతం వారికి పరమేశ్వరుడు ఉన్నాడనే భావించాలి. అంటే వీరిది సేశ్వరవాదంగానే పరిగణించాలి. పై పెచ్చు సాంఖ్య మతానికి మూలపురుషుడైన కపిలుడు పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుని అవతారం. ముందుగా భాగవతంలోని సాంఖ్యమతంలో కపిలుడు ఏం చెప్పాడో చూద్దాం.

ప్రకృతి సత్వము, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు కలిగి ఉంటుంది. దీనికి జ్ఞానాన్ని మరుగునపడేసే శక్తి ఉన్నది. పురుషుడు దానికి మోహితుడవుతాడు. దాంతో ప్రకృతి వేరు తాను వేరు అని గుర్తించలేడు. ప్రకృతియొక్క గుణాలతో జరిగే పనులన్నింటికీ తానే కర్త అని భావిస్తాడు. దీనివల్లనే జనన మరణాదికమైన బంధాలు కలుగుతాయి.

ప్రకృతి గుణత్రయానికి ఆలవాలమైంది కాబట్టి అది బ్రహ్మము కాదు. అది దేని పరిణామము కూడా కాదు. అది అవ్యక్తము. కార్యకారణ రూపమైనది. పంచభూతాలు, తన్మాత్రలు, అంతఃకరణచతుష్టయము, దశేంద్రియాలు వెరసి ఇరవై నాలుగు తత్త్వాలు. ఇదే ప్రకృతి. ప్రకృతి గుణాలు క్షోభించనప్పుడు చిచ్ఛక్తి రూపమైన తన వీర్యాన్ని పరమపురుషుడు ప్రకృతి యొక్క యోనియందు స్థాపించాడు. అప్పుడు ప్రకృతినుంచి మహత్తత్త్వము పుట్టింది. మహతత్త్వము నుంచి అహంకారము పుట్టింది. అహంకారము మూడు రకాలు 1. సాత్త్వికాహంకారము 2. రాజసాహంకారము 3. తామసాహంకారము. అహంకారం నుంచి తన్మాత్రలు ఆవిర్భవించినాయి. వాటినుంచి జ్ఞానేంద్రియాలు ఆవిర్భవించినాయి.

| వ.నెం. | భూతము | లక్షణము | జ్ఞానేంద్రియము |
|---|---|---|---|
| 1. | ఆకాశము | శబ్దము | చెవి |
| 2. | వాయువు | స్పర్శ | చర్మము |
| 3. | తేజస్సు (అగ్ని) | రూపము | కన్ను |
| 4. | జలము | రుచి (రసము) | నాలుక |
| 5. | భూమి | వాసన (గంధము) | ముక్కు |

ఈ తన్మాత్రల నుంచే పంచభూతాలు పుట్టినాయి. కర్మేంద్రియాలు పుట్టినాయి. ఈ రకంగా సృష్టి జరిగింది.

ఒకే విషయాన్ని పదే పదే చూడటం వల్ల అది కలలో కనిపిస్తుంది. ఆ కల నిజమనే భ్రమ కలిగిస్తుంది. అలాగే సంసారం కూడా. సంసారానికి శాశ్వతత్త్వం లేకపోయినా అది నిత్యము, సత్యము అనిపిస్తుంది.

జీవియొక్క బంధ మోక్షాలకి మనసే ప్రధానం. పరమాత్మతో అనురక్తి పొందినట్లైతే అది మోక్షహేతువు అవుతుంది. అందుకే మనసుకు వైరాగ్యాన్ని అలవాటు చేసి యోగసాధన చెయ్యాలి. ఏకాగ్రచిత్తుడై భగవంతుని కథలు వినాలి. సర్వప్రాణుల యందు సమభావం కలిగి ఉండాలి. కోరికలు విడనాడాలి. బ్రహ్మచర్యము, మౌనవ్రతము, స్వధర్మము పాటించాలి. దొరికిన దానితో తృప్తి చెందాలి. మితాహారం తీసుకోవాలి. ఏకాంతవాసం గడపాలి. అహంకార మమకారాలు పూర్తిగా వదిలి పెట్టాలి. ఈ రకంగా సాధన చేస్తే ప్రకృతి పురుషుల తత్త్వము అవగతమవుతుంది.

ఈ రకంగా జరిగితే ఆత్మ ప్రతిబంధకమైన ప్రకృతి క్రమక్రమంగా పురుషుని విడిచిపోతుంది. అజ్ఞానికి ప్రకృతి సంసార రూపమైన అనర్థాలు కలిగిస్తుంది. కాని జ్ఞానియైన వాడిని ఈ ప్రకృతి ఏమీ చెయ్యలేదు. ఇటువంటి జ్ఞాని ఆత్మతత్త్వాన్ని తెలుసుకొని పరమానందం పొందుతాడు అతడికి కైవల్యము సిద్ధిస్తుంది.

**అష్టాంగయోగవిధి:** చెడు మార్గాలనే అన్వేషిస్తుంది మనస్సు. అందుచేత దాన్ని ముందుగా కట్టి పడెయ్యాలి. దానికి అష్టాంగయోగవిధి అవసరము.

1. ఆసనము – పవిత్రమైన ప్రదేశంలో దర్భలు పరచి వాటి మీద మృగచర్మం పరిచి దానిమీద కూర్చోవాలి.
2. పూరకము – ఊపిరి పూర్తిగా పీల్చటం.
3. రేచకము – పీల్చిన గాలి బయటకు వదలటం
4. కుంభకం – పీల్చిన గాలి లోపల అట్టిపెట్టటం
5. అనులోమ, ప్రతిలోమాలు – ప్రాణాయామం చెయ్యటం
6. ధారణ – మనసును లగ్నం చేయటం.
7. ప్రత్యాహారము – మనసును, ఇంద్రియాలను వాటి వాటి వాసనల నుంచి మరల్చటము
8. ధ్యానము – భగవత్ చింతన

ఇలా అష్టాంగయోగం ద్వారా శ్రీమన్నారాయణుని ధ్యానం –
సాధకుడి హృదయమంతా భక్తితో నిండి పోతుంది

కలుగుతుంది. శరీరం పులకించి పోతుంది. పరమేశ్వర సాక్షాత్కారం కలుగుతుంది. భగవానుడి మాయాశక్తి మన ఊహకందదు. భగవానుడి మీద అచంచలమైన భక్తితోనే ఆయన్ను చేరాలి. ఇంకో మార్గం లేదు. భక్తి ఐదు రకాలుగా ఉంటుంది. 1. తామసభక్తి 2.రాజసభక్తి 3.సాత్త్వికభక్తి 4.నిర్గుణభక్తి 5.అత్యంతిక భక్తి. ఇదే తాదాత్మ్యత, తత్పరత.

**సంసారకూపం :** అజ్ఞానంవల్లనే సంసార బంధనాలు ఏర్పడతాయి. భార్యాపుత్రులు ధనధాన్యాలు, భోగభాగ్యాలు ఇవన్నీ అశాశ్వతం. అయితే జీవుడు అశాశ్వతమైన ఈ జగత్తే శాశ్వతం అనుకుంటాడు. క్షణికమైన ఆనందమే శాశ్వతానందం అనుకుంటాడు. తాను కష్టాలు పొందుతూ కూడా అదే సుఖం అనుకుంటాడు. ఇలా జీవితమంతా గడిచిపోతుంది. ముసలితనం వస్తుంది. మనిషి చేతకానివాడై పోతాడు. కుటుంబాన్ని పోషించలేడు. భార్యాబిడ్డలు గతంలో లాగా ఆదరించరు. వాళ్ళ దయాధర్మాల మీద ఆధారపడవలసి వస్తుంది. కదల్లేడు. ప్రతిదానికీ ఎవరిమీదైనా ఆధారపడాలి. ఇలా ఘోరంగా సాగుతుంది ముసలితనం. ఇంతలో కాలం సమీపిస్తుంది. యమభటులు వస్తారు. వారిని చూసి భయపడతాడు. మలమూత్ర విసర్జన చేసుకుంటాడు. అతని యాతనా దేహాన్ని యమభటులు తీసుకుపోతారు. తాను చేసిన పాపాలు గుర్తు వచ్చి దుఃఖిస్తాడు. ఆకలిదప్పులు దహించి వేస్తుండగా, యమభటులు కొరడాలతో కొడుతుంటారు. ఎండమాడిపోతూ ఉంటుంది. ఇసుక దారి. వేడిగాడ్పులు. ఎక్కడా నీడ అనే కనిపించదు. నీళ్ళు దొరకవు. కొరడా దెబ్బలు తింటూ ఆ త్రోవలో నడవాలి. ఇలా తొంభై తొమ్మిది వేల యోజనాల యమలోకం దారిని రెండు ముహూర్తాల కాలంలో నడిచిపోవాలి. యమలోకంలో అతడు చేసిన పాపాలను బట్టి శిక్షలు అనుభవించాలి. తన కుటుంబం కోసం తాను చేసిన పాపాలకు శిక్షలు తానొక్కడే అనుభవించాలి. యజ్ఞయాగాది కర్మలు, దేవతారాధన చేసిన వారు ధూమమార్గంలో చంద్రలోకం చేరి సుఖాలు అనుభవించి తిరిగి కర్మశేషం అనుభవించటానికి ఈ లోకంలో జన్మిస్తారు. పరబ్రహ్మను ఉపాసన చేసినవారు ముందుగా సత్యలోకం చేరి, ప్రళయం సంభవించే వరకు అక్కడ ఉండి, ఆ తరువాత కర్మబ్రహ్మతో కలిసి పరబ్రహ్మలో లీనమవుతారు. అతడికి పునర్జన్మ ఉండదు." అంటూ భాగవతంలో కపిలుడు సాంఖ్యమతాన్ని వివరించాడు. ఇప్పుడు అసలు సాంఖ్యమతాన్ని చూద్దాం.

**సాంఖ్యతత్త్వము (నిరీశ్వరతత్త్వము) :** సాంఖ్యదర్శనంలో తత్త్వాలను గురించిన చర్చ చాలా ముఖ్యమైనది. తత్త్వాలు ఇరవై ఐదు. మానవుడు ఏ ఆశ్రమంలో ఉన్నప్పటికీ బ్రహ్మచర్యం, గృహస్థాశ్రమం, వానప్రస్థం, సన్యాసం ఏదైనప్పటికీ, ఈ తత్త్వాలను తెలుసుకుంటే చాలు, అతడికి ముక్తి లభిస్తుంది. ఇక్కడ ముఖ్యమైన విషయం ఏమంటే

1. ఒక తత్త్వం అన్నింటికీ కారణమవుతుంది. కాని స్వయంగా దేనికీ కార్యం కాదు. అదే ప్రకృతి (అవ్యక్తం) 1

2. కొన్ని తత్త్వాలు కేవలం కార్యాలుగానే ఉంటాయి. ఇతర తత్త్వాలను ఉత్పన్నం చెయ్యవు - జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, పంచభూతాలు. వెరసి పదహారు.

3. కొన్ని తత్త్వాలు స్వయంగా కారణం, కార్యము కూడా అవుతాయి. ఒక తత్త్వం నుంచి ఉత్పన్నం కావటమే కాక మరొక తత్త్వాన్ని జన్మింపచేస్తాయి - మహతత్త్వము, అహంకారము, పంచతన్మాత్రలు. మొత్తం-7.

4. కొన్ని తత్త్వాలు దేనికీ కారణం కావు. కార్యం కూడా కావు -పురుషుడు 1

వెరసి మొత్తం తత్త్వాలు ఇరవై ఐదు. వీటిలో ప్రకృతి అవ్యక్తం. ఇరవై మూడు తత్త్వాలు-వ్యక్తం. వీటన్నింటికీ అతీతమైన వాడు పురుషుడు. అతడు చైతన్య స్వరూపుడు. వీటన్నింటినీ గురించిన వివేకమే విజ్ఞానము అదే - మోక్షము.

**పరిణామం :** ప్రతి పదార్థానికీ ఒక ధర్మం ఉంటుంది. అది నిరంతరము మారుతూ ఉంటుంది. ఒక పదార్థంలో గతంలో ఉన్న ధర్మాన్ని తొలగించి, వేరొక ధర్మం చోటు చేసుకున్నట్లైతే అది పరిణామము అనబడుతుంది. ఈ జగత్తులో ప్రతివస్తువు త్రిగుణాలతో కలిసి ఉంటుంది. ఈ మూడు గుణాలు పరస్పర సంపర్కం కలిగి, పరస్పర పోషకాలై ఉంటాయి. ప్రత్తి, నూనె, దీపంలాగా మూడూ గుణాలు కలిసే ఉంటాయి కాని విడిగా ఉండవు. వీటిలో సత్త్వగుణం - తేలికదనం కలది. రజోగుణం - చలన లక్షణం గలది. ప్రవృత్తి కారణమైనది. తమోగుణం - మందత్వ లక్షణం గలది. ప్రవృత్తి నిరోధకము. రజోగుణం ప్రవృత్తి హేతువు కాబట్టి జగత్తులోని ప్రతిపదార్థం తన ధర్మాన్ని వదలి వేరొక ధర్మాన్ని స్వీకరిస్తుంది. ఈ తత్త్వాలలో

ఒక్క చేతనం (పురుషుడు) తప్ప అన్నీ పరిణామం పొందుతాయి. ఈ పరిణామం మూడు రకాలు.

1. ధర్మ పరిణామము – పంచభూతాలు వివిధ రూపాలలో పుట్టటము లేదా మారటము
2. లక్షణ పరిణామము – ధర్మం భూతభవిష్య ద్వర్తమాన రూపం చెందటం.
3. అవస్థా పరిణామము – దేశకాలమానాలను బట్టి ఒక వస్తువు ఇంకొక రూపం పొందటం.

ఉదా : కుండ పాతదై పోవటం. మనిషి బాల్యయౌవన కౌమార వార్ధక్య దశలు పొందటం.

ఈ పరిణామ క్రమమం అనాదిగా ఉన్నది. దీని ప్రభావం వల్ల భవిష్యత్తు వర్తమానమై, వర్తమానం భూతమై, భూతం అవ్యక్తంలో లీనమై పోతుంది. ఈ అవ్యక్తాన్నే మూలప్రకృతి అంటారు. అవ్యక్తం వ్యక్తం కావటం అంటే – వర్తమాన రూపాన్ని ధరించటం అంటే అవ్యక్తం, మహత్తత్త్వము, అహంకారము మొదలైన రూపాలు పొందటం. దీన్ని **విసదృశ పరిణామము** అంటారు. అలాగే వ్యక్తం నుండి అవ్యక్తంలో లీనమై పోవటాన్ని **సదృశ పరిణామము** అంటారు. ఈ రకంగా తత్త్వము వ్యక్తం నుంచి అవ్యక్తంగా, అవ్యక్తం నుంచి వ్యక్తంగా మారుతూనే ఉంటుంది. ఇదే పరిణామ స్వరూపము. ఈ ప్రక్రియ అవిచ్ఛిన్నంగా జరుగుతూనే ఉంటుంది. మూలప్రకృతి అవ్యక్తంగా ఉన్నంత కాలం సృష్టి జరగదు.

**సత్కార్యవాదం :** కారణంలో కార్యం లేదని చెప్పే వాదాన్ని **"అసత్కార్యవాదం"** అంటారు. దీనికే ఆరంభవాదం అని పేరు. న్యాయదర్శనకారుల ప్రకారం కార్యం వేరు, కారణం వేరు. కారణంలో కార్యం లేదు. ప్రత్తిద్వారా వస్త్రం ఉత్పత్తి అవుతున్నప్పటికి ప్రత్తి వేరు వస్త్రం వేరు. ప్రత్తే వస్త్రం కాదు. వస్త్రం యొక్క ఉత్పత్తికి కారణమైన ప్రత్తి అందులో లేదు. అదే విధంగా ప్రత్తిలో వస్త్రం కూడా లేదు. ఇది న్యాయదర్శనకారుల వాదన.

సాంఖ్యవాదాలు దీనికి భిన్నంగా చెబుతారు. సాంఖ్యవాదుల ప్రకారము కార్యంలో కారణం ఉంటుంది. కారణం జరగటానికి ముందుగానే కారణంలో

కార్యం అవ్యక్త రూపంలో అంటే కనిపించకుండా ఉంటుంది. అంటే ప్రత్తిలో వస్త్రము అవ్యక్తంగా ఉందన్నమాట. అందుకే కారణం నుంచి కార్యం ఉత్పత్తి కావటం అంటే అవ్యక్తంలో ఉన్నది వ్యక్తం కావటం. అలాగే కార్యం నడిపించటం అంటే వ్యక్తంలో ఉన్నది అవ్యక్తం కావటం. కంటికి కనిపించే వస్తువు కనిపించకుండా పోవటం. ఇలా అవ్యక్తమైన మూలప్రకృతి నుంచి వస్తువులు వర్తమానంలో వ్యక్తమై, మళ్ళీ అవ్యక్తంలో చేరిపోతాయి. ఈ పద్ధతిలో వస్తువు ఎప్పుడూ ఉత్పత్తి కాదు, నాశనమూ కాదు. వస్తువు కేవలం ఒక ధర్మాన్ని వదిలి ఇంకొక ధర్మాన్ని స్వీకరిస్తుంది. దీన్నే **'సత్కార్యవాదం'** అంటారు. ఇక్కడ చూడటానికి కార్యం కారణం వేరువేరుగా కనిపిస్తాయి. నిజానికి ఈ రెండూ వేరు వేరు కాదు. కార్యం కారణంలోనే ఉంటుంది. కేవలం ధర్మం మాత్రం మారుతుంది. సత్కార్యవాదాన్ని నిరూపించటానికి ఈశ్వర కృష్ణుడు ఐదు కారణాలు చెప్పాడు.

**1. అసదకరణాత్ :** అసత్తు కార్యాన్ని ఉత్పత్తి చెయ్యలేదు. అంటే లేనటువంటిది దేన్నీ ఉత్పత్తి చెయ్యలేదు. లేనటువంటి కుందేటి కొమ్ము నుంచి ఏదీ రాదు. గొడ్రాలి కొడుకు ఏమీ చెయ్యలేడు. అంటే కారణంలో కార్యం ఉండి తీరాలి. లేకపోతే ఎటువంటి పరిస్థితులలోను కార్యం ఉత్పత్తి కాదు. నీలరంగులోంచి పసుపురంగు రాదు. చెక్క నుంచి బంగారం రాదు.

**2. ఉపాదానగ్రహణాత్ :** ఏ వస్తువువల్ల కార్యాన్ని ఉత్పత్తి చెయ్యటం సాధ్యమవుతుందో, దాన్నే మనం తీసుకుంటాం. నువ్వుల నుంచి నూనెను తయారుచేస్తాం. ప్రత్తితో వస్త్రాలు, మట్టితో కుండలు తయారుచేస్తాం అంటే కార్యకారణాలకు సంబంధం ఉంది. ఒకవేళ అదే గనక అవసరం లేకపోతే ఇసక నుంచి నూనెను తియ్యవచ్చు. ఈ రకంగా కార్యకారణ సంబంధం నిశ్చయం.

**3. సర్వసంభవాభావాత్ :** ఒకవేళ ఇందాక చెప్పినట్లుగా ప్రత్యేకమైన ఉపాదాన కారణం నుండి ప్రత్యేక కార్యం గనక ఉత్పత్తి కావటం నిజం కానట్లైతే, ప్రతి కార్యానికీ ప్రతిదీ కారణం అయి ఉండేది. అంటే మట్టి నుంచి కుండే కాకుండా వస్త్రం కూడా తయారై ఉండేది. కాని ఇది జరగదు. కాబట్టి ప్రతి కార్యానికీ అన్నీ కారణాలు కావు.

**4. శక్తస్యశక్త కరణాత్ :** మీమాంసకుల ప్రకారం 'శక్తి' కారణంలో ఉండి అదే కార్యాన్ని ఉత్పత్తి చేస్తుంది. అంతే కాని కార్యకారణ సంబంధం అవసరం లేదు. దీని ప్రకారం అన్ని కారణాల నుంచి అన్ని కార్యాల ఉత్పత్తి జరగాలి. అందుకే ఈ వాదన సరికాదు. సాంఖ్యుల ప్రకారం కారణంలో శక్తి ఉన్నదా లేదా అనే విషయం కార్యం ఉత్పత్తి అయిన తరువాతే తెలుస్తుంది. ఏ కారణం నుంచి ఏ కార్యం ఉత్పత్తి అయిందో చూస్తే, కార్యకారణాల సంబంధం తెలుస్తుంది.

**5. కారణభావాత్ :** సాంఖ్యులు కార్యకారణాల అవినాభావ సంబంధాన్ని అంగీకరించారు. వీరి ప్రకారం కార్యం ఉంటే కారణం కూడా ఉన్నట్లే.

సాంఖ్యకారులు ఈ ఐదు హేతువుల వల్ల కార్యకారణం ఉన్నదని ప్రతిపాదించారు. దీనివల్ల తేలింది ఏమిటి అంటే అవ్యక్తంలో ఉన్న వస్తువు కార్యకారణ సంబంధంవల్ల వ్యక్తం అవుతుంది. అలాగే ఈ కార్యకారణ సంబంధం అంతం కావటంతో వ్యక్తమైన వస్తువు అవ్యక్తంలో లీనమై పోతుంది. అంటే వస్తువు స్థూలం నుంచి సూక్ష్మంలోకి మారిపోతుంది. అంతేకాని నాశనం కాదు.

**ద్వైతం :** సాంఖ్యదర్శనం ద్వైతాన్ని ప్రతిపాదిస్తుంది. దీని ప్రకారం ప్రకృతి, పురుషుడు ఈ రెండూ మూలతత్త్వాలు. ఈ రెండింటి పరస్పర సంబంధం వల్ల ఈ జగత్తు అంతా ఆవిర్భవిస్తుంది. ప్రకృతి జడం. ఇది ఒకటే. కాని పురుషుడు అనేకం ఇలా చెప్పి వాస్తవవాదాన్ని సమర్థిస్తోంది. సాంఖ్యులు ఈ జగత్తుకు ప్రకృతి పురుషులు ఇద్దరే మూలము అని చెబుతూ ద్వైతాన్ని ప్రతిపాదిస్తారు. ఈ జగత్తులో బుద్ధి, మనస్సు, ఇంద్రియాలు, శరీరం మొదలైనవన్నీ పరిమితమైనవి. ఇవన్నీ ఏదో ఒక కారణంవల్ల ఉత్పన్నమైనవి. అస్వతంత్రమైనవి, కార్యరూపాలు. ఇవి జన్మించటాకి ఏదో ఒక కారణం ఉండే ఉంటుంది. ఈ కారణం కోసం అందరూ ప్రయత్నించ. జైనులు, బౌద్ధులు, తార్కికులు వీరందరూ కూడా అత్యంత సూక్ష్మ పరమాలే జగదుత్పత్తికి మూలకారణం అన్నారు. కాని సాంఖ్యుల ప్రకారం భౌతిక పరమాల వల్ల స్థూల జగత్తు ఉత్పత్తి అయి ఉండవచ్చు కాని మిక్కిలి సూక్ష్మపదార్థాత్తి పరమాణువుల వల్ల జరగదు. వీరి ఉద్దేశ్యంలో స్థూలమే కాకుండా సూత్తు యొక్క ఉత్పత్తి ప్రకృతి వల్ల జరుగుతుంది.

**ప్రకృతి : ప్రకరోతి ఇతి ప్రకృతి** సమస్తమైన జగత్తు సృష్టికి మూలకారణమైన తత్త్వం ఏదైతే ఉందో, అదే ప్రకృతి. కుండకి మట్టిలాగా ఈ జగత్తుకు ప్రకృతి ఉపాదాన కారణమవుతున్నది. ఇది అత్యంత ముఖ్యమైనది కాబట్టి ప్రధానము అని, సూక్ష్మాతిసూక్ష్మం కాబట్టి అవ్యక్తము అని అనబడుతుంది.

సాంఖ్యులు దీన్ని అనుమాన ప్రమాణంతో నిరూపించారు.

**1. భేదానాం పరిమాణాత్ :** కారణం వికారం పొంది కార్యం అవుతుంది. అంటే ప్రకృతి వికారం పొంది జగత్తుగా మారుతుంది. మహత్తు, అహంకారము మొదలైన ఇరవైఐదు తత్త్వాలే ఆ వికారాలు. ఇవి పరిచ్ఛిన్నము లేదా పరిమితమైనవి. ఇలా పరిమితమైన వస్తువులు, అపరిమితమైన వస్తువులకు కారణం కాలేవు. కుండ జగత్తుకు కారణం కాలేదు. ఈ రకంగా మహదాదులు జగత్తుకు కారణం కాలేవు. ఒకవేళ అవే గనక కారణమైతే బహుకారణత్వం ఏర్పడుతుంది. మహదాదులన్నీ స్వయంగా కార్యాలు. కారణాలు కావు. వాటికి కారణం జాగ్రత్తగా పరిశీలిస్తే, అపరిచ్ఛిన్నము, నిత్యము, ఏకరూపమైన మూలవస్తువే జగత్తుకు కారణం అని తెలుస్తుంది. అదే ప్రకృతి.

**2. భేదానాం సమన్వయాత్ :** ఒక కార్యమునందు సమన్వయించేదే, దానికి కారణమవుతుంది. మట్టి కుండకు సమన్వయించి కారణం అవుతుంది. మహదాది తత్త్వాలు వేరైనప్పటికీ, వాటిలో త్రిగుణాత్మకమైన ప్రకృతి సమన్వయాన్ని నిలుపుతుంది. అందుచేత అవ్యక్తమైన ప్రకృతి నుండి ఉత్పన్నమైన ఈ జగత్తులో సుఖము, దుఃఖము, మోహము కనిపిస్తాయి. ఈ విధంగా కార్యమయిన జగత్తులో కారణమయిన ప్రకృతి సమన్వయిస్తుంది.

**3. భేదానాంశక్తితః ప్రవృత్తేశ్చ :** కారణమైన వస్తువుకి కార్యాన్ని పుట్టించే శక్తి ఉండాలి. మట్టిలో కుండను పుట్టించే శక్తి, బంగారంలో ఆభరణాన్ని పుట్టించే శక్తి ఉండాలి. ఆ శక్తి లేకపోతే అవి ఉపాదానంగా తీసుకోబడవు. ఈ సూత్రాన్ని అనుసరించి ఏ కార్యాన్ని పుట్టించే శక్తి ఏ వస్తువులో ఉంటుందో, ఆ వస్తువును పుట్టించటానికే అది పనికి వస్తుంది. ఏ చెట్టు విత్తనం ఆ చెట్టునే పుట్టిస్తుంది అలాగే ఈ జగత్తు అనే కార్యాన్ని పుట్టించగల కారణం కావాలి. అటువంటి శక్తి గలది ప్రకృతి.

**4. కారణ-కార్య-విభాగాత్ :** తత్త్వాలను కారణం. కార్యం అని రెండుగా విభజించటం జరుగుతుంది. మహత్తు నుంచి అహంకారం పుట్టింది అంటే మహత్తు కారణం అహంకారం కార్యం. ఇలాగే మహత్తు కార్యం. దానికి కారణం అవ్యక్తం అదే ప్రకృతి.

**5. అవిభాగాత్ వైశ్వరూపస్య :** సాంఖ్యకారులు కారణ కార్యాల తాదాత్మ్యాన్ని ప్రతిపాదిస్తారు. మట్టి నుంచి కుండ పుట్టి, అది పగిలి పెంకులై, ఆ పెంకులు పొడియై తిరిగి మట్టిలో కలిసిపోతుంది. అలాగే ప్రకృతి మహదాది రూపాలుగా మారి, జగత్తుగా వ్యక్తమవుతుంది. తిరిగి ఆ జగత్తు ప్రకృతిలో లీనమవుతుంది. ఈ విధంగా జగత్తు – ప్రకృతి యొక్క తాదాత్మ్యం జరుగుతుంది.

ఈ రకంగా కార్యకారణ రూపమైన అవ్యక్తమూలప్రకృతి ఒకటి ఉన్నది అంటారు సాంఖ్యకారులు. ప్రకృతి యొక్క స్వభావాన్ని పరిశీలించినట్లైతే, అది చాలా సూక్ష్మమైనది. ఇంద్రియాలకు కనిపించదు. దాన్ని కేవలము అనుమాన ప్రమాణంతోనే తెలుసుకోవాలి. ఇది కంటికి కనిపించదు కాబట్టే దీనికి అవ్యక్తం అని పేరు. ఇది త్రిగుణాత్మకము.

ప్రకృతి మహదాదులుగా రూపాంతరం చెంది ఈ జగత్తుగా మారినప్పుడు అది వ్యక్తమవుతుంది. ఇది స్వయంగా కారణమే కాని కార్యమాత్రం కాదు. ఇది అనాదియైనది. అయితే సృష్టికి ఎలా ఆది అయిందో, అలాగే ప్రళయానికి కూడా చిట్టచివరి అధిష్ఠానమై ఉన్నది. ఈ రకంగా సత్వరజస్తమో గుణాల సామ్యావస్థలో ప్రకృతి కారణ రహితమై, నిత్యమై, వ్యాపకమై, నిష్క్రియమై, ఏకమై, నిరాశ్రయమై, చివరదియై, నిరవయమై, స్వతంత్రమై, వివేకరహితమై, విషయమై, సామాన్యమై, అచేతనమై, ప్రసవధర్మిణియై ఉంటుంది అని సాంఖ్యకారికలు చెబుతున్నాయి.

**గుణత్రయము :** ఈ సృష్టిలో సమస్తమూ సుఖదుఃఖాలు, మోహాము కలుగచేస్తాయి. ఒక అందమైన స్త్రీ ఉందనుకోండి. ఆవిడ ఒక కాముకుణ్ణి దుఃఖాగ్నిలో పడేస్తుంది. ఇంకొకణ్ణి మోహంలో పడేస్తుంది. అదే విధంగా అచేతనమైన వస్తువుల్లో ఒకటి లభిస్తే ఆనందం, లభించక పోతే దుఃఖం. ఇక్కడ వస్తువు ఒకటే. కాని వివిధ పరిస్థితులలో సుఖదుఃఖాలకు, మోహానికి కారణమవుతుంది. ఇలా జరగటానికి ప్రకృతిలో అంతర్లీనంగా ఉన్న మూడు గుణాలే కారణమంటారు

సాంఖ్యకారులు. ఇవి ప్రకృతికి అంగరూపాలై, పురుషుడికి అర్థసిద్ధి కలిగిస్తాయి అని **వాచస్పతిమిశ్రుడు** తన **తత్త్వకౌముదిలో** వ్రాశాడు. మహదాది వికారాలను కల్పించి, పురుషునికి బంధ కారణాలవుతాయి కాబట్టి ఇవి గుణాలనబడతాయి అంటాడు **విజ్ఞానభిక్షువు.** గుణాలు మూడు. అవి సత్వరజస్తమస్సులు. వాటిని గురించి ఒకసారి చూద్దాం. 'సత్' అంటే ఉన్నది, పరిపూర్ణత అని అర్థం. ఈ సత్వగుణం వల్లనే మనసుకు సుఖసంతోషాలు, తృప్తి కలుగుతాయి. సుఖము, ప్రీతి, శాంతి, లజ్జ, అంగలాఘవము (దేహము తేలికగా ఉండటం) ఓర్పు, ధైర్యము, అకార్పణ్యము (లోభము లేకపోవటము) దమము, జ్ఞానము, ప్రకాశించటము అనేవి సత్వగుణ లక్షణాలు.

లోభము, సంతాపము, కోపము, విగ్రహము (కలహము) అభిమానము, అసత్యముపలకటము, కర్మలయందుప్రవర్తించటము, దంభము, రజోగుణ లక్షణాలు.

శరీరం తూగటం, కునికిపాట్లు పడటం, మోహము, నిద్ర ఒళ్ళు బరువెక్కటం, అలసత్వం, అజ్ఞానం, ఏమరుపాటు, తమోగుణ లక్షణాలు. ఈ రకంగా సత్వగుణం నిర్మలత్వానికీ, రజోగుణం ఇంద్రియ చాంచల్యానికీ, అసంతృప్తికి, దుఃఖానికీ, తమోగుణం సోమరితనం, నిద్ర, నిష్క్రియత్వానికీ ప్రతీకలు.

**పురుషుడు :** సాంఖ్యదర్శనం ప్రకారం పురుషుడు ఒక తత్త్వం. అతడే ఆత్మ. పురుషుడి అస్తిత్వం మీద అనుమానం లేదు. 'నేనున్నాను'. 'ఇది నాది' ఇటువంటి భావం సహజమైనది. ఇది అనుభవంతో కూడి ఉన్నది కూడా. దీన్ని నిరూపించటానికి వేరే ప్రమాణం ఏదీ అవసరం లేదు. ఎవరూ దీన్ని కాదనరు. కాబట్టి ఆత్మ, లేదా పురుషుడు స్వతః ప్రమాణం కలవాడు. స్వయంసిద్ధుడు. పురుషుడు అనగా ఆత్మ శరీరము, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధికన్న విశిష్టమైంది. శుద్ధచైతన్య స్వరూపం. చేతనత్వం దీనిస్వభావం అంతే కాని దీని లక్షణం కాదు. ప్రకృతి నుంచి ఉత్పన్నమైనవన్నీ త్రిగుణాలతో కలిసి ఉంటాయి. వీటిలో త్రిగుణాలు ప్రకృతికి చెందినవి, కాగా చైతన్యాంశ పురుషునికి చెందుతుంది. ప్రకృతిలో అనేక పరిణామాలు జరుగుతాయి. కాని ఆత్మలో మాత్రం జరగవు. ఆత్మ నిర్వికారమైనది. నిత్యం, నిర్మలం, సర్వవ్యాపకం. క్రియాశీలత ప్రకృతి ధర్మం. అలాగే పురుషుడు నిష్క్రియుడు. ఆ కర్త, ప్రకృతి సృష్టి కార్యానికి కారణం. పురుషుడు మాత్రం కేవలం సాక్షీమాత్రంగా

ఉంటాడు. పురుషుని యొక్క అస్తిత్వాన్ని నిరూపించటానికి సాంఖ్యులు ఐదు సూత్రాలు చెప్పారు. అవి వరుసగా,

**1. సంఘాత పరార్థత్వాత్ :** సంఘాతము అంటే సమూహము అని అర్థం. ఉదాహరణకు ఇల్లు. ఇల్లు అనేది ఇటుక, సిమెంటు, ఇసుక, రాయి మొదలైన వాటి సమూహము. అలాగే వస్త్రము దారాలయొక్క సముదాయము. అలాగే ప్రతివస్తువూ కూడా లోకంలో ప్రతివస్తువు ఇతరుల ఉపయోగం కోసమే ఏర్పాటు చేయబడి ఉంటుంది. అందువల్ల ప్రకృతిద్వారా ఉత్పన్నమైన వస్తుసమూహమైన జగత్తు తప్పనిసరిగా ఒకరి ఉపయోగార్థమై ఉండాలి. అది ఎవరి ఉపయోగం కోసం అన్నదే ప్రశ్న. ఆ ఒకరే జగత్తుకన్న విలక్షణమైన పురుషుడు.

**2. త్రిగుణాది విపర్యయాత్ :** త్రిగుణాత్మకమైన జగత్తు ఉన్నది. అది జ్ఞేయము. కాబట్టి దానికి భిన్నంగా జ్ఞాత అయిన పురుషుడు సాక్షిమాత్రంగా ఉన్నాడు.

**3. అధిష్ఠానాత్ :** ప్రకృతిజడం. దాన్నుంచి ఉత్పన్నమైన జగత్తు కూడా జడమే. అది చైతన్యంతో కలిసినప్పుడే ప్రవృత్తికి లోనవుతుంది. ఉదాహరణకు ఒక బండి ఉన్నది. అది జడం. తనకు తానుగా కదల్లేదు. బండి తోలేవాడు వచ్చినప్పుడే బండి ఒకచోటినుంచి ఇంకోచోటికి పోగలుగుతుంది. అలాగే జడరూపమైన ప్రకృతి చైతన్యరూపుడైన పురుషునివల్లనే ప్రవృత్తి పొందుతుంది.

**4. భోక్తృభావాత్ :** ఈ జగత్తులో ఉన్న వస్తువులన్నీ అనుభవించదగినవే. వాటిని అనుభవించేవాడే భోక్త. అయితే అనుభవించేవాడు, అనుభవింపబడే వస్తువూ, రెండూ ఎప్పటికీ ఒకటి కావు. అందుకే భోగ్యమైన జగత్తుకన్న భోక్త అయిన పురుషుడు వేరుగా ఉంటాడు.

**5. కైవల్యార్థం ప్రవృత్తేః :** ఈ లోకంలో కొంతమంది తను దుఃఖాలను నివృత్తి చేసుకోవటం కోసం నిరంతరము ప్రయత్నిస్తుంటారు. అయితే త్రిగుణాత్మకమైన ఈ జగత్తును నివృత్తి చెయ్యటం జరిగే పనికాదు. మనకున్న బంధాల నుంచి నివృత్తి పొందవచ్చు అంటే జగత్తు కన్న వేరే అస్థిత్వం గల పురుషుడు ఒకడున్నాడని తెలుస్తోంది అంటారు సాంఖ్యులు.

సాంఖ్యదర్శనం ప్రకారం పురుషులు అనేకమంది దీన్ని నిరూపించటానికి ఈశ్వరకృష్ణుడు ఉపనిషత్తులను ప్రస్తావించాడు.

1. జనన మరణాలు, ఇంద్రియాలు మనకి కనిపించే విషయాలు. ఒకవేళ పురుషులు అనేకమంది లేకుండా ఒక్కడే అయినట్లైతే, ఒక పురుషుడు జన్మిస్తే అదే సమయంలో మిగిలిన అందరూ జన్మించాలి. ఒకడు మరణిస్తే అందరూ మరణించాలి. ఒకరికి కాళ్ళు లేకపోతే ఎవరికీ కాళ్ళు ఉండరాదు.

2. ఒకడు ఒకరంగా ప్రవర్తిస్తే, మిగిలిన వారు కూడా అలాగే ప్రవర్తించాలి. కాని వాస్తవంలో అలా జరగదు. పురుషుల ప్రవర్తనలో తేడా ఉంటుంది.

3. ఒకరిలో శాంతస్వభావం ఎక్కువ. ఒకరిలో స్వార్థం ఎక్కువ. ఇంకొకరిలో మితిమీరిన స్వభావాలుంటాయి. పురుషుడు ఒక్కడే అయితే ఇలా జరగరాదు.

4. పశువులు, మానవులు, దేవతలు. వీరందరూ ఒకరికన్నా ఒకరు ఉత్తమశ్రేణికి చెందినవారు. వీరందరిలోనూ ఉండే ఆత్మ ఒకటే అయితే, వారి మధ్య వ్యత్యాసం ఉండరాదు.

ఈ రకంగా చూసినట్లైతే పురుషులు అనేకులు అని తెలుస్తుంది అంటాడు ఈశ్వర కృష్ణుడు.

**సృష్టి:** సృష్టి ఏ విధంగా జరుగుతుంది? అనే దానికి అర్థం చెప్పారు సాంఖ్యులు. పురుషుడు చైతన్యము. ప్రకృతి జడము. ఈ రెండూ కూడా విడివిడిగా సృష్టి చెయ్యలేవు. కాని ఈ రెండూ కలిస్తే సృష్టి జరుగుతుంది. మరి ఈ రెండింటి సంయోగము ఎలా జరుగుతుంది? అనేదే ప్రశ్న. దీనికి సమాధానం ఇనుపముక్క, సూదంటురాయి. ఈ రెండూ ప్రత్యేకమైన గుణాలు గలవి. కాని ఒక దానిని ఒకటి ఆకర్షించుకుంటాయి. సూదంటురాయి దగ్గరకు రాగానే ఇనుపముక్కలో చలనం కలుగుతుంది. అలాగే పురుషుని సాన్నిధ్యంమాత్రంచేతనే ప్రకృతి వికారం పొంది మహదాదులుగా మారుతుంది అంటే సృష్టి జరుగుతుందన్న మాట. ఈ సంబంధం వల్ల ప్రయోజనాన్ని వివరించటానికి కుంటివాడు, గ్రుడ్డివాడి కథ చెప్పారు. కుంటివాడికి దారి కనిపిస్తుంది కాని నడవలేడు. గ్రుడ్డివాడు నడువగలడు కాని దారి కనిపించదు. ఇద్దరూ పరస్పరం సహకరించుకుంటే ప్రయోజనం పొందగలుగుతారు. ఇరువురికీ పరస్పరాపేక్ష కలిగితే,

వారి ప్రయోజనం నెరవేరటంలో సార్థకమవుతుంది. అదే విధంగా, క్రియాశీలత గల జడమైనప్రకృతి, క్రియాశీలత లేని చైతన్యంగల పురుషుడు. వీరిద్దరికీ పరస్పరాపేక్ష కలిగి, వాటి మధ్య సంబంధం ఏర్పడుతుంది. ఆ సంబంధం పరస్పర కార్యసాధకం అవుతుంది. దీనివల్ల 'ఉపయోగం ఏమిటి అంటే పురుషుడు భోక్త. ప్రకృతి భోగవస్తువు. ప్రకృతి పురుషుడికి దర్శనరూపమైన భోగాన్నిస్తుంది. ఈ రకంగా అది పురుషుని అపేక్షించేది అవుతుంది. భోక్త ద్వారా అనుభవించబడినప్పుడే ప్రకృతికి సాఫల్యత ఏర్పడుతుంది. అలాగే పురుషుడు కూడా ప్రకృతిని అపేక్షించేవాడుగా ఉంటాడు. ప్రకృతితో పొందే సంబంధం వల్ల అతడికి వివేకజ్ఞానం ప్రాప్తించి మోక్షం సిద్ధిస్తుంది. అంటున్నాయి సాంఖ్యకారికలు.

సృష్టిక్రమంలో మొదటగా **మహత్తు** ఆవిర్భవించింది. ఇది సమిష్టిబుద్ధి రూపం. దీనివల్లనే జీవుడికి జ్ఞాత, జ్ఞాన, జ్ఞేయ వస్తువుల జ్ఞానం కలుగుతుంది. బుద్ధియొక్క సహకారంతోనే జీవుడు నిశ్చయాత్మక జ్ఞానాన్ని పొంది అనుభవం ద్వారా తనకు, ప్రకృతికీ మధ్య గల భేదాన్ని గుర్తించగలుగుతాడు.

అయితే ప్రకృతి నుంచి జనించిన బుద్ధి కూడా త్రిగుణాత్మకమే. దానివల్లనే సాత్త్విక, రాజస, తామస బుద్ధులు ఏర్పడతాయి. ధర్మము, జ్ఞానము, రాగద్వేషాలు, ఐశ్వర్యం మొదలైన దైవీ లక్షణాలు సాత్త్వికబుద్ధికి సంబంధించినవి. కామక్రోధాలు రాజసబుద్ధికి, అలసత్వము, అశక్తత, అజ్ఞానము తామసబుద్ధికి సంకేతాలు. ప్రకృతి యొక్క మరోవికారమే అహంకారము. ఇది మహతత్త్వము నుంచి ఆవిర్భవిస్తుంది. మహతత్త్వం వల్ల ఏర్పడ్డ బుద్ధిలో నేను, నాది అనే అభిమానమే అహంకారము. జీవి ఈ అహంకారానికి లోనై భ్రమకు గురి అవుతాడు. అన్నింటికీ తాను కర్తని అనుకుంటాడు. తానే యజమాని అనుకుంటాడు. ఇంద్రియాలవల్ల విషయజ్ఞానం ప్రత్యక్షంగా కలుగుతుంది. అంటే ఇంద్రియాల ద్వారా వస్తువులను తెలుసుకోగలుగుతాము. అప్పుడు మనసు ఆ వస్తువులను గురించి ఆలోచిస్తుంది. ఆ తరువాత అహంకారంతో సంబంధం కలిగి ఇది నాది అనే భావన కలిగిస్తుంది. ఈ రకంగా జీవికి సంసారిక విషయాలతో సంబంధం ఏర్పడుతుంది. తద్వారా జీవి వివిధ కర్మలయందు ప్రవృత్తుడవుతాడు అని చెబుతున్నారు సాంఖ్యకారులు.

తెల్లనిదారంతో తయారుచేసినబట్ట ఎలా తెల్లగాఉంటుందో, అలాగే త్రిగుణాలకి అనుగుణంగా ఏర్పడ్డ సృష్టి కూడా మూడు రకాలుగానే ఉంటుంది. సాంఖ్యుల ప్రకారము అహంకారము మూడు రకాలు. అవి

**1. సాత్త్వికాహంకారము :** ఇందులో సత్త్వగుణం పాలు ఎక్కువగా ఉంటుంది. చెవి, కన్ను, ముక్కు, నాలుక, చర్మము అనే జ్ఞానేంద్రియాలు దీనివల్ల ఏర్పడతాయి. వీటివల్ల శబ్ద స్పర్శ రూప రస గంధాదులు తెలుస్తాయి.

చెవివల్ల - శబ్దము, చర్మమువల్ల - స్పర్శ, కన్నువల్ల - రూపము, నాలుకవల్ల - రసము (రుచి) ముక్కువల్ల - గంధము (వాసన) తెలుస్తాయి.

**2. రాజసాహంకారము :** ఇందులో రజోగుణం ఎక్కువగా ఉంటుంది. దీని నుండి వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ. అనే కర్మేంద్రియాలు ఏర్పడతాయి. వాక్కువల్ల - మాట్లాడటము, చేతివల్ల - తీసుకోవటము, కాలువల్ల - నడవటము, పాయువు వల్ల - విసర్జన, ఉపస్థవల్ల - ఆనందించటము జరుగుతుంది.

ఈ రకంగా దశేంద్రియాలు ఏర్పడ్డాయి. అంతఃకరణ అనే పేరుతో మనస్సు పదకొండవ ఇంద్రియముగా ఏర్పడుతుంది. ఈ మనస్సు జ్ఞానేంద్రియాలతో కలిసినప్పుడు విషయాలను గ్రహిస్తుంది. కర్మేంద్రియాలతో కలిస్తే పని చేస్తుంది. ఈ విధంగా ఇది ఉభయేంద్రియమవుతున్నది.

**3. తామసాహంకారము :** ఇందులో తమోగుణం ఎక్కువగా ఉంటుంది. దీనివల్ల పంచతన్మాత్రలు, వాటి నుంచి పంచభూతాలు ఆవిర్భవిస్తాయి. శబ్దము ఆకాశము యొక్క గుణము, శబ్దము, స్పర్శ వాయువు గుణాలు. శబ్దము, స్పర్శ, రూపము అగ్ని యొక్కగుణాలు. శబ్దము, స్పర్శ, రూపము, రసము, జలముయొక్క గుణాలు. శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము అనేవి భూమియొక్క గుణాలు.

ఈ రకంగా 1. ప్రకృతి 2. మహత్తత్త్వము. అహంకారము, పదకొండు ఇంద్రియాలు, పంచతన్మాత్రలు, పంచభూతాలు మొత్తం ఇరవై నాలుగు తత్త్వాలు ఆవిర్భవిస్తున్నాయి. ఇందులో ఇరవైఐదవ తత్త్వము పురుషుడు. ఇది సాంఖ్య సిద్ధాంతము. ఈ సిద్ధాంతాన్ని వాచస్పతిమిశ్రుడు కూడా ఒప్పుకున్నాడు. కాని విజ్ఞాన భిక్షువు సృష్టిక్రమాన్ని వేరుగా చెప్పాడు. ఇతని ప్రకారం మనస్సు సత్త్వగుణ

ప్రధానమైనది. ఇది సాత్త్వికాహంకారం నుంచి ఆవిర్భవించింది. మిగిలిన పది ఇంద్రియాలు రాజసాహంకారం యొక్క పరిణామాలు. ఇక పంచతన్మాత్రలు తామసాహంకారం నుంచి పుట్టాయి. జ్ఞానేంద్రియాల ద్వారా తన్మాత్రల జ్ఞానం కలుగుతుంది. ఇవి పురుషుని కోసం ఉత్పన్నమైన అహంకార పరిణామాలు. పురుషుడిలో కలిగే భోగేచ్ఛ వల్ల ఇంద్రియాలు ఉత్పత్తి అవుతాయి. కర్మేంద్రియాల వల్ల నడవటం, తీసుకోవటం, మాట్లాడటం, విసర్జన, సంతానోత్పత్తి చేస్తాడు. ఇంద్రియాలు అంటే శరీరంలో కన్ను ముక్కు నోరు చెవులు కాదు. అవి కంటికి కనిపించని శక్తులు. అవి ఆ అవయవాల ద్వారా పనులను చేస్తాయి. అందువల్ల ఇంద్రియాలు 'అనుమేయాలు' అని సాంఖ్యసూత్రాలలోను, తత్త్వకౌముదిలోను చెప్పటం జరిగింది.

మిగిలిన ఇంద్రియాలతో పాటుగా మనసు కూడా ఒక ఇంద్రియమే. అయితే అది మన కంటికి కనిపించకుండా ఉంటుంది. జ్ఞానేంద్రియాలకు, కర్మేంద్రియాలకు సహకరించి, ఆ కర్మలలో వాటిని ప్రేరేపిస్తుంది. మనస్సనేది మహాసూక్ష్మమైన ఇంద్రియము. ఒకే కాలంలో అన్ని ఇంద్రియాలతోను కలిసిపోగలుగుతుంది. బయటి విషయాలు ఇంద్రియాల ద్వారా మనస్సును చేరి, ఒక రూపాన్ని పొంది, అహంకారం చేత వేరు వేరుగా విభజించబడి, బుద్ధిచేత అది ఇటువంటిదని నిర్ధారించబడుతుంది. పురుషుని ఉద్దేశ్యానికి తగ్గట్లుగా వాటిపట్ల రాగ ద్వేషాలను కలిగిస్తుంది.

ఈ విధంగా సృష్టి రెండు దశలలో జరుగుతుంది. మొదటిదశలో జరిగే సృష్టిని బుద్ధివర్గము అంటారు. రెండవదశ తన్మాత్రవర్గము. మొదటి దశలో బుద్ధి అహంకారము, మనస్సు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు ఆవిర్భవిస్తాయి. రెండవ దశలో తన్మాత్రలు, పంచభూతాలు ఆవిర్భవిస్తాయి. తన్మాత్రలు అత్యంత సూక్ష్మాలు. అప్రత్యక్షాలు. భౌతికతత్త్వమంతా దీని నుంచి జరిగే మార్పు, విశేషధర్మాలు, లక్షణాలు కలిగి ఉంటుంది. అందువల్ల ఇది విశేషము అని పిలువబడుతుంది. ఈ విశేషం మూడు రకాలు 1. స్థూల మహాభూతాలు 2. స్థూలశరీరం 3. సూక్ష్మశరీరం.

కొందరి అభిప్రాయంలో స్థూలశరీరం నాలుగు భూతాలవల్ల ఏర్పడుతుంది. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, తన్మాత్రలు, బుద్ధి, అహంకారము, మనస్సుల

వలన సూక్ష్మశరీరం ఏర్పడుతుంది. సూక్ష్మశరీరానికి స్థూలశరీరం ఆశ్రయం. ఇది **వాచస్పతిమిశ్రుని** అభిప్రాయం. కాని స్థూల, సూక్ష్మశరీరాలే కాకుండా అధిష్ఠాన శరీరము కూడా ఉన్నది అంటాడు విజ్ఞానభిక్షువు. సూక్ష్మశరీరం ఒక శరీరాన్ని వదిలి రెండో శరీరాన్ని ఆశ్రయించేటప్పుడు, ఆ రెండో శరీరమే అధిష్టానశరీరము అవుతుంది. ఈ రకంగా ఇరవై నాలుగు తత్త్వాలతో ఆవిర్భవించిన ఈ జగత్తులోని ఆత్మలన్నీ గుణత్రయాన్ని, పుణ్యపాపాలను అనుసరించి ప్రళయకాలంలో సూక్ష్మదేహాలతో ప్రకృతిలో లీనమై ఉంటాయి. ఈ జగత్తంతా సూక్ష్మరూపంతో ప్రకృతిలోనే ఉన్నది. సృష్టికాలంలో మూలప్రకృతి నుంచి అభివ్యక్తమవుతుంది. జగత్తంతా సత్పదార్థమే. ఇక్కడ కారణమైన ప్రకృతి, కార్యమైన జగత్తు కూడా సత్పదార్థలే అంటే సత్పదార్థం నుంచి సత్పదార్థం పుడుతున్నదని సాంఖ్యశాస్త్రం చెబుతున్నది. సాంఖ్యులు ప్రత్యక్ష, అనుమాన, శబ్ద ప్రమాణాలు మాత్రమే అంగీకరించారు.

**మోక్షం :** పురుషుడు తనను తాను తెలుసుకోవటం, ప్రకృతికి స్వరూపజ్ఞానం కలగటం, ఇదే మోక్షము అన్నారు సాంఖ్యులు.

జీవితంలో దుఃఖాలు మూడు రకాలు 1. ఆధి భౌతికం 2. ఆధిదైవికం 3. ఆధ్యాత్మికం. మానవ, పశు పక్ష్యాదుల వల్ల కలిగే దుఃఖం ఆదిభౌతికం. భూతప్రేతాల వల్ల, అలౌకిక శక్తుల వల్ల కలిగేవి అధిదైవికం శారీరక, మానసిక క్లేశాలవల్ల కలిగే రోగము, నొప్పి, కోపతాపాలు ఆధ్యాత్మికాలు. ఇవి ప్రతి మనిషినీ పట్టి పీడిస్తుంటాయి. కాబట్టి వాటిని గురించి బాగా ఆలోచించాలి అంటూ సాంఖ్యదర్శనాన్ని వివరించి, సాంఖ్య జ్ఞానం మోక్షప్రాప్తికి సాధనము అని చెప్పాడు ఈశ్వరకృష్ణుడు.

వైదిక కర్మలవల్ల మోక్షం రాదు. యజ్ఞయాగాదులలో చేసే పశుహింస పాపహేతువు. యజ్ఞకర్మ వల్ల వచ్చే స్వర్గం కూడా శాశ్వతం కాదు. పుణ్యక్షయం జరిగినప్పుడు స్వర్గం నుంచి పతనం తప్పదు. అందుకే యజ్ఞయాగాదుల్ల వల్ల మోక్షం రాదు అన్నారు సాంఖ్యులు. పురుషుడు స్వభావం చేత నిర్లిప్తుడు, నిస్సంగుడు, త్రిగుణాతీతుడు, నిత్యుడు అలాగే 'అవిద్య' కూడా నిత్యమే. అనాదిగా ఈ రెండింటికీ సంబంధమున్నది. పురుషునితో బాటే ప్రకృతికూడా అనాది నుంచీ ఉన్నది. పురుషుని సాన్నిధ్యంలో ప్రకృతి చైతన్యవంతమవుతుంది. ప్రకృతిలో గుణత్రయ దోషం కలిగి

మహదాదుల సృష్టి జరుగుతుంది. ఈ ప్రక్రియ పురుషుణ్ణి కూడా ప్రభావితుడుగా చేస్తుంది. దీని ఫలితంగా పురుషుడు తాను నిష్క్రియుడు, నిర్లిప్తుడు, త్రిగుణాతీతుడు అయినప్పటికీ, కర్త, భోక్త వంటి ఆసక్తికి లోనవుతాడు. ప్రకృతి పురుషుల యొక్క కల్పితమైన ఈ సంబంధమే 'బంధము' అనబడుతుంది. ఈ బంధాన్ని తొలగించుకోవటమే మోక్షము.

జ్ఞానం ద్వారా అవిద్య నశించగా, ప్రకృతి పురుషులు తమ స్వరూపాన్ని తెలుసుకుంటారు. దీంతో పురుషుడికి ఆత్మజ్ఞానం కలుగుతుంది. ఈ స్థితిలో పురుషుడు తాను నిర్లిప్తుడు, నిస్సంగుడు అని తెలుసుకుంటాడు. బుద్ధి లక్షణాలైన ధర్మం, అధర్మం మొదలైనవన్నీ నశించిపోతాయి. జ్ఞానం మాత్రం నష్టం కాదు. ఫలితంగా అతడికి సృష్టి ప్రయోజనం సమసిపోతుంది. ఈ విధంగా పురుషుడు కేవలుడుగా మిగిలిపోతాడు. అదే కైవల్యము అంటోంది సాంఖ్య దర్శనము.

కైవల్యప్రాప్తి కలిగినంత మాత్రాన పురుషుడికి శరీర పతనం జరగదు. పూర్వజన్మ సంస్కారాలు, ప్రారబ్ధం ఉన్నంతవరకు అతడిది జీవన్ముక్త స్థితి. అనుభవంవల్ల సంస్కారాలు, ప్రారబ్ధం నశిస్తాయి. అప్పుడు **విదేహముక్తి** సిద్ధిస్తుంది. ఆ స్థితిలో పురుషుడు అపేక్ష లేకుండా, సాక్షి మాత్రంగా ద్రష్టలాగా ప్రకృతిని దర్శిస్తాడు. మళ్ళీ ప్రకృతి బంధనాలలో పడడు. **ఇదే మోక్షము**. జ్ఞానం కలిగినా కూడా పురుషుడికి సంస్కారాలు, ప్రారబ్ధం ఎలా ఉంటాయి? అనే ప్రశ్న వస్తుంది. కుండ తయారవుతున్నప్పుడు కుమ్మరిచక్రం (సారె) తిరుగుతుంటుంది. కుండ తయారైన తరువాత కూడా సారె కొంతసేపు అలానే తిరుగుతుంది. అలాగే జ్ఞానం కలిగిన తరువాత కూడా పూర్వజన్మ సంస్కారాలు, ప్రారబ్ధం అనుభవించాల్సి వస్తుంది అంటాడు ఈశ్వరకృష్ణుడు.



# 5. వైశేషిక దర్శనము

వైశేషిక దర్శనము పది అధ్యాయాలతో, మొత్తం 372 సూత్రాలతో ఉంటుంది. ఈ దర్శనాన్ని వ్రాసినవాడు **కణాదమహర్షి** ఇతన్నే కణభోజి, కణభక్షకుడు అని కూడా అంటారు. ఇతని అసలు పేరు కశ్యపుడు. ఇతడు న్యాయదర్శనాన్ని వ్రాసిన అక్షపాదుడు లేక గౌతముడి తరువాత వాడు బుద్ధ భగవానుడికి పూర్వీకుడు కూడా అంటే క్రీస్తుపూర్వం నాల్గవ శతాబ్దానికి చెందినవాడు. ఈ దర్శనానికి ఔలూక్య దర్శనము అని కూడా పేరున్నది.

బాహ్యజగత్తు వాస్తవము అని దాని స్వరూప స్వభావాలను వివరించింది వైశేషిక దర్శనము. ఒక వస్తువును చిన్న చిన్న ముక్కలుగా విభజిస్తూ పోతే చివరకు విడదీయటానికి వీలు లేనటువంటి పరమాణువులుగా అవుతుంది. వీటినే కణాలు అన్నాడు మహర్షి. ఈ కణాల వల్లనే జగత్తు సృష్టించబడింది అంటాడు. ఇది ఒక రకమైన భౌతిక శాస్త్రము. కణము నిత్యమైనది. ఈ కణాల సంయోగం వల్ల ఏర్పడే పదార్థాలు అనిత్యమైనవి.

వైశేషిక సూత్ర గ్రంథంలో ఈశ్వరప్రసక్తి లేదు. ఈశ్వరుణ్ణి అంగీకరించకపోతే అది నాస్తిక వాదము అవుతుంది. అందుచేత ఆ తరువాత కాలంలో వచ్చిన ప్రశస్త పాదాచార్యుడు మొదలైన వారు ఈశ్వర అస్థిత్వాన్ని అంగీకరించారు. వారి ప్రకారము ఈశ్వరుడు ఈ జగత్తుకు పరమ కారణము. పరమాణువులు ఉపాదాన కారణము. అదృష్టాన్ని ఆధారంగా చేసుకుని ఈశ్వరుడు ఈ జగత్తును నిర్మించాడు.

ప్రశస్తపాదుడు వైశేషిక సూత్రాలకు **పదార్థ ధర్మసంగ్రహము** అనే పేరుతో భాష్యం వ్రాశాడు. కణాదుడు వైశేషిక సూత్రాలలో ఈశ్వర అస్థిత్వాన్ని చెప్పలేదు. ఆ కారణం చేత ప్రశస్తపాదుడు ఇందులో ఈశ్వర ప్రశస్తిని కూడా చేర్చాడు. తరువాత కాలంలో వచ్చిన వారంతా కూడా ఈ మార్గాన్నే అనుసరించారు వైశేషిక దర్శనానికి రావణబ్రహ్మ కూడా భాష్యం వ్రాశాడని ప్రతీతి. మనదేశంలోనే కాకుండా చైనా, జపాన్‌లలో కూడా ఈ దర్శనం మీద వ్యాఖ్యలున్నాయి. ఈ దర్శనం మీద ఉదయనుడి **'కిరణావళి'** శంకరమిశ్రుడు వ్రాసిన **'ఉపస్కారము'** శివాదిత్యుని **'సప్తపదార్థి'** ముఖ్యమైన వ్యాఖ్యలు.

**అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః** అనే సూత్రంతో ఈ దర్శనం ప్రారంభమవుతుంది. అంటే ఇంక ధర్మనిరూపణం చేస్తున్నాము అని చెప్పి అటువంటి ధర్మము అభ్యుదయాన్ని, నిఃశ్రేయస్సును ప్రాప్తింపచేస్తుంది అని నిరూపించారు. అటువంటి ధర్మానికి వేదములే ప్రమాణము. వైశేషికతత్త్వము వలన మన ఎదుట ఉన్న పదార్థాల గురించిన జ్ఞానాన్ని తెలియచెయ్యటం ద్వారా మిధ్యాజ్ఞానాన్ని నిర్వర్తింప చేయగల తత్త్వజ్ఞానాన్ని ప్రజలకు పంచగలము అని భావించిన కణాదుడు ఈ దర్శనంలో ముందుగా పదార్థ విచారం చేశాడు.

పదార్థము అంటే – ఒక పదానికి మనం తెలుసుకో తగినటువంటి అర్థము. ప్రపంచంలో గల భావపదార్థాలను ఈ దర్శనంలో ఏడు విధాలుగా విభజించారు. అవి **ద్రవ్యగుణ కర్మసామాన్య విశేష సమవాయాభావా స్సప్త పదార్థాః**

1. ద్రవ్యము 2. గుణము 3. కర్మము 4. సామాన్యము 5. విశేషము 6. సమవాయము 7. అభావము

**అర్థ ఇతి ద్రవ్యగుణ కర్మసు**

ద్రవ్యగుణ కర్మలు మూడు, అర్థము అనే మాటతో చెప్పబడ్డాయి. అర్థము అనే మాటను సామాన్యంగా శబ్దార్థము అనే భావంతోనే వాడతారు. కాని ఇక్కడ అలా జరగలేదు. ఇక మిగిలిన మూడు పదార్థాలు అంటే సామాన్య, విశేష, సమవాయువులను ఉపార్థాలు అన్నారు. కణాదుడు, ప్రశస్తపాదుల దృష్టిలో పదార్థాలు ఆరే. ఆ తరువాత వచ్చిన శ్రీధరుడు, ఉదయనాచార్యుడు శివాదిత్యుడు మొదలైన వారు 'అభావము'ను ఏడవ పదార్థంగా అంగీకరించారు. భావము అంటే ఉండటం. అభావము అంటే లేకపోవటం. పైన చెప్పిన వాటిలో మొదటి ఆరు భావ పదార్థాలు. కాగా ఏడవది అభావ పదార్థం.

ఈ దర్శనంలో సంసారము దుఃఖమయమని దీని అత్యంతిక నివృత్తియే పరమ పురుషార్థము అని చెప్పబడింది. దీనికి ఉపాయమైన తత్త్వజ్ఞానము పైన చెప్పిన ఏడు పదార్థాలకు చెందుతుంది. ఈ ఏడు పదార్థాల తత్త్వజ్ఞానము వల్లనే ముక్తి లభిస్తుంది అని వీరి వాదన.

వైశేషికుల ప్రకారము యధార్థ జ్ఞానాన్ని ఇవ్వగల ప్రమాణాలు నాలుగున్నాయి. అవి 1. ప్రత్యక్షము 2. అనుమానము 3. స్మృతి 4. ఆర్షజ్ఞానము.

పైన చెప్పిన ఏడు పదార్థాలలోను మొదటి నాల్గింటిని గూర్చిన జ్ఞానము ప్రత్యక్ష ప్రమాణము ద్వారా కలుగుతుంది అన్నారు. ద్రవ్యములు పరమాణువుల కలయిక లేక సంయోగము వలన వచ్చేవి. ఐతే పరమాణువుని మనం ప్రత్యక్షంగా గ్రహించలేము. ఆర్షజ్ఞానంవల్ల ఆత్మయొక్క ప్రత్యక్షానుభూతి కలుగుతుంది. ధర్మసాక్షాత్కారము గల ఋషులద్వారా వచ్చిన వేదాలు యధార్థ జ్ఞానాన్ని ఇస్తాయి. అయితే కాలక్రమేణా వేదాలు అపౌరుషేయాలు. అవి ఎవరిచేతా వ్రాయబడటం కాని, చెప్పబడటం గాని జరగలేదు. అవి సాక్షాత్తూ బ్రహ్మముఖము నుంచే వచ్చాయి. అని పరిగణింపబడ్డాయి. అందుచేత వేదాలు ప్రామాణికమైనాయి.

**తద్వచనాదామ్నాయస్య ప్రామాణ్యం** అని చెప్పబడింది. ప్రమాణాలలో మొదటి రెండింటినీ న్యాయదర్శనంలో వివరించటం జరిగింది. ఇప్పుడు

**3. స్మృతి :** వెనుకటి అనుభూతుల మీద ఆధారపడినది

**4. ఆర్షజ్ఞానము :** వేదవిజ్ఞానము.

జగత్తు యొక్క స్వరూప స్వభావాలను విచారించినప్పుడు, పదార్థముల మధ్య సంబంధము ఉన్నది అని తెలుస్తోంది. జాగ్రత్తగా పరిశీలించినట్లైతే ఈ జగత్తులో భౌతికము కాని పదార్థమున్నది అని అవగతమవుతుంది. బాహ్యంగా ఆరు పదార్థాలు కనిపిస్తున్నాయి. ఇక్కడ ఆలోచించతగ్గ విషయము 'అర్థము.' ఈ విషయాన్ని ఒక పేరుతో పిలవవచ్చు. పేరు అంటే పదము. అక్షర సముదాయము. అందుచేతనే వీటిని పదార్థములు అన్నారు.

| | | |
|---|---|---|
| ఉన్నది | – | అస్తిత్వము |
| పేరుతో పిలువబడేది | – | అభిధేయత్వము |
| తెలుసుకొనబడగలిగినది | – | జ్ఞేయత్వము |
| ప్రమితి | – | విషయము |

న్యాయదర్శనంలో ప్రమాణాది షోడశ పదార్థాలను వివరించగా, వైశేషిక దర్శనంలో ఏడు పదార్థాలనే వివరిస్తున్నారు. ఈ ఏడు పదార్థాల తత్త్వజ్ఞానము తెలుసుకున్నంత మాత్రం చేతనే ముక్తి కలుగుతుంది అంటోంది వైశేషిక దర్శనము.

ద్రవ్య, గుణ, కర్మలకు ఈ జగత్తులో అస్తిత్వము ఉన్నది. కాబట్టి ఇవి అర్థములని, ప్రత్యక్షంగా వీటిని తెలుసుకోవచ్చుననీ అంటాడు కణాదుడు. మిగిలిన మూడు పదార్థాలు తర్క భాగానికి చెందినవి. వీటిలో మొదటి మూడింటికీ అంటే – ద్రవ్య, గుణ, కర్మలకు ఉత్పాదకశక్తి అంటే ఉత్పత్తి చేసే శక్తి ఉన్నది కాబట్టి వీటికి అంతం కూడా ఉంది. మిగిలిన మూడూ దేశ కాల కారణముల కతీతమైనవి.

**1. ద్రవ్యము :** ద్రవ్యము వాస్తవంగా జగత్తులో ఉన్నది. గుణకర్మ విశిష్టమై సమవాయి కారణమైనది ద్రవ్యము. గుణానికి ఆశ్రయము ఉత్పత్తి అయిన మరుక్షణమే ద్రవ్యము గుణరహితమవుతుంది. గుణానికి గుణాలుండవు. అవయవాలున్న ద్రవ్యాలు వేరొక దాన్ని ఆశ్రయించుకుని వచ్చినవి కావటం చేత, అవి శాశ్వతంగా ఉండవు. అవయవాలు లేనటువంటి ద్రవ్యము, నిత్యము, అనాశ్రితము, అంత్య విశేషము గలది. దీనికి ఆద్యంతాలు ఉండవు.

**ద్రవ్యలక్షణాలు :** లక్షణము అంటే ఒక వస్తువును ఇతర వస్తువులనుంచి వేరు చేసి గుర్తించటానికి వీలయ్యేది. ద్రవ్యానికి మూడు లక్షణాలున్నాయి.

**క్రియాగుణవత్ సమవాయికారణమితి ద్రవ్యలక్షణమ్**

క్రియావత్వము, గుణవత్వము, సమవాయి కారణత్వము అనే మూడు ద్రవ్య లక్షణాలు. అనగా క్రియను, గుణాన్ని, సమవాయిత్వాన్ని – ఈ మూడింటినీ ద్రవ్యము తనలో ఇముడ్చుకుని ఉన్నది అని అర్థం. ద్రవ్యగుణ కర్మలు వేరువేరుగా ఉండటమే కాకుండా అన్యోన్యాశ్రయాలై సామాన్య విశేష సంబంధం కలిగి ఉన్నాయి. ద్రవ్యరహితమైన గుణకర్మలు ఈ లోకంలో లేవు. అలాగే గుణసంబంధం లేని ద్రవ్యాన్ని మనం ఊహించను కూడా లేము. ఐతే బౌద్ధులు "మనం చూసేది గుణాలనే కాని ద్రవ్యాన్ని మాత్రం కాదు. కాబట్టి ద్రవ్యమనేది లేనే లేదు" అన్నారు. కాని వైశేషికులు మాత్రం గుణాలు, ద్రవ్యాలు వేరు వేరని చెప్పారు. ఒకవేళ ఇవి నిజంగానే వేరైతే మనకంటికి ఎందుకు కనపడవనేదే ప్రశ్న. ఆ రెండింటికీ సమవాయి సంబంధమున్నది. అందుచేతనే అవి విడివిడిగా అగుపడవని వేశేషికుల సమాధానం.

ఇంకొక రకంగా చూసినట్లైతే ద్రవ్యాలు రెండు రకాలు

1. సావయవములు 2. నిరవయవములు

**1. సావయవములు :** అవయవములు గలవి. ఇవి అస్వతంత్ర్యము, అనిత్యము, అశాశ్వతమైనవి.

**2. నిరవయములు :** అవయవములు లేనివి. ఇవి నిత్యము, సత్యము, శాశ్వతమైనవి.

**పృథివ్యాపస్తేజోవాయ్వాకాశకాలదిగాత్మ మనసాంసి నవైవ** అంటోంది ఈ దర్శనం. ద్రవ్యం 9 విధాలు అవి : 1. పృథివి (భూమి) 2. అప్పు (నీరు) 3. తేజస్సు (అగ్ని) 4. వాయు (గాలి) 5. ఆకాశము (శూన్యము) 6. కాలము 7. దిక్కు 8. ఆత్మ 9. మనస్సు.

వీటిలో మొదటి మూడు అనిత్యములు. మిగిలినవి నిత్యములు. వాయువు, ఆకాశము, కాలము, దిక్కు అనే నాలుగు ద్రవ్యాలు మహాప్రళయం వరకు ఉంటాయి. మనస్సు అనేది మోక్షం పొందే దాకా ఉంటుంది. కాబట్టి ఇవి వ్యావహారిక నిత్యత్వము గలవి. పృథివి మొదలైన వాటికి అంటే మొదటి మూడింటికీ మూలకారణమైన పరమాణువులు, ఆత్మలు. పరమార్థ నిత్యములు. ఈశ్వరుడు కూడా ఈ పరమార్థ నిత్యత్వము గలవాడే.

ఆత్మ, ఆకాశము, దిక్కులు, కాలము ఇవి విభువులు. **సర్వవస్తు బహిరంతర్వర్త మానత్వం విభుత్వం** అన్ని వస్తువుల లోపల, వెలుపల ఉండటమే విభుత్వము. మూర్తద్రవ్యములన్నింటితోనూ సంబంధించి ఉండటమే విభుత్వము.

ద్రవ్యములు 1. మూర్తములు 2. అమూర్తములు అని రెండూ విధాలు. వీటిలో క్రియాగుణం కల ద్రవ్యాలు మూర్తులు. అవి భూమి, జలము, అగ్ని, వాయువు క్రియాగుణం లేని ద్రవ్యాలు అమూర్తములు అంటే మిగిలిన ఐదు ద్రవ్యాలు అమూర్తాలు.

భౌతిక ద్రవ్యాలు వస్తువులకు ఉపాదాన కారణము. అణుపరిమాణం గల మనస్సు నుంచి ఏదీ ఉత్పన్నం కాదు. సర్వవ్యాపకమయిన ఆకాశం నుంచి శబ్దం వస్తోంది.

ఆత్మను గురించిన జ్ఞానానికి ఆధారము ఆగమము. చైతన్యము అనేది శరీరము, ఇంద్రియాలు, లేక మనస్సు యొక్క ధర్మం కాదు. ఇది ఆత్మయొక్క గుణము.

సుఖదుఃఖాలు, రాగద్వేషాలు, ప్రవృత్తి, జ్ఞానము, మనస్సు ఇంద్రియ వ్యాపారము మొదలైన వాటివల్ల ఆత్మ ఉన్నదని నిర్ధారణ అవుతుంది. ఆత్మకు శరీరంతో సంబంధం లేదు. అందుకే దానికి విషయాలు తెలియవు. మనస్సు ద్వారానే ఆత్మయొక్క గుణాలను తెలుసుకోగలుగుతున్నాము. వ్యవస్థల వలన, శ్రుతుల వలన ఆత్మలు అనేకములు అని గ్రహించగలుగుతున్నాము. ఈ ఆత్మ కర్మఫలితాన్ని అనుభవించినది. జీవితాంతము ఒకే ఆత్మ అనుస్యూతముగా ఉండునది. ముక్తులైన ఆత్మల మధ్యన కూడా భేదమున్నది. ఆత్మ వేరు, ఈశ్వరుడు వేరు. కాని వారి మధ్య సాదృశ్యమున్నది అంటోంది వైశేషికము.

**2. గుణము :** సంయోగ వియోగాలు, కారణత్వము లేనిది గుణము. ద్రవ్యాన్ని ఆశ్రయించి ఉన్న గుణానికి వేరే గుణాలు లేవు.

**ద్రవ్యాశ్రయగుణవాన్ సంయోగవిభాగేష్వ కారణమనపేక్ష ఇతి గుణలక్షణమ్।**

గుణము యొక్క లక్షణాలను కణాదుడు ఈ విధంగా వివరించాడు. గుణము ద్రవ్యమును విడిచి స్వతంత్రముగా ఉండదు. అది ద్రవ్యం ఆధారముగా కలది. గుణానికి గుణాలు లేనిది. సంయోగ వియోగాలు కలిగించటంలో స్వతంత్రము కానిది. ఇది ఇరవై నాలుగు విధాలు.

**రూపరసగంధ స్పర్శ సంఖ్యా పరిమాణ పృథక్త్వ సంయోగ విభాగపరత్వా పరత్వ గురుత్వ ద్రవ్యత్వ స్నేహ శబ్ద బుద్ధి సుఖదుఃఖేచ్ఛా ద్వేష ప్రయత్న ధర్మాధర్మ సంస్కారాశ్చతుర్వింశతిర్గుణాః ॥**

| | | | |
|---|---|---|---|
| 1. రూపము | 7. పృథక్త్వము | 13. ద్రవ్యత్వము | 19. ఇచ్ఛ |
| 2. రసము | 8. సంయోగము | 14. స్నేహము | 20. ద్వేషము |
| 3. గంధము | 9. విభాగము | 15. శబ్దము | 21. ప్రయత్నము |
| 4. స్పర్శ | 10. పరత్వము | 16. బుద్ధి | 22. ధర్మము |
| 5. సంఖ్య | 11. అపరత్వము | 17. సుఖము | 23. అధర్మము |
| 6. పరిమాణము | 12. గురుత్వము | 18. దుఃఖము | 24. సంస్కారము |

**3. కర్మ:** కార్యవిరోధికర్మ విభాగం పుట్టించిన తరువాత ఉత్తర సంయోగము కలిగించి నశించేది. కాబట్టి కార్య విరోధి కర్మ అని చెప్పబడింది. కర్మ అంటే చేష్ట. ప్రవృత్తి. ఇది ద్రవ్యంలో అనిత్యంగా కనిపించే లక్షణము.

**ఏకద్రవ్యగుణ సంయోగవిభాగేష్వనపేక్ష కారణమితి కర్మ లక్షణమ్**

**ఉత్క్షేపణాపక్షేపణాకుంచన ప్రసారణగమనాని పంచకర్మాణి**

ఒక్క ద్రవ్యమే ఆశ్రయముగా గలది, గుణమున కాశ్రయము కానిది, సంయోగ వియోగాలు పుట్టించుటలో ఇతర కారణాల నపేక్షింపక స్వతంత్ర కారణమైనది కర్మ.

1. ఉత్క్షేపణము - ఎగజిమ్ముట
2. అక్షేపణము - దిగద్రోయుట
3. ఆకుంచనము - ముడుచుట
4. ప్రసారము - చాటుట
5. గమనము - చలనము

ఈ రకంగా కర్మ ఐదు విధాలు అని చెబుతోంది వైశేషికము

**4. సామాన్యము :** ఈ దర్శనంలో సామాన్య విశేషాలు రెండింటినీ ఒక సూత్రంలోనే చెప్పాడు ఋషి. అనేక ద్రవ్యాలలో సమాన ధర్మముగా కనిపించేది సామాన్యము.

**సామాన్యం ద్వివిధం । పరమపరంచేతి**

ఈ సామాన్యము రెండు విధాలుగా ఉంటుంది.

1. పరము - ఎక్కువ దేశమున ఉండేది
2. అపరము - తక్కువ దేశమున ఉండేది.

**5. విశేష నిరూపణము :** ద్రవ్యాలలో విశేషంగా కనిపించేది.

**నిత్యద్రవ్యవృత్తయో విశేషాస్త్వనంతా ఏవ**

విశేషము అనేది కేవలము నిత్య ద్రవ్యములందే ఉంటుంది. పృథివి, జలము, తేజస్సు, వాయువుల యొక్క పరమాణువులు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ మనస్సు అనేవి నిత్య ద్రవ్యాలు. నిత్య ద్రవ్యాలలో విశేషము కొద్దిగా ఉంటుంది.

**6. సమవాయము :** కార్యకారణాలకు గల సంబంధాన్నే సమవాయము అంటారు. దీన్ని గురించి కణాదుడు.

**ఇహేదమితి యతః కార్యకారణయో సమవాయః**

నూలు పోగులందు వస్త్రము అనే జ్ఞానము దేనివల్ల కలుగుతున్నదో దానినే సమవాయము అన్నాడు.

విడిపోవటానికి వీలు లేనటువంటి రెండు వస్తువుల మధ్య నున్న సంబంధము సమవాయము. ఇదే కార్యకారణ సంబంధము. వస్త్రానికి కారణము దారాలు. నూలు పోగుల కార్యమే పటము. పటతంతువుల మధ్య గల సంబంధమే సమవాయము. ఈ రకమైన సంబంధం గల వస్తువులను వేరు చెయ్యటానికి వీలు లేదు. ఒక వేళ వేరు చేస్తే అసలు వస్తువే నశించిపోతుంది. నూలు పోగులు విడిగా తీసేస్తే అసలు వస్త్రము అనేది లేదు. వైశేషిక దర్శనంలో ద్రవ్యత్వ గుణత్వ కర్మత్వములనేవి ద్రవ్యగుణకర్మల కన్న వేరైనవి అని చెప్పబడింది.

ఒక వస్తువు వేరొక వస్తువుతో సంయోగము చెందినప్పుడు అది సంయోగ సంబంధము అంటారు. ఒక చెట్టు మీద ఒక పక్షి కూర్చుని ఉన్నది. అప్పుడు ఆ చెట్టుకు పక్షితో కలది సంయోగ సంబంధము. పక్షి చెట్టు మీద నుంచి ఎగిరిపోయింది. ఇప్పుడు ఆ రెండింటికీ కలది వియోగ సంబంధము. ఈ వియోగం వల్ల రూపం నాశనం కాదు. ఇది బాహ్యావియోగము. ఈ సంబంధము కేవలము బాహ్యాము అనిత్యము. అయితే సమవాయ సంబంధం అలా కాదు. ఆ సంబంధము అంతరము, నిత్యము. ఈ రెండు వస్తువులు ఇక్కడ ఐక్యత పొందుతాయి. కాబట్టి వాటిని విడదీయలేము.

**7. అభావము :** అభావము అంటే లేకపోవుట అని అర్థం. ఇది నాలుగు విధాలుగా ఉంటుంది.

**అభావశ్చతుర్విధః :** అభావము నాలుగు విధాలుగా ఉన్నది.

**1. ప్రాగభావము :** కార్యోత్పత్తికి ముందుండే అభావము. దీనికి ఆది లేదు అంతమున్నది.

**2. ప్రధ్వంసాభావము :** కార్యోత్పత్తి తరువాత ఉండేది. దీనికి ఆది ఉన్నది. అంతం లేదు.

**3. అత్యంతాభావము :** మూడు కాలములందు ఉండే అభావము.

**4. అన్యోన్యాభావము :** పరస్పర వస్తువులందుండే అభావము.

అభావము అనేది వైశిష్ట్యాన్ని ధృవపరుస్తుంది. కణాదుడి దృష్టిలో అభావానికి అర్థం లేదు. భావానికి సంబంధించినదే అభావము. అందుచేతనే అతడు దీన్ని సప్త పదార్థాలలో ఒకటిగా అంగీకరించలేదు. ఒక వస్తువుకు విశేషగుణం ఉన్నది అని చెప్పగానే వైశిష్ట్యం కుదరదు. ఇతర వస్తువులలో ఆ గుణం కనిపించకూడదు. అప్పుడే దాని విశిష్టత బయట పడుతుంది. కణాదుడు ప్రాగభావాన్ని మాత్రమే అంగీకరించాడు. ప్రాగభావము అంటే – వస్తువు పుట్టక ముందు ఉన్న స్థితి. దీనికి ఆది లేదు. అంతమున్నది. వస్తువు పుట్టగానే ప్రాగాభావము నశిస్తుంది. ప్రధ్వంసా భావానికి ఆది ఉంది. అంతం లేదు. నశించిన దానికి మళ్ళీ నాశనం ఎక్కడ నుంచి వస్తుంది? కాబట్టి ఇది ఉపయోగం లేనిది. మిగిలిన అభావాలు కూడా అంతే అంటాడు కణాదుడు. అతడి దృష్టిలో తర్కశాస్త్రానికి మాత్రమే అవి పనికి వస్తాయి. అంతేగాని అవి నిజంగా అర్థం లేనివి. వంధ్యాపుత్రుడు, కుందేటి కొమ్ము, గగన కుసుమము. ఇవి అత్యంతాభావాలు. అవి నిరుపయోగములు అంటాడు మహర్షి.

## సంయోగ-విభాగజపరీక్ష

'గుణము' గురించి వివరిస్తూ అది 24 విధాలుగా ఉన్నది అని చెప్పటం జరిగింది. అందులో 8, 9 సంయోగ వియోగాలు. వియోగాన్నే విభాగము అని కూడా చెప్పటం జరిగింది. వీటిని గురించి ప్రత్యేకంగా చెప్పింది ఈ దర్శనం. సంయోగము మూడు విధాలు అలాగే విభాగము కూడా మూడు విధాలు. ముందుగా సంయోగము **అన్యతరకర్మజః ఉభయ కర్మజః సంయోగజశ్చ సంయోగః**

1. అన్యతర కర్మజ సంయోగము 2. ఉభయకర్మజ సంయోగము 3. సంయోగజ సంయోగము

**ఏతేన విభాగో వ్యాఖ్యాతః** అదే విధంగా విభాగము కూడా విభజించబడుతుంది.

1. అన్యతరకర్మజ విభాగము 2. ఉభయకర్మజవిభాగము 3. విభాగజవిభాగము

**1. అన్యతర కర్మజ సంయోగము :** ఒక చెట్టు మీద ఒక పక్షి వాలినట్లైతే చెట్టుతో పక్షికి సంయోగము ఏర్పడుతుంది. ఇక్కడ క్రియారహితమైన దానితో క్రియాయుక్తమునకు సంయోగము కలిగింది. ఇది 'అన్యతరకర్మజసంయోగము'. ఇప్పుడు పక్షి చెట్టు మించి లేచిపోయినట్లైతే ఆ చెట్టుకు పక్షికి విభాగము ఏర్పడుతుంది. అది **'అన్యతరకర్మజవిభాగము'**

**2. ఉభయకర్మజసంయోగము :** క్రియావంతమైన వృషభాలు రెండు పోట్లాడుకుంటున్నాయి. రెండు తలలు ఒక దానితో ఒకటి కలిపి ఢీ కొట్టుకున్నాయి. ఇది 'ఉభయకర్మజ సంయోగము' అవి పోట్లాడటం మానివేశాయి. అప్పుడు ఆ రెండింటికీ విభాగమేర్పడుతుంది. అది **'ఉభయకర్మజవిభాగము'**

**3. సంయోగజసంయోగము :** హస్తానికి వృక్షంతో సంయోగం కలిగినప్పుడు శరీరంతో వృక్షానికి కలిగిన సంయోగాన్ని 'సంయోగజ సంయోగము' అంటారు. చేతిని చెట్టు నుంచి తీసిస్తే చెట్టుకు చేతికే కాక, చెట్టుకు శరీరానికి కూడా విభాగము ఏర్పడుతుంది. దీన్ని **'విభాగజవిభాగము'** అంటారు.

## పిఠరపాక, పీలుపాక సిద్ధాంతాలు

పిఠరము అంటే - వంట కుండ.

పీలు అంటే - అణువు అని అర్థము.

**రూపాది పరావృత్తి హేతుతేజః సంయోగః పాకః**

రూపాది గుణాలు మార్పు చెందటానికి కారణమైన అగ్ని సంయోగాన్ని పాకము అంటారు.

అగ్ని సంయోగం వల్ల వస్తువులలో గుణాలు మారిపోతాయి. ఈ మారే క్రమంలో న్యాయవైశేషిక దర్శనాలకు తేడా ఉన్నది. పాకము అవయవి (అవయవాలు గలిగినది)లో కలుగుతుంది అంటుంది న్యాయదర్శనము. వీరి సిద్ధాంతాన్ని 'పిఠరపాకసిద్ధాంతము' అంటారు. న్యాయదర్శనం ప్రకారము మట్టితో చేయబడిన కుండ ఆవములో పెట్టి కాల్చినప్పుడు ఆ పాత్రకు మొదట ఉన్న గుణములు నశించి

క్రొత్తగుణాలు ఏర్పడతాయి. ఇలా జరగటానికి కారణము పాకము. కాల్చటానికి ముందు మట్టి పాత్రయందున్న పరమాణువుల మధ్య సన్నటి బెజ్జాలుంటాయి. ఆ బెజ్జాలలో అగ్ని ప్రవేశించి రంగు మొదలైన గుణాలను నశింపచేసి, వాటి స్థానంలో క్రొత్త రంగు క్రొత్త గుణాలు కలిగిస్తుంది. ఆ విధంగా లోపల బయట గట్టిపడి పక్వమై అణువులు నశింపక దట్టమై బెజ్జాలు లేనిదవుతుంది. ఈ విధంగా కుండకు అగ్నిసంపర్కంవల్ల ఘటమునందు, ఘటాణువులందు ఒకేసారి రంగు మొదలైన మార్పు జరుగుతుంది. అందుచేత కాల్చటానికి ముందు చూసినకుండే ఇది అనే విషయం స్పష్టమవుతుంది. దీనిని పిఠరపాక క్రియ అంటారు.

వైశేషికుల దృష్టిలో ఇది వేరు.

**అప్సుతేజసివాయౌచ నిత్యాః ద్రవ్యనిత్యత్వాత్**

జలము అగ్ని వాయుభూత ద్రవ్యాలు నిత్యమవటం వల్ల వాటి గుణాలు నిత్యాలే.

**అనిత్యేషనిత్యాః ద్రవ్యానిత్యత్వాత్**

ఆశ్రయద్రవ్యము అనిత్యమైతే, అందులోని గుణాలు కూడా అనిత్యాలే.

**కారణగుణపూర్వకాః పృథివ్యాం పాకజాః**

అవయవమైన భూమియందు పాకము వలన కలిగిన రూపాది గుణములు, అవయవి కారణములగు అవయవముల యొక్క గుణములు కారణమగుచున్నవి.

కుండను ఆవంలో పెట్టి కాల్చిన తరువాత నల్లగా ఉన్న పచ్చికుండ ఎఱ్ఱబడుతుంది. ఈ మార్పు సాక్షాత్తు కుండలో జరగదు. పచ్చికుండ ఏ అణువులతో చెయ్యబడిందో, ఆ అణుసముదాయమంతా పాకము వల్ల కుండనుంచి ఎగిరిపోయి, దాని రంగు మొ॥ గుణాలు మారిపోయి, క్రొత్త అణుసముదాయము ఏర్పడి వాటివల్ల కొత్త కుండ ఏర్పడుతోంది. అంటే ఇంతకుముందు ఆవంలో మనం చూసిన కుండ ఇది కాదన్న మాట. పరమాణువులలో 'ద్వణకము' (రెండు అణువులు) వరకు నశిస్తాయి. పరమాణువుకు నాశనం లేదు. దీనివల్ల పరమాణువులకున్న నల్లరంగు పోయి యెఱ్ఱరంగు ఏర్పడుతున్నది. ఈ రకంగా అవయవిలో పాకము ఏర్పడక, అవయవాలలో పాకము ఏర్పడుటచే వీరిది 'పీలుపాక సిద్ధాంతము' అంటారు. ఇక్కడ పీలు అంటే అణువు అని అర్థం.

**ఆత్మ:** న్యాయదర్శనంలో చెప్పిన ఆత్మకు, వైశేషికులు చెప్పిన ఆత్మకు పెద్దగా భేదం లేదు. వైశేషికులు ఆత్మ రెండు విధాలుగా ఉంటుంది అన్నారు.

**1. మనోవిశిష్టమైన ఆత్మ:** మనసుతో సంబంధమున్న ఆత్మ.

**2. కేవలాత్మ:** మనసుతో సంబంధం లేని ఆత్మ.

ఆత్మ లోపల బయట అంతా వ్యాపించి ఉంటుంది. దేహంలో ఉన్న ఆత్మను ప్రత్యగాత్మ అంటారు. ఆత్మ ప్రత్యక్షము కాదు. మానవశరీరాలను గుర్తించినట్లుగా శరీరంలోని ఆత్మను గుర్తించే ప్రత్యక్ష ప్రమాణము ఏదీ లేదు. మరి అలాంటప్పుడు ఆత్మ ఉన్నదనటానికి ప్రమాణం ఏమిటి?

**తస్మాదాగమికః** అంటోంది వైశేషికం. వేదముల యందు, ఉపనిషత్తులయందు ఆత్మశబ్దం ప్రయోగించబడింది. వాటిలో కొంత చర్చ జరిగిన తరువాత ఆత్మ ఉన్నది అని నిర్ధారించారు. మన అనుభవం వలన, చూసిన ఇంద్రియాల వలన, ఈ అనుభవ జ్ఞానానికి ఆశ్రయమేదో అదే ఆత్మ. అని తెలుస్తోంది. అంతేకాక

**అహమితిశబ్దశ్య వ్యతిరేకాన్నాగమికమ్**

అహం అంటే నేను అనే శబ్దము పంచభూతాలకన్న వేరైనది. ఇది ఆత్మను ఉద్దేశించి చెప్పినదే. అయితే

**ఆత్మాన్యాత్మ మనసోః సంయోగ విశేషాదాత్మ ప్రత్యక్షమ్**

ఆత్మయందు, ఆత్మ మనస్సులకు యోగము వలన సిద్ధించిన సంయోగ వియోగ విశేషము వలన ఆత్మసాక్షాత్కారమవుతుంది. అంటే యోగులకు ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. యోగులు కాని వారికి కలగదు. అటువంటి వారు వేద ప్రమాణంవల్ల ఆత్మను తెలుసుకోవచ్చు.

ఆత్మ పారమార్థ నిత్యమైనది. ఆత్మలు అనేకాలు. వాటికి ప్రళయకాల మందు నాశనం లేదు. ఆత్మలు విభువులు అంటే లోపల బయటాకూడా వ్యాపించి ఉంటాయి. వేదాంతులు ఆత్మ–జ్ఞాన స్వరూపము అంటారు. వైశేషికులు జ్ఞానము ఆత్మగుణము అంటారు వీరి దృష్టిలో ఆత్మలు జడములు. ఇవి వస్తూ పోతూ ఉండే ఆగంతుక జ్ఞానం కలవి. ఒక జీవాత్మకు, ఇంకొక జీవాత్మకు మధ్య భేదమున్నది. ఇచ్ఛా, ద్వేషము, సుఖము, దుఃఖము మొదలగునవి ఆత్మగుణములు. అంటోంది వైశేషికము.

**మనస్సు :** మనసు గురించి న్యాయవైశేషికాలకు తేడా లేదు. మనసు ఆత్మనంటి ఉంటుంది. ఇది పరమాణురూపమైన జడము. దేనిని పుట్టించదు. ఒక్కొక్క జీవాత్మకు ఒక్కొక్క మనస్సుతో సంబంధముంటుంది. జీవి ఇంకొక జన్మ ఎత్తినా, మనస్సు జీవుని వెన్నంటే ఉంటుంది. ఈ రకంగా మనస్సే, జన్మ పరంపరలు పొందుతుంది. ముక్తి పొందినప్పుడు మనస్సు నశిస్తుంది. అంతవరకు అది నిత్యమైనదే.

**బుద్ధి, అదృష్టము :** వీటిని గురించి కూడా న్యాయదర్శనంలో చెప్పిన విషయాలే ఇక్కడా చెప్పారు. ఆత్మకు మనస్సుతోను, మనస్సుకు ఇంద్రియాలతోను, ఇంద్రియాలకు గంధాది ఇంద్రియ పదార్థాలతోను సంబంధం కలిగినప్పుడు పదార్థ జ్ఞానం కలుగుతుంది. ఈ జ్ఞానము ఆత్మస్వరూపం కన్న భిన్నమైనది. అదే బుద్ధి. బుద్ధి జ్ఞానము ఉపలబ్ధి అనేవి పర్యాయపదాలు.

అదృష్టము సృష్టి విధానము ఒక పద్ధతిలో కొనసాగటానికి ఉపకరిస్తుంది. జీవుల పూర్వజన్మ కర్మలననుభవింపచేస్తుంది. అది జీవుల శుభాశుభ కర్మలవలన కలిగిన సంస్కార రూపమున ఆత్మయందుదయించి ఆత్మయందే ఉంటుంది. జీవుల విశ్రాంతి కొరకు పరమాణువులుగా విడిపోయేటట్లు చేస్తుంది. అదే ప్రళయము. అప్పుడు అణువులకు చలనముండదు. సృష్టి ఆరంభంలో అణువులు ఒక దానితో ఒకటి కలిసేటట్లు చేస్తుంది అదృష్టము. ఈ దర్శనంలోని అనేక లోపాలను సవరించటానికి 'అదృష్టము' అనే పదం వాడబడింది. కష్టమైన ప్రశ్నలకు సమాధానం తోచనప్పుడు ఈ అదృష్టం ఆధారంగా పరిష్కారం చెబుతారు. ఐస్కాంతం దగ్గరకు సూది ఎందుకు పోతుంది? అంటే - అదృష్టము అంటారు. ఊడుగుచెట్టు నుంచి రాలిపడిన విత్తనాలు ఉరుము ఉరిమినప్పుడు ఎగిరి ఆ చెట్టుకు ఎందుకు అంటుకుంటాయి? అంటే అదృష్టము అంటారు. ఈశ్వరుడు ఈ సృష్టికూడా అదృష్టం ద్వారానే చేస్తాడు అంటారు.

**పరమాణువులు :** వైశేషికులు పరమాణువాదులు. జగత్తుకు పరమాణువులే ఉపాదాన కారణము. ఇవి నిరవయవములు. నిత్యములు. శాశ్వతములు. ప్రళయ కాలంలో కూడా ఇవి నశించవు. ఇవి పారిమాండల్య ప్రమాణము గలవి అంటారు. అంటే పొడవుగాని వెడల్పుగాని లేక కొంచెము ప్రదేశము మాత్రము ఆక్రమించి ఉండేవి. అతిసూక్ష్మములు. ఈ పరమాణువులు నాలుగు విధాలు. స్పర్శ రూపరస గంధాలు గలవి. అంటే 1. పృథివికి సంబంధించినవి 2. జలానికి సంబంధించినవి. 3. తేజస్సుకు సంబంధించినవి 4. వాయువుకు సంబంధించినవి

ఈ పరమాణువుల నుంచే భూతాలు ఏర్పడుతున్నాయి. ముందుగా

1. స్పర్శ గుణము గల పరమాణువులచే – వాయుభూతము ఏర్పడింది.
2. స్పర్శ రూప గుణములు గల పరమాణువులచే – అగ్నిభూతము ఏర్పడింది
3. స్పర్శ రూప రస గుణములుగల పరమాణువులచే – జలభూతమేర్పడింది
4. స్పర్శ రూప రస గంధ గుణములు గల పరమాణువుల సంయోగము వలన – భూమి ఏర్పడింది.

పంచభూతాలలో ఐదవదయిన ఆకాశానికి పరమాణువులు లేవు. అది నిత్యమైనది. పైన చెప్పిన నాలుగు రకాల పరమాణువులచేతనే స్పర్శరూపరస గంధాలు ఏర్పడ్డాయి. ఆకాశం నుంచి శబ్దం ఉత్పన్నమైంది. ఈ రకంగా తన్మాత్రలు వచ్చాయి.

అణువులు ఉత్పత్తి పదార్థాలు. నిత్యమైనవి. వీటివల్లనే ఘటపటాదులు ఉద్భవిస్తున్నాయి. ఈ అణువులకు ఉత్పత్తి, వినాశనం లేదు. రెండు పరమాణువులు కలిస్తే ద్వ్యణువు వస్తుంది. రెండు ద్వ్యణువులు కలిస్తే త్రసరేణువు అవుతుంది. ఈ రకంగా స్థూలపదార్థాలు ఏర్పడుతున్నాయి. ఈశ్వరుడికి సంహారం చెయ్యాలనే కోరిక కలుగగానే శరీరములు భూతములు అన్నీ నశించిపోతాయి. అప్పుడు మిగిలేది నాలుగు విధాలయిన పరమాణువులు మాత్రమే. ప్రళయం తరువాత పురుషుడి అదృష్టాన్ని (కర్మఫలము) అనుభవింపచెయ్యాలనే కోరికతో ఈశ్వరుడు సృష్టి చెయ్యాలని సంకల్పిస్తాడు. అప్పుడు ముందుగా వాయు పరమాణువులలో స్పందన కలిగి అదృష్టవశమున వాయువు ఉత్పన్నమవుతుంది. ఈ రకంగా భూతసృష్టి జరుగుతుంది. తరువాత ఈశ్వరుని సంకల్పంతో బ్రహ్మాండము సృష్టించబడుతుంది. అప్పుడు బ్రహ్మ ఆవిర్భవించి సృష్టిని పూర్తి చేస్తాడు అంటాడు కణాదుడు.

**అసత్కార్యవాదము :** న్యాయవైశేషికాలలో ముఖ్యంగా కనిపించేది అసత్కార్యవాదము. అసత్కార్యవాదము అంటే ప్రతి కార్య పదార్థము తన ఉత్పత్తికి ముందు అసత్ 'ఉనికిలేనిదై' ఉన్నది. కార్యము ఏర్పడటానికి ముందు దాని ఉనికి అభావము. కాబట్టి దాన్ని 'ప్రాగభావము' అంటారు. కార్యోత్పత్తి జరగగానే ప్రాగభావం నశిస్తుంది. దీన్నే ఆరంభవాదము అంటారు. కార్యము ఒకప్పుడు పుట్టి ఇంకొకప్పుడు నశిస్తుంది. కాబట్టి దీనికి ఆద్యంతాలు ఉన్నాయి. మట్టి నుండి కుండ, తంతువుల నుండి వస్త్రము తయారవుతున్నాయి. వాటి ఉత్పత్తికి ముందు ఘటపటాలు,

మృత్తికయందు, తంతువుల యందు లేవు. కారణ వ్యాపారం వల్ల అవి కొత్తగా కలిగినాయి. అందుకే వీరు **"కార్యము దాని ఉత్పత్తికి పూర్వము అసత్తు"** అంటారు.

ఈ దర్శనంలో ధర్మసూత్రాన్ని వివరిస్తూ అభ్యుదయము నిఃశ్రేయస్సు కలిగించేదే ధర్మము అంటారు.

అయితే అభ్యుదయము అంటే - ఇహపర సౌఖ్యాలు, నిఃశ్రేయస్సు అంటే - మోక్షము. అభ్యుదయము అంటే కేవలము తత్త్వజ్ఞానము అంటాడు ఉదయనాచార్యుడు. మోక్షసాధనకు ధర్మానుష్ఠానము అవసరము. ధర్మానుష్ఠానానికి ఫలము - తత్త్వజ్ఞానము. తత్త్వజ్ఞానానికి ఫలితము - మోక్షము. సన్యాసము, యోగాభ్యాసము, సమాధి అనేవి సాధనాంగాలు.

**వేదాలు - ఈశ్వరప్రసక్తి:** వైశేషికుల మతానుసారము వేదాలు మంత్రద్రష్టలయిన ఋషులచేత రచింపబడినవి. **బుద్ధిపూర్వా వాక్కృతిర్వేదే**

వేదాలలో ఉన్న వాక్యాలు కూడా రచించినవే కాబట్టి మహామేధావులయిన మహర్షులచే బుద్ధి పూర్వకముగా వేదాలు రచింపబడినాయి.

**బుద్ధి పూర్వోవదధాతి** వేదముల యొక్క జ్ఞానము బుద్ధి పూర్వకము.

వైశేషిక దర్శనంలో కణాదుడు ఈశ్వరుడు ఉన్నాడు అని ఎక్కడా చెప్పలేదు. అసలు ఈశ్వరప్రసక్తి కూడా చెయ్యలేదు. ఆ తరువాత వచ్చిన ప్రశస్తపాదుడు ఇందులో ఈశ్వర అస్థిత్వాన్ని చేర్చాడు. కాబట్టి కణాదుని దృష్టిలో వేదాలు అపౌరుషేయాలు కావు. తరువాత కాలంలో **తద్వచనాత్ ఆమ్నాయస్య ప్రమాణ్యమ్** అనే సూత్రాన్ని రెండుసార్లు వాడారు. అంటే వీటన్నింటికీ వేదమే ప్రామాణ్యము అని అర్థం. కాని దీనికి మహాజ్ఞానులైన మహర్షులు వ్రాసిన వేదములే ప్రామాణ్యము అని అర్థం చెప్పగా కొంత మంది జగత్తు కారణమైతే, కర్త ఒకడుండాలి. అతడే ఈశ్వరుడు అతడే వేదాలు చెప్పాడు. కాబట్టి అవి ఈశ్వరప్రోక్తాలు అని వ్యాఖ్యానించారు. ఈ దర్శనంలో ఆత్మవేరు ఈశ్వరుడు వేరు. కాని వారి మధ్య సాదృశ్యమున్నది అన్నారు.

**మోక్షము :** ఈ దర్శనంలో మోక్షము అనే పదం వాడబడింది. నాలుగు ఆశ్రమాలు వాటి ధర్మాలు చెప్పబడ్డాయి. యజ్ఞము దానము మంత్రము మొదలైన వాటి ద్వారా ఫలితము వస్తుంది. అదే అదృష్టము. కాబట్టి ధర్మానుష్టానం చేసినట్లైతే తత్త్వజ్ఞానం కలుగుతుంది. తత్త్వజ్ఞానం వల్ల మోక్షం సిద్ధిస్తుంది. ముక్తి పొందినప్పుడు

మనస్సు నశిస్తుంది. అంతవరకు అది నిత్యమైనదే. సంసారము దుఃఖమయము ఆ దుఃఖాన్ని పూర్తిగా నిర్వర్తింపచేయటమే మోక్షము. దీనికి సాధనము తత్త్వజ్ఞానము. ఆ జ్ఞానము పైన చెప్పిన ఏడు పదార్థాలకు చెందినది. అంటే ఆ సప్తపదార్థాల తత్త్వజ్ఞానం వల్లనే ముక్తి లభిస్తుంది. అంటోంది ఈ దర్శనం.

"వైశేషిక దర్శనంలో ఈశ్వరప్రసక్తి లేదు. కాబట్టి ముందుగా దాన్ని నాస్తిక దర్శనం అనవచ్చు. కాని తరువాత కాలంలో ఈశ్వరుణ్ణి అందులో చేర్చారు. ఇక ఇందులో ముఖ్య విషయం ఏమిటంటే

1. సృష్టి పరమాణువుల సాయంతో చెయ్యబడింది.

2. పరమాణువులు భూతరూపం దాల్చటానికి వాటి అదృష్టమే కారణం.

3. జగత్తులో గల భావపదార్థాలు ఏడు. వీటినే సప్త పదార్థాలు అంటారు.

4. సంసారం దుఃఖహేతువు. తత్త్వజ్ఞానం ద్వారా దానిని అధిగమించవచ్చు.

5. ఎవరి ఆత్మవారిది. జగత్తులో అనేక ఆత్మలున్నాయి.

6. ఆత్మ వేరు ఈశ్వరుడు వేరు. కాని వారికి సాదృశ్యమున్నది.

7. మనస్సు ముక్తి పొందేదాకా ఉంటుంది. అంటే అంతవరకు నిత్యమైనదే. ముక్తి పొందినప్పుడే మనస్సు నశిస్తుంది.

8. ఆత్మ మనస్సులకు సంయోగం కలిగినప్పుడు ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. యోగులకు కూడా ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. వారు వేదప్రమాణం వల్ల ఆత్మను తెలుసుకుంటారు.

9. వేదాలు బ్రహ్మముఖం నుంచి రాలేదు. మహాజ్ఞానులైన ఋషులు వాటిని రచించారు.

10. ఆత్మకు నాశనం లేదు. ప్రళయకాలంలో కూడా అది అలాగే ఉంటుంది.

11. మనసు ఆత్మను అంటుకుని ఉంటుంది. మనసు పరమాణు రూపమైన జడపదార్థము అది దేనినీ పుట్టించదు.

12. జీవి ఇంకొక జన్మ ఎత్తినా మనస్సు ఆత్మను వెన్నంటే ఉంటుంది. ఈ రకంగా జన్మపరంపరలు పొందేది మనస్సే.

13. సృష్టి అంతా ఒక పద్ధతిలో సాగటానికి అదృష్టం ఉపకరిస్తుంది.

14. సప్త పదార్థాల తత్త్వజ్ఞానం ద్వారానే మోక్షం సిద్ధిస్తుంది.

# 6. న్యాయదర్శనము

న్యాయదర్శనాన్ని వ్రాసినవాడు 'అక్షపాదుడు' అనే మహర్షి. ఇతడికే 'గౌతముడు' అని కూడా పేరు. ఇతడు మిథిలానగర నివాసి. ఈయన క్రీస్తు పూర్వము నాల్గవ శతాబ్దానికి చెందినవాడు. ఆ తరువాత న్యాయసూత్రాలకు క్రీ.పూ. రెండవ శతాబ్దంలో వాత్యాయనుడు అనే ఋషి భాష్యము వ్రాశాడు. భాష్యము అంటే వ్యాఖ్యాన విశేషము, వివరణము అని అర్థం.

**సూత్రార్థోవర్ణ్యతే యత్రపదై సూత్రానుసారిభిః**

**స్వపదానిచ వర్ణ్యంతే భాష్యం భాష్యవిదోవిదుః ॥**

ఆ తరువాత క్రీ.శ. ఆరవ శతాబ్దంలో 'ఉద్యోతకరుడు' అనే ఋషి న్యాయదర్శనానికి వార్తికము వ్రాశాడు. వార్తికము అంటే వార్తకు సంబంధించినది, వృత్తాంత సంబంధమైనది అని అర్థం.

**ఉక్తానుక్త దురుక్తార్థ వ్యక్తికారి**

సూత్రాలలో చెప్పిన అర్థాన్ని వివరిస్తూ, సరి అయిన అర్థాన్ని చెబుతూ, దురుక్తము అంటే భిన్నంగా ఉండే అర్థాన్ని సరిచేసి చెప్పేటటువంటి సూత్రప్రాయమైన గ్రంథము. ఆ తరువాత క్రీ.శ. తొమ్మిదవ శతాబ్దంలో వాచస్పతిమిశ్రుడు అనే ఋషి న్యాయవార్తిక టీకను వ్రాశాడు. ఆ తరువాత జయంతభట్టు, భాస్వరజ్ఞుడు, ఉదయనాచార్యులు మొదలైన వారు న్యాయసూత్రాల మీద అనేక గ్రంథాలు వ్రాశారు. వాటిలో ఉదయనాచార్యుడు వ్రాసిన **"న్యాయకుసుమాంజలి"** చాలా ప్రసిద్ధమైన గ్రంథము.

న్యాయము అంటే అనుసరింపతగిన పద్ధతి, ఆచారము, ధర్మము అని అర్థం. ఒక విషయంలోకి ప్రవేశించి దాన్ని పూర్తిగా పరిశీలించటము. ఒక నిర్ణయము చెయ్యటానికి ఏది తోడ్పడుతుందో అదే న్యాయము. దీనికే తర్కము, వాదము, ప్రమాణము అని కూడా పేర్లున్నాయి. గౌతముడు వ్రాసిన న్యాయదర్శనము వేదార్థ నిర్ణయసాధనమైన అధికరణము.

**ప్రమాణము :** ఈ దర్శనంలో ప్రధానంగా మూడు సిద్ధాంతాలున్నాయి. ఇక్కడ ఆత్మ, అనాత్మ అని రెండు భావాలున్నాయి. ఆత్మకన్న భిన్నమైనది అనాత్మ. ఇదే

బాహ్యంగా కనిపించే జగత్తు. శరీరము, బుద్ధి, ఇంద్రియాలు, మనస్సు అన్నీ బాహ్య జగత్తులోని భాగాలే. ఆత్మ, అనాత్మల మధ్య గల కార్యకారణ సంబంధ వశమున బయలుదేరినదే చైతన్యము. జ్ఞానమనేది ఆత్మయొక్క గుణము.

న్యాయదర్శనంలో మొత్తం 538 సూత్రాలున్నాయి. ఈ సూత్రాలు 5 ఆహ్నికాలుగా విభజించబడ్డాయి. ఆహ్నికము అంటే మహాభాష్య ప్రకరణము అని అర్థం.

ఈ ప్రపంచమంతా దుఃఖమయము. ఇందులో ఏ కొద్దిగానో సుఖం కనిపించినప్పటికీ, అందులో కూడా దుఃఖమే ఉంటుంది. ఈ దుఃఖము పూర్తిగా పోవాలి అంటే పునర్జన్మ లేకుండా ఉండాలి. అసలు జన్మకు కారణము ఏమిటి ? కర్మాచరణ. కర్మలను ఆచరించినట్లైతే పాపపుణ్యాలు కలుగుతాయి. వాటివల్ల స్వర్గసుఖాలు లభిస్తాయి. మానవుడు తాను చేసిన కర్మల తాలూకు ఫలితాన్ని స్వర్గంలో అనుభవించి, శేషఫలితం అనుభవించటం కోసం మళ్ళీ భూలోకంలో జన్మిస్తాడు. అసలు కర్మలు ఎందుకు చేస్తాడు? రాగద్వేషాల వల్ల. మానవుడికి అనంతమైన కోరికలుంటాయి. కొన్నింటి మీద అనురక్తి, కొన్నింటి మీద విరక్తి ఉంటుంది. ఆ కారణం చేత ఇష్టమైనవి కావాలనుకుంటాడు. ఇష్టం లేనివి అవసరం లేదు అనుకుంటాడు. వాటిని వదిలించుకోవటానికి ప్రయత్నిస్తాడు. ఈ రకంగా రాగద్వేషాల వల్ల తన కోరికలు తీర్చుకోవటానికి ప్రయత్నిస్తాడు. ఆ ప్రయత్నంలో చేసే భాగమే కర్మ. అసలు రాగద్వేషాలు ఎందుకు పుడతాయి? మిథ్యాజ్ఞానం వల్ల. అంటే మానవుడు తనకున్న మిడిమిడి జ్ఞానంతో, తనచుట్టూ ఉన్నదంతా యదార్థమని, నిత్యము, సత్యము అని అనుకుంటాడు. తల్లి, తండ్రి, భార్య, సంతానము, భోగభాగ్యాలు, సిరిసంపదలు ఇవన్నీ నిజం కావు. శాశ్వతం అంతకన్నా కావు. మానవుడి శరీరమే శాశ్వతం కాదు. అలాంటప్పుడు ఇవన్నీ శాశ్వతం ఎలా అవుతాయి? కాని మానవుడు అజ్ఞానం చేత ఇవన్నీ నిజం అనుకుని వాటిని పొందటానికి ప్రయత్నిస్తున్నాడు. వాటిని పొందే బాటలో కష్టాలు అనుభవిస్తాడు. ఒకవేళ ఆ కోరికలు తీరి వాటిని పొందగలిగినా దుఃఖము మాత్రము తప్పదు. అందుచేత దుఃఖాన్ని వదిలించుకోవాలి.

**దుఃఖజన్మ ప్రవృత్తి దోషమిథ్యాజ్ఞానానాముత్త**
**రోత్తరా పాయేతదనంతరాపాయయా దపవర్గః**

దుఃఖ నివృత్తియే మోక్షము. మరి దుఃఖాన్ని వదిలించుకోవటమెలా ? తత్త్వజ్ఞానమున్న వాడిని దుఃఖము పట్టి బాధించదు. తత్త్వము అంటే యథార్థము, సత్యము, యథావస్థితాకారము, స్వభావము, సృష్టికి ప్రధానమైన ప్రకృతి మొదలగు పదార్థము అని అర్థం. మానవుడు తాను ఎక్కడ నుంచి వచ్చాడు? తాను జన్మించక ముందు ఎక్కడున్నాడు? మరణించిన తరువాత ఎక్కడికి పోతాడు? ఈ జగత్తు ఏ విధంగా ఏర్పడింది? మొదలైన బాహ్యాంభ్యంతర విషయాలను గూర్చిన యథార్థ జ్ఞానమే తత్త్వజ్ఞానమనబడుతుంది.

బాహ్యంగా ఉన్న వస్తువును విషయము, అర్థము, పదార్థము. ప్రమేయము అంటారు. దానిని గురించి తెలుసుకునే సాధనమే ప్రమాణము. మనకు కలిగే జ్ఞానాన్ని ప్రమ అంటారు. ప్రమ అంటే యథార్థ జ్ఞానము, కొలత అని అర్థం. ప్రమాణము అంటే కొలత, మానము, ఒకదాని గుణదోషాలు నిశ్చయించటానికి నమ్మదగిన ఆధారము.

ప్రవృత్తి అంటే ఇంద్రియాలు విషయాల యందు సంచరించటం. ఐహిక కర్మలయందు వర్తించటం. ఇది కావాలి ఇది వద్దు అని మనం చేసే ప్రయత్నము. ఆ కర్మవల్ల మనకు లభించే ఫలితము లేదా ప్రయోజనముతో దీనికి సంబంధమున్నది. మానవ ప్రవృత్తికి సుఖదుఃఖ కారకాలయిన విషయాలు హేతువులు. ఒక వస్తువును గురించి ఉన్నది ఉన్నట్లుగాను, లేనిది లేనట్లుగాను తెలుసుకోవటమే తత్త్వజ్ఞానము. ఈ జ్ఞానము కొన్ని పదార్థాల మీద ఆధారపడి ఉంటుంది. వాటినే "ప్రమాణాది షోడశ పదార్థాలు" అని న్యాయదర్శనం ప్రతిపాదించింది. అవి

1. ప్రమాణము
2. ప్రమేయము
3. సంశయము
4. ప్రయోజనము
5. దృష్టాంతము
6. సిద్ధాంతము
7. అవయవములు
8. తర్కము
9. నిర్ణయము
10. వాదము
11. జల్పము
12. వితండము
13. హేత్వాభాసము
14. ఛలము
15. జాతులు
16. నిగ్రహస్థానము

వీటిని గురించి పూర్తిగా తెలుసుకున్న వారికి మోక్షము సిద్ధిస్తుంది.

**1. ప్రమాణము :** మానవుడు మిథ్యాజ్ఞానంతో మిడిసి పడుతుంటాడు. మిథ్యాజ్ఞానము అంటే శరీరమే ఆత్మ. కంటికి కనిపించేదంతా నిత్యమైనది. కర్మలవల్ల ఫలం వస్తుందనే మాట నిజం. మనం చూస్తున్నది,, అనుభవిస్తున్నది అంతా నిజం. ఈ మిథ్యా జ్ఞానంవల్లనే రాగద్వేషాలు పుడుతున్నాయి. వాటి వల్లనే కొన్ని కర్మలు ఆచరిస్తున్నాము. ఆ కర్మ ఫలితాలవల్ల పాపపుణ్యాలు, వాటివల్ల ఉత్తర జన్మలు కలుగుతాయి. అందుచేతనే దుఃఖాన్ని అనుభవిస్తున్నాము. ఎప్పుడైతే మిథ్యాజ్ఞానం నశిస్తుందో, అప్పుడు రాగద్వేషాలుండవు. పాపపుణ్యాలుండవు. ఉత్తరజన్మలు కూడా ఉండవు. దుఃఖము అసలు ఉండదు. దుఃఖము లేని స్థితినే మోక్షము అంటారు. మిథ్యాజ్ఞానాన్ని పోగొట్టేవే ప్రమాణాలు. అవి నాలుగు రకాలు.

1. ప్రత్యక్ష ప్రమాణము 2. అనుమాన ప్రమాణము 3. ఉపమాన ప్రమాణము 4. శబ్దప్రమాణము

**1. ప్రత్యక్ష ప్రమాణము :** ఇది ఇంద్రియాల సాయంతో కలిగే జ్ఞానము. గాలి వేడిగా ఉన్నది. మంచు చల్లగా ఉన్నది అన్నప్పుడు ఆయా పదార్థాలను తాకినప్పుడు చల్లదనము, వెచ్చదనము మొదలైన భావాలు ప్రత్యక్షంగా కలుగుతాయి.

**2. అనుమాన ప్రమాణము :** ఒకదాన్ని చూసి రెండవది ఉన్నది అని ఊహించటము. పొగ వస్తోంది కాబట్టి నిప్పు ఉండి ఉంటుంది అని ఊహించటం అనుమానప్రమాణం. అలాగే తల్లి ప్రత్యక్ష ప్రమాణం. తండ్రి అనుమానప్రమాణం.

గౌతముడు అనుమానప్రమాణాన్ని మూడు భాగాలుగా విభజించాడు. 1. పూర్వవత్ 2. శేషవత్ 3. సామాన్యతో దృష్టివత్

**1. పూర్వవత్ :** గతానుభవాన్ని బట్టి చెప్పేది. పూర్వ వస్తువును చూసి పరము ఊహించటము మేఘాలను చూసి అవి వర్షిస్తాయి అనుకోపటము.

**2. శేషవత్ :** ఇందులో కార్యాన్ని చూసి కారణాన్ని ఊహిస్తాము. పొంగిన యేరును చూసి వర్షము వచ్చి ఉండవచ్చు అని ఊహించటము.

**3. సామాన్యతోదృష్టివత్ :** ఒక వస్తువులో కొంత భాగాన్ని చూసి మిగిలిన భాగాన్ని ఊహించటం. కొమ్ములు గల జంతువును చూసి దానికి తోక కూడా ఉన్నది అని ఊహించటము.

వాత్స్యాయనుడు, ఉద్యోతకరుడు వంటి వారు అనుమానాన్ని ఇంకా వివరించారు. కాని అది మనకు అప్రస్తుతము అనుమానానికి పంచావయవము లున్నాయి. అవి అవయవములు అనేచోట వివరించబడ్డాయి.

**3. ఉపమానము :** పోలికమీద ఆధారపడినటువంటిది. సీతారాముల వలె అంటే ఆదర్శ దంపతులుగా అని అర్థం.

**4. శబ్ద ప్రమాణము :** పెద్దలు చెప్పే విషయాలను బట్టి కలిగే జ్ఞానము. ఇది రెండు రకాలుగా ఉంటుంది. 1. వేదంలో చెప్పబడింది 2. ఆప్తులు చెప్పిన విషయాలు. విషం తింటే చస్తారనేది ఆప్తవాక్యం. కావాలంటే దీన్ని ప్రత్యక్షంగా కూడా తెలుసుకోవచ్చు

ఈ ప్రమాణాల వల్లనే మనకు విషయం తెలుస్తుంది. అందువల్ల మనలో ప్రవృత్తి బయలుదేరుతుంది.

**2. ప్రమేయము :** ప్రమాణం ద్వారా మనకు తెలియబడు విషయాలను ప్రమేయాలు అంటారు. బాహ్యంగా ఉన్న వస్తువును ప్రమేయము అంటారు. దాన్ని గురించి తెలుసుకునే సాధనమే ప్రమాణము. మనం తెలుసుకోవలసిన విషయాలు (ప్రమేయాలు) మొత్తం పన్నెండు అని న్యాయదర్శనం చెబుతోంది. అవి.

1. ఆత్మ
2. శరీరము
3. ఇంద్రియాలు
4. విషయము లేక అర్థము
5. బుద్ధి
6. మనస్సు
7. ప్రవృత్తి
8. దోషము
9. ప్రేత్యాభావము
10. ఫలము
11. దుఃఖము
12. అపవర్గము

**1. ఆత్మ అంటే ఏమిటి ?**

**ఇచ్ఛాద్వేష ప్రయత్న సుఖదుఃఖ జ్ఞానాత్మనో లింగమ్** అంటోంది న్యాయదర్శనం. ఇచ్ఛ (కోరిక) ద్వేషము, ప్రయత్నము, సుఖము, దుఃఖము, జ్ఞానము అనేవి ఆత్మయొక్క గుణాలు. ఆత్మ ఉన్నది అని చెప్పటానికి ఇవే ప్రమాణాలు. ఆత్మ ఉన్నది అనటానికి హేతువు ఏది? **దర్శనస్పర్శనాభ్యా మేకార్థగ్రహణమ్**

కంటితో చూసిన దాన్ని చేతితో తాకగలుగుతాము. కాబట్టి నేత్రేంద్రియం కన్న, త్వగింద్రియం కన్న వేరైనకర్త ఒకడున్నాడు. అతడిని కంటితో చూడలేము. చేతితో తాకలేము. మనస్సుతో తెలుసుకోలేము. అతడే ఆత్మ.

**2. శరీరము :** జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు మనస్సు కలిగినటువంటిది. రక్తము, మాంసము, ఎముకలు, నరములు, మలమూత్రములతో నిండి చర్మముచే కప్పబడి ఉన్న ఈ దేహాన్నే శరీరము అంటారు. న్యాయదర్శనంలో

**చేష్టేంద్రియార్థాశ్రయః శరీరమ్**

అని చెప్పబడింది. అంటే చేష్టాదులకు ఆశ్రమమైనది. జనన మరణములు కలిగినది. పృథ్వి సంబంధమైన ద్రవ్యాణువులు ఎక్కువగాను, తదితర భూతాణువులు తక్కువగాను ఏర్పడినది.

**3. ఇంద్రియాలు :** శరీరంలో మొత్తం పదకొండు ఇంద్రియాలున్నాయి. అవి జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలు ఐదు. మనస్సు. అయితే ఈ దర్శనంలో

**ఘ్రాణ రసన చక్షుస్త్వక్ శ్రోత్రాణీంద్రియాణి**

అని చెప్పబడింది. అంటే ఆత్మ గంధాదులను వేటి ద్వారా గ్రహిస్తుందో అవే ఇంద్రియాలు. అవి కళ్ళు, ముక్కు, చెవులు, నాలుక, చర్మము, జ్ఞానేంద్రియాలు.

**4. అర్థము :** వీటినే విషయాలు అని కూడా అంటారు.

**గంధరసరూప స్పర్శశబ్దాః పృథివ్యాదిగుణాః తదర్థాః**

ఇవి పృథివి మొదలైన పంచభూతాల గుణాలు. వీటినే తన్మాత్రలు అంటారు. అవి శబ్ద స్పర్శ రూప రసగంధాలు.

**5. బుద్ధి :** న్యాయదర్శనం బుద్ధిని ఈ రకంగా చెబుతోంది.

**బుద్ధిరుపలబ్ధిర్ జ్ఞానమిత్యనర్థాంతరమ్**

బుద్ధి, ఉపలబ్ధి, జ్ఞానము అనే మూడు శబ్దాలకు ఈ దర్శనంలో అర్థం ఒక్కటే. వ్యవహారంలో కూడా బుద్ధి అంటే – తెలివి, జ్ఞానము అని అర్థం. అలాగే ఉపలబ్ధి అన్నా – తెలివి, జ్ఞానము అనే అర్థం.

బుద్ధి జ్ఞానక్రియకు కర్త కాదు. ఇది ఆత్మయొక్క గుణము. అంతేకాని శరీరము యొక్క గుణం కాదు. శరీరానికి బుద్ధి, జ్ఞానము అనేవి ఒక్కొక్కసారి ఉంటాయి. ఇంకొకసారి ఉండవు. శవం కూడా శరీరమే అయినప్పటికీ దానికి జ్ఞానముండదు. కాబట్టి బుద్ధి అనేది శరీర గుణం కాదు. జ్ఞానము మనస్సు యొక్క గుణం కూడా కాదు. జ్ఞానానికి మనస్సు ఆశ్రయం మాత్రమే ఒకవేళ జ్ఞానము మనస్సు యొక్క గుణమైనట్లైతే, అన్ని విషయాలకు సంబంధించిన జ్ఞానం మనకుండాలి. అలా అని జ్ఞానము ఇంద్రియాల యొక్క, ఇంద్రియ పదార్థాల యొక్క గుణం అంతకన్నా కాదు. ఒకవేళ అదే అయితే కళ్ళతో వస్తువులను చూసినవాడు కళ్ళు పోయిన తరువాత ఆ వస్తువుల రూపం మరిచిపోవాలి. కాని అలా జరగటం లేదు. కళ్ళు పోయినవాడు పూర్వం తాను చూసిన వస్తువులను గుర్తు తెచ్చుకోగలుగుతున్నాడు. బుద్ధి అనేది దేని యొక్క గుణమూ కాదు. ఆత్మ, మనస్సు, ఇంద్రియాలు, విషయాలు అన్నింటియొక్క కలయికతో జ్ఞానం కలుగుతుంది. ఈ రకంగా కలిగిన జ్ఞానం స్థిరమైనదా? అంటే కాదు. అది అస్థిరమైనది. అనిత్యమైనది. మేఘమండలంలో మెరుపుతీగలు వచ్చి పోయినట్లుగా రెండు క్షణాలు ఉండి మూడవ క్షణంలో నశిస్తుంది. ఇలా ఎందుకు జరుగుతుందంటే, ఘటాన్ని చూసినప్పుడు ఘటజ్ఞానం కలుగుతుంది. పటాన్ని చూసినప్పుడు మొదట కలిగిన ఘట జ్ఞానం పోయి పట జ్ఞానం కలుగుతుంది. దీనికి కారణము ఒక జ్ఞానానికి విరుద్ధమైన ఇంకొక జ్ఞానం కలగటమే అంటోంది న్యాయదర్శనం.

**6. మనస్సు :** మనస్సు ఉన్నది అని చెప్పటానికి ఆధారం ఏమిటి అంటే మనయొక్క నిత్యానుభవమే మనస్సు ఉన్నది అని నిరూపిస్తుంది. బాహ్య ప్రపంచంలో కనిపించే వస్తువులకు, ఇంద్రియాలకు అలాగే ఇంద్రియాలతో ఆత్మకు పరస్పర సంబంధమున్నది. అయినప్పటికీ ఇంద్రియార్థాల యొక్క జ్ఞానము ఒక్కసారిగా ఆత్మకు కలగదు. క్రమంగా కలుగుతుంది. ఈ రకంగా క్రమబుద్ధిని కలిగించే ఆత్మకు – ఇంద్రియాలకు మధ్య ఇంకొక సాధనమున్నది. అదే – మనస్సు.

**యథోక్త హేతుత్వాచ్చాణు**

ఈ సూత్రంలో మనస్సు అణువు అని చెప్పబడింది. మనస్సు అనేది అణు పరిమాణము గలది. అవయవములు లేనిది. మనస్సు ఒక ఇంద్రియముతో కలసి

ఉన్నప్పుడు దానికి ఇంకొక ఇంద్రియముతో సంబంధముండదు. అప్పుడు ఆత్మకు ఈ ఇంద్రియానికి సంబంధించిన జ్ఞానమే ఉంటుంది. అంతేకాని ఇతర ఇంద్రియాలకు సంబంధించిన జ్ఞానముండదు. అయితే ఒక్కొక్కసారి అన్ని ఇంద్రియాలకు సంబందించిన జ్ఞానము ఉన్నట్లు అనిపిస్తుంది. అది నిజం కాదు. ఒక ఇంద్రియము నుంచి ఇంకొక ఇంద్రియానికి వెళ్ళటానికి చాలా తక్కువ కాలము పడుతుంది. ఈ సమయంలో మనస్సుయొక్క వేగం వాయువేగాన్ని మించి ఉంటుంది. కాబట్టి అన్ని ఇంద్రియాల జ్ఞానము మనకు ఉన్నట్లుగా అనిపిస్తుంది. మనస్సు శరీరమంతా వ్యాపించి ఉండదు. అది కేవలము అణుమాత్రమే.

మనస్సు నిత్యమైనది. ప్రళయకాలంలో నశించదు. కాని ముక్తి పొందినప్పుడు నశిస్తుంది. అలాగే యోగప్రక్రియలో సుమన వరకు మనస్సు పనిచేస్తూనే ఉంటుంది. ఆ తరువాత ఉన్మన చేరగానే మనోవ్యాపారము కూడా నశిస్తుంది. జీవి చేసిన కర్మల ఫలితంగా శరీరం ఏర్పడుతుంది. అదే విధంగా సూక్ష్మభూతాల నుండి మనస్సు ఏర్పడుతుంది. అవసానకాలంలో ఈ శరీరాన్ని వదిలి ఇంకొక శరీరాన్ని పొందేది కూడా మనస్సే, అందుకే ఒక్కొక్కసారి గతజన్మలోని విషయాలు ఈ జన్మలో కూడా గుర్తుకు వస్తాయి.

**7. ప్రవృత్తి :** మనోవాక్కాయ కర్మలచే చేయబడు వ్యాపారమే ప్రవృత్తి అనబడుతుంది. అంటే మనస్సుచేతగాని, మాట చేతగాని, శరీరము చేతగాని చేసేటటువంటి పుణ్యాపాపకర్మలే ప్రవృత్తి.

**8. దోషములు :** రాగద్వేషాలే దోషాలు. అనగా అరిషడ్వర్గాలు దోషాలనబడతాయి. అవి వరుసగా కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు వీటితో బాటుగా మాయ, దంభము కూడా చెప్పాలి.

**9. ప్రేత్యభావము :** ప్రేత్యభావము అంటే చచ్చి మళ్ళీ పుట్టటము.

**ఆత్మనిత్యత్వే ప్రేత్యభావసిద్ధిః**

అని చెబుతోంది న్యాయదర్శనం. జీవుడు నిత్యం. శరీరం అనిత్యం. అందుకని శరీరం శిథిలమై పోతుంది. అందులోని జీవిమాత్రం ఆ శరీరాన్ని విడిచి ఇంకొక శరీరం ధరిస్తుంది.

**10. ఫలము :** ఏదైనా ఒక పనిచేస్తే దానివల్ల కొంత ఫలితము కలుగుతంది.

**సద్యః కాలాంతరే చ ఫలనిష్పత్తేః సంశయః**

కొన్ని కర్మలు చెయ్యగానే ఫలితాన్నిస్తాయి. కొన్ని కొంతకాలం తరువాత ఇస్తాయి. బియ్యము నీరు కలిపి నిప్పుల మీద పెడితే కొద్దిసేపటికే అన్నం ఉడుకుతుంది. అది దాని ఫలితం. దీన్నే సద్యః ఫలము అంటారు. విత్తనాన్ని నేలలో నాటి జాగ్రత్తగా నీరు పోస్తుంటే కొంత కాలానికి అది పెరిగి, చెట్టై ఫలితాన్నిస్తుంది. ఇది కాలాంతర ఫలము. ఈ రకంగా మనం చేసే కర్మలు కొన్ని వెంటనే ఫలితాన్నిస్తే, కొన్ని కొంతకాలం తరువాత ఫలితాన్నిస్తాయి. మనం చేసే వ్యభిచారము, సురాపానము, చౌర్యము మొదలైన వాటివల్ల పాపం కలుగుతంది. వీటివల్ల నరకలోకాలు కలుగుతాయి. చెరువులు, బావులు త్రవ్వించటం, సత్రాలు కట్టించటం మొదలైన వాటి వల్ల పుణ్యలోకాలు కలుగుతాయి. ఈ ఫలితాల వల్లనే ఉత్తరజన్మ కలుగుతుంది. కర్మకు, దాని ఫలానికి మధ్య అదృష్టముంటుంది. అదృష్టము అంటే కంటికి కనిపించకుండా ఫలితాన్నిచ్చేది అని అర్థం. పరమేశ్వరుడు ఈ అదృష్టాన్ని ఆధారంగా చేసుకునే మనకు ఫలితము ఇస్తాడు. మనం అనుభవించే సుఖదుఃఖాలు ఈ అదృష్టాన్ని బట్టే వస్తాయి అంతేకాని వాటికి కారణం ఈశ్వరుడు మాత్రం కాదు.

**11. దుఃఖము :** ఇష్టము లేని పనులు చెయ్యటం వలన, ఇష్టము లేని వాటిని అనుభవించటం వల్ల, కలిగేది దుఃఖము.

**వివిధబాధానాయోగాత్ దుఃఖమేవ జన్మోత్పత్తిః**

బాధలను, కష్టాలను అనుభవించటం ఎవరికీ ఇష్టం ఉండదు. అటువంటి కష్టాలు బాధలు అనుభవించటం వల్ల కలిగేదే దుఃఖము. వాటిని అనుభవించటానికి సాధనమైన జన్మమే దుఃఖము. దుఃఖం లేకుండా ఉండాలి అంటే జన్మరాహిత్యం ఒక్కటే మార్గం.

**12. అపవర్గము :** అపవర్గము అంటే సిద్ధించుట, నెరవేరుట, మోక్షము అని అర్థము. ఇంతవరకు జన్మమే దుఃఖము అన్నాం కదా.

ఇక జన్మరాహిత్యమే అపవర్గము. న్యాయదర్శనంలో అపవర్గము అంటే

**దుఃఖ, జన్మ, ప్రవృత్తి, దోష, మిథ్యా జ్ఞానానా**
**ముత్తరోత్త రాపాయే, తదనంతరాపాయా దపవర్గః**

1. దుఃఖము 2. జన్మ 3. ప్రవృత్తి (కర్మాచరణ) 4. దోషములు (రాగద్వేషాలు) 5. మిథ్యాజ్ఞానము. అన్నీ నశిస్తే అపవర్గము అనగా జన్మరాహిత్యం కలుగుతుంది. వీటిలో మొదటి నాలిగింటిని గతంలో వివరించటం జరిగింది. ఇక మిథ్యాజ్ఞానము. ఇది రెండు రకాలు 1. నిమిత్తము 2. నైమిత్తికము. దేహమే నేను అనుకోవటం నిమిత్త మిథ్యాజ్ఞానం. అన్నపానాలు, భార్యాపుత్రులు, భోగభాగ్యాలు సుఖదుఃఖ సాధనాలు అనుకోవటం నైమిత్తిక మిథ్యాజ్ఞానం. ఈ మిథ్యాజ్ఞానాన్ని తత్త్వ జ్ఞానంతో నశింపచేయ్యవచ్చును. మిథ్యాజ్ఞానం గనక నశిస్తే రాగద్వేషాలు నశిస్తాయి. అవి నశిస్తే ప్రవృత్తి నశిస్తుంది. ప్రవృత్తి నశిస్తే కర్మాచరణముండదు. అంటే పాపపుణ్యా లుండవు. కాబట్టి పునర్జన్మ ఉండదు. దుఃఖ నాశనమవుతుంది. మోక్షం ప్రాప్తిస్తుంది.

మిథ్యాజ్ఞానం నశించిన వాడికి ఆత్మతత్త్వం బోధ పడుతుంది. దానివల్ల భేదబుద్ధి నశించి యధార్ధ జ్ఞానం కలుగుతుంది. యథార్థ జ్ఞానము అంటే కేవలం విషయ పరిజ్ఞానం కాదు. ఆ జ్ఞానం మనసుకుపట్టాలి. స్వార్థమనేది ఉండకూడదు. విషయ వాంఛల యందు విరక్తి కలగాలి. దీని సాధనకు యోగం కూడా కొంతవరకు సహాయకారి అవుతుంది. ఇంతవరకు న్యాయదర్శనము ప్రతిపాదించిన షోడశ పదార్థములలో ప్రమాణ, ప్రమేయాలను వివరించటం జరిగింది. ఇప్పుడు మూడవ దాన్ని చూద్దాం.

**3. సంశయము :** ఒక వస్తువు, పదార్థము, విషయము, వీటిని ఔనా, కాదా, అని ఆలోచించటము.

**4. ప్రయోజనము :** దేన్ని ఉద్దేశించి మనం పని చేస్తున్నామో అది ప్రయోజనము.

**5. దృష్టాంతము :** మనకు ఖచ్చితంగా తెలిసిన దాన్ని, ఇంకొక విషయాన్ని సమర్ధించటానికి తీసుకుని రావటము.

**6. సిద్ధాంతము :** మనం చేసిన నిర్ణయాన్ని సమర్ధవంతంగా ప్రతిపాదించటము.

**7. అవయవములు :** ఈ సిద్ధాంతం పంచావయముల సహాయంతో నిర్దుష్టం అవుతుంది.

**ప్రతిజ్ఞా హేతూదాహరణోపనయ**
**నిగమనాని పంచావయవాః**

1. ప్రతిజ్ఞ 2. హేతువు 3. ఉదాహరణ 4. ఉపనయము 5. నిగమనము వీటిని పంచావయవాలు అంటారు. ఇవి అనుమాన ప్రమాణంలో ఉన్నాయి.

1. ప్రతిజ్ఞ అంటే ఋజువు చెయ్యటానికి ప్రతిపాదించే విషయము.

2. హేతువు అంటే ఋజువు చెయ్యటానికి చెప్పే కారణము.

3. ఉదాహరణ అంటే హేతువును బలపరిచే దృష్టాంతము

4. ఉపనయము ప్రతిపాదించే విషయానికి, ఉదాహరణకి అంటే సాదృశ్యము చూపటం. "ఏది ధూమము గలదో, అది వహ్ని గలది" అని చెప్పటం.

5. నిగమనము వీటన్నింటితోను ప్రతిజ్ఞ అనే మొదటి దాన్ని అంటే ఋజువు చెయ్యటానికి ప్రతిపాదించిన విషయాన్ని ధృవపరచటము. దీనికి ఒక మంచి ఉదాహరణ.

మనం వంట ఇంటిని అనేకసార్లు చూస్తుంటాము. అక్కడ నిప్పు ఉంటుంది. పొగ వస్తుంటుంది. దానిని బట్టి "నిప్పు ఉన్న చోట పొగ వస్తుంది" అనే మాట మనకర్థమయింది. ఇప్పుడు ఒక పర్వతం దగ్గర కెళ్ళాం. అందులో నుంచి పొగ వస్తోంది. కాబట్టి అక్కడ నిప్పు ఉన్నది అని, గతంలో వంటఇంటితో ఉన్న అనుభవంతో సందేహించాము. ఇప్పుడు దాన్ని పంచావయవాలతో కలిపి చూద్దాం.

**పర్వతో వహ్నిమాన్ ధూమవత్త్వాద్యో**
**యోధూమవాన్సోఽగ్ని మాన్యథా**
**మహానస స్తథాచాయం తస్మాత్తథేతి ॥**

ఇందులో

1. పర్వతోవహ్నిమాన్ – పర్వతము వహ్నిమంతము ఇది ప్రతిజ్ఞ

2. ధూమవత్త్వాత్ – పొగను కలిగి ఉండుట వలన ఇది హేతువు.

3. యోయోధూమవాన్ స వహ్నిమాన్ తథా మహానసా – ఏది పొగను కలిగి ఉంటుందో అది వంటింటి వలె నిప్పును కలిగి ఉంటుంది. ఇది ఉదాహరణ.

4. తథాచాయమ్ - ఇదియును అట్లే అనగా వంటఇంటివలెనే పర్వతము కూడా ఇది ఉపనయము.

5. తస్మాత్తథేతి - కాబట్టి ఇది కూడా అలాంటిదే అంటే పొగను కలిగి ఉన్నది కాబట్టి ఈ పర్వతము కూడా వంటింటిలాగా అగ్నిని కలిగి ఉన్నది ఇది నిగమనము.

**8. తర్కము :** ఒక విషయాన్ని గురించి తెలుసుకునేటప్పుడు, దాని ఉపపత్తులను (పుట్టుక, సంగతి) కారణాలను ఆలోచించి అంటే పూర్వాపరాలు విచారించి యదార్థాన్ని గ్రహించే సాధనము.

**9. నిర్ణయము :** ఈ తర్కం ద్వారా పక్ష, ప్రతిపక్షాలను విమర్శించి నిర్ధారణకు రావటం.

**10. వాదము :** ప్రమాణాలతో, తర్కంతో, తాను చెప్పిన సిద్ధాంతానికి విరుద్ధం కాకుండా, పక్షప్రతిపక్షాలను ప్రమాణాల ద్వారా ఆలోచించి నిశ్చయించటము.

**11. జల్పము :** తాను ఒక సిద్ధాంతాన్ని కలిగి ఉండి, ఎదుటి వారి వాదనలో దోషాలను చూపి, తన సిద్ధాంతాన్ని స్థాపించటము.

**12. వితండము :** తనకు ఏ రకమైన సిద్ధాంతము లేకపోయినా ఎదుటివారి సిద్ధాంతాన్ని కాదనటం.

**13. హేత్వాభాసము :** అంటే మిథ్యాహేతువు. ఒక సిద్ధాంతాన్ని స్థాపించటానికి సరియైన హేతువులు లేకపోయినప్పటికీ, హేతువులలాగా కనిపించే కుయుక్తులు. ఇవి ఐదు రకాలు అని అన్నంభొట్లు తన తర్కసంగ్రహంలో వ్రాశారు.

**సవ్యభిచార విరుద్ధ సత్ప్రతిపక్షాసిద్ధ బాధితాః**

**పంచహేత్వాభాసః**

1. సవ్యభిచారము 2. విరుద్ధము 3. సత్ప్రతిపక్షము 4. అసిద్ధము 5. బాధితము

ఇవి హేతువులవలె కనిపిస్తాయి. కాని కాదు. అందుచేతనే వీటిని దుష్టహేతువులు అంటారు.

**14. ఛలము :** ఒక విషయాన్ని ప్రతిపాదించి, మధ్యలో దానికి వ్యతిరేకంగా చెప్పటం, విపరీతార్థాలు తియ్యటం. వాది ఒక పదాన్ని ఒక అర్థంలో వాడితే, దానికి వ్యతిరేకార్థం చెప్పి దూషించటం.

**15. జాతులు :** ప్రసంగవశాన వాదనలో కనిపించే ఒక దోషము.

**16. నిగ్రహస్థానములు :** వాదనలో మరుగునపడి ఉన్న దోషాలు.

**ఈశ్వరుడు :** న్యాయదర్శనంలో ఈశ్వరప్రసక్తి ఉన్నది. వీరిదృష్టిలో కూడా ఈశ్వరుడు సర్వజ్ఞుడు. శక్తిమంతుడు. శాశ్వతుడు, గుణరహితుడు.

**ఈశ్వరః కారణమ్ పురుషకర్మా ఫలస్య దర్శనాత్**

జీవులు తాము చేసిన పాపపుణ్యాల యొక్క ఫలితము అనుభవిస్తారు. ఈ రకంగా జీవులకు తమ కర్మలయొక్క ఫలితాలను అందించేది ఈశ్వరుడు. లోకంలో కొంతమంది దుర్మార్గులు భోగభాగ్యాలు అనుభవిస్తున్నారు. అలాగే మంచివాళ్ళు, సత్పురుషులు కష్టాలు అనుభవిస్తున్నారు. దీనికి కారణం ఏమిటి? గతజన్మలలో వారు చేసిన కర్మల ఫలితమే. వాళ్ళు చేసిన కర్మల ఆధారంగా ఈ జన్మలో వాళ్ళకి తగిన ఫలము ఇస్తాడు పరమేశ్వరుడు. అయితే జీవులు వాళ్ళ అదృష్టాన్ని బట్టి కష్టసుఖాలు అనుభవిస్తారు అంటున్నాం కదా ? మరి ఇంకా పరమేశ్వరుడి అవసరం ఏమిటి? అనే అనుమానం వస్తుంది. దీనికి సమాధానం ఏమిటంటే, అదృష్టము, కర్మ. ఈ రెండూ కూడా జడములు. ఏ జన్మలో ఎవరికి ఎంత ఫలితము ఇవ్వాలి అనే జ్ఞానము జడములైన కర్మ, అదృష్టాలకు ఉండదు. అలాగే అల్పజ్ఞుడైన జీవికి ఉండదు. కర్మఫలాన్ని పంచదగినవాడు సర్వజ్ఞుడై ఉండాలి. అతడికి ఏ రకమైన ప్రేమ, అభిమానము, పక్షపాతము ఉండరాదు. అతడు సర్వశక్తిమంతుడు, శాశ్వతుడు కూడా అయి ఉండాలి. ఈ లక్షణాలన్నీ కలవాడు పరమేశ్వరుడొక్కడే. అందుచేతనే పరమేశ్వరుడు జీవులు చేసిన శుభాశుభకర్మల ఫలితాలను బట్టి వారికి ఉత్తరజన్మలు ప్రసాదిస్తున్నాడు.

**సృష్టి:** అసలు ఈ సృష్టి ఏ విధంగా జరిగింది? అనే విషయం మీద కూడా ఈ దర్శనానికి ఖచ్చితమైన అభిప్రాయమున్నది. లోకంలో కనిపించే జడపదార్థాలు అన్నీ అవయవాలు కలిగినవే. ఏదైనా ఒక జడపదార్థాన్ని తీసుకుని దాన్ని ముక్కలు

ముక్కలుగా చేస్తూ పోతే, అది చిన్న చిన్న అణువులు, పరమాణువులుగా అవుతుంది. దేన్నయితే విభజించటానికి సాధ్యం కాదో, అది పరమాణువు. పరమాణువుకు అవయవాలు ఉండవు. అందువల్లనే దాన్ని భేదించటం సాధ్యం కాదు. అంటే దానికి నాశనం లేదు. అవయవాలు గల పదార్థాలు పుడుతూ, నశిస్తూ ఉంటాయి. ఈ రకంగా పుట్టిన ప్రతిపదార్థమూ నశిస్తుంది. అయితే దేనికి జన్మము లేదో దానికి నాశనము లేదు. ప్రళయ కాలంలో కనిపించే జగత్తంతా నశించిపోతుంది. అంటే సావయవమైనవన్నీ నశించిపోతాయి. ఇక్కడ నశించటము అంటే రూపాన్ని కోల్పోవటం. జడపదార్థాలన్నీ ఆ రకంగా రూపాన్ని కోల్పోయి పరమాణువులవుతాయి. ఈ పరమాణువులు ప్రళయం సంభవించినప్పుడు చలనము లేకుండా ఉండిపోతాయి. అంటే పూర్తిగా విశ్రాంతి తీసుకుంటాయి. ఈ రకంగా ప్రళయము అంటే- జడపదార్థముల అవయవనాశనము జరిగి అవి పరమాణువులు అవుతాయి. అంతే కాని సంపూర్ణ ప్రళయము అనేది లేదు.

ప్రళయం జరిగిన కొంతకాలానికి మళ్ళీ ఈ సృష్టి ఆరంభమవుతుంది. అప్పుడు పరమేశ్వరుడు కేవలము అదృష్టాన్ని ఆధారంగా చేసుకుని ఈ జగత్తును సృష్టిస్తాడు. ఆ కాలంలో చలనము లేకుండా విడివిడిగా పడిఉన్న ఈ పరమాణువులకు వాటి వాటి అదృష్టాన్ననుసరించి చలనం కలిగిస్తాడు. ఇక్కడ పరమాణువు చాలా చిన్నది, విభజించటానికి వీలులేనిది అని అర్థం. మనం గదిలో కూచున్నప్పుడు కిటికీ గుండా సూర్యకాంతి పడుతుంది. ఆ కాంతిలో అతిచిన్నవైన రేణువులు మనకు కనిపిస్తాయి. అవి గది అంతా వ్యాపించే ఉంటాయి. కాని కంటికి కనిపించవు. ఏదైనా కాంతిని గనక ప్రసరింప చేసినట్లైతే, ఆ కాంతిలో ఆ రేణువులు కనిపిస్తాయి. అవి త్రసరేణువులు. వాటికన్నా చిన్నవి పరమాణువులు. ఇటువంటి పరమాణువులు కొన్ని కలిసినట్లైతే ఒకరూపం ఏర్పడుతుంది. బంకమట్టి కూడా బాగా ఎండిపోయినప్పుడు పొడిపొడిగా అయిపోతుంది. అంటే మట్టి రేణువులుగా మారుతుంది. ఆ మట్టి రేణువులను నీటితో ఒకటిగా కలిపితే మట్టిముద్ద అవుతుంది. ఆ మట్టిముద్దతోనే వివిధ ఆకారాలు గల బొమ్మలు తయారవుతాయి. అలాగే కొన్ని పరమాణువులు కలిసి ఒకరూపం ఏర్పడుతుంది. ఈ రకంగా జీవులయొక్క పాపపుణ్యాల ననుసరించి ఉత్తరజన్మ ప్రాప్తిస్తుంది. న్యాయదార్శినికుల దృష్టిలో

అవయవాలు వేరు. అవయవములు గలిగి ఉండేది వేరు. ఇక్కడ పరమాణువులు అవయవులు. మహద్రూపాలు అవయవాలు.

**నిత్యవస్తువులు :** ఈ దర్శనంలో నిత్యమైన వస్తువులను కూడా వివరించటం జరిగింది. ఈశ్వరుడు, ఆత్మలు, అణువులు, అదృష్టము, ఆకాశము, దేశము, కాలము ఇవి నిత్యమైనవి. వీటిలో మొదటి నాలిగింటిని గురించి గతంలో వివరించటం జరిగింది. ఇప్పుడు మిగిలిన వాటిని చూద్దాం.

**ఆకాశము :** ఇది పంచభూతాలలో మొదటిది.

**శబ్దసంయోగ విభావాచ్ఛ సర్వగతమ్**

అంటోంది న్యాయదర్శనం. అంటే శబ్దము ఆకాశమంతా వ్యాపించి ఉంటుంది. సర్వత్రా ఉంటుంది. అందుచేతనే దాన్ని సర్వవ్యాపి అన్నారు. ఆకాశానికి అవయవాలు లేవు. గుణాలు అంతకన్నా లేవు. ఆకాశం యొక్క లక్షణం శబ్దం. ఆకాశము నిత్యము. కాని దాని లక్షణమైన శబ్దము ప్రయత్నం వల్ల పుడుతోంది. కాబట్టి శబ్దము అనిత్యము దానికి ఉత్పత్తి, తిరోభావము ఉన్నాయి.

**దేశము :** ఇది కూడా శాశ్వతము, నిత్యము అయినదే. దీనికి మనము ఏర్పాటు చేసిన తూర్పు, పడమర, ఉత్తరము, దక్షిణము మొదలైన దిక్కులు, ఆగ్నేయము, నైరుతి, వాయువ్యము, ఈశాన్యము మొదలైన మూలలు అన్నీ వ్యావహారికమే.

**కాలము :** ఇదికూడా నిత్యమైనదే. దీనికి మనం ఏర్పాటు చేసిన భూత, భవిష్యత్తు, వర్తమానాలు అన్నీ వ్యావహారికమే అంతేకాని కాలానికి విభాగం లేదు. ఘటన ఉంటేనే కాలం ఉంటుంది. లేకపోతే కాలం ఉండదు.

ఈ విధంగా న్యాయదర్శనం చెప్పబడింది.

న్యాయదర్శనంలో 1. న్యాయాంశము 2. తర్కాంశము 3. దర్శనాంశము అని మూడు అంశాలున్నాయి. వీటిలో

| | | |
|---|---|---|
| న్యాయాంశము | - | ప్రమాణము మీద ఆధారపడింది. |
| తర్కాంశము | - | పక్ష, ప్రతిపక్ష విమర్శలకు చెందినది |
| దర్శనాంశము | - | తత్త్వజ్ఞానానికి సంబంధించినది. |

న్యాయదార్శనికులు కార్యకారణ సంబంధాన్ని బాగా చర్చించారు. ఈ సంబంధం తెలిస్తేనే చరాచర జగత్తుయొక్క స్వరూపం బోధపడుతుంది అంటారు. న్యాయదర్శనము పునర్జన్మను అంగీకరిస్తుంది. జీవి తాను చేసిన కర్మల వలన శరీరాన్ని ధరించి సుఖదుఃఖాలు పొందుతున్నది. పూర్వజన్మలో చేసిన కర్మవల్లనే ఈ శరీరము ఉద్భవిస్తున్నది అని వీరి వాదన. ఈ దర్శనాన్ననుసరించి ఆత్మ ఉన్నది. కాని ఒక వ్యక్తియొక్క ఆత్మ, ఇంకొక వ్యక్తియొక్క ఆత్మ ఒకటి కాదు. ఎవరి ఆత్మవారిదే. ఎవరి అనుభూతి వారిదే. చైతన్యము శరీర ధర్మం కాదు. శరీరము పంచభూతాల వల్ల ఏర్పడింది. అందుకే దీన్ని పాంచభౌతికము అంటారు. చైతన్యము గనక శరీర ధర్మమైనట్లైతే, పంచభూతాలలో చైతన్యం ఉండాలి. అంతేకాని నేను తెలుసుకున్న వస్తువుయొక్క ధర్మంగా చైతన్యాన్ని చెప్పటానికి వీలులేదు.

ఇంద్రియాలకన్న భిన్నమైనది ఆత్మ. వివిధ ఇంద్రియాలు గ్రహించిన వివిధ విషయాలను సమన్వయపరచి ఒకచోట చేర్చేది ఆత్మ. ఇంద్రియాలు నశించినప్పటికీ నిలిచి ఉండేది ఆత్మ. ఇది బుద్ధి ఉపలబ్ధి జ్ఞానము అనే వాటికన్న వేరైనది. బుద్ధి అనేది నిత్యమైనది కాదు. అది కూడా మనస్సులాగా ఆత్మయొక్క గుణమే.

పుట్టిన ప్రతివస్తువు గిట్టక మానదు. అవయవాలున్న ప్రతివస్తువు నశిస్తుంది. ఆత్మకు అవయవాలు లేవు. అందుకే దానికి నాశనం లేదు. దీనికి ఆద్యంతాలు లేవు. ఆత్మ అణుప్రమాణమైనది. అనంతమైనది. ఆత్మలేనిదే చైతన్యము లేదు. చైతన్యము ఆత్మయొక్క గుణము. శరీరము, ఇంద్రియాలు, బుద్ధి, మనస్సు స్మృతి మొదలైనవి ఆత్మయొక్క గుణాలు. బాహ్యవిషయాలవల్లనే రాగద్వేషాలు పుడుతున్నాయి. వాటివల్ల అహంకారం కలుగుతోంది. అహంకారాన్ని పోగొట్టేదే తత్త్వజ్ఞానం. ఇంద్రియ గోచరమైన విషయపరిజ్ఞానం వల్ల రాగద్వేష, మోహాలు ఉద్భవిస్తున్నాయి. కాబట్టి విషయాదుల నుంచి ఇంద్రియాలను మరల్చాలి. అప్పుడు మనస్సుకు ఆత్మతో సంయోగము ఏర్పడుతుంది. ఇది తత్త్వాన్వేషణకు దారి తీసే సమాధి. దీన్నే 'నిధిధ్యానము' అంటారు.

న్యాయసూత్రాలు యోగాభ్యాసాన్ని కూడా వివరించాయి. మోక్షం సాధించాలంటే అష్టాంగమార్గాన్ని అనుసరించాలి. అష్టాంగాలు అంటే

1. యమము 2. నియమము 3. ఆసనము 4. ప్రాణాయామము 5. ప్రత్యాహారము 6. ధ్యానము 7. ధారణము 8. సమాధి

వీటివల్ల ఆత్మ సంస్కారం కలుగుతుంది. దానివల్ల ఆత్మజ్ఞానం కలుగుతుంది. వీటికి శ్రవణము మననము కలిపినట్లైతే జ్ఞానము పరిపక్వమవుతుంది అంటే సంశయాలు తొలగిపోతాయి. గతంలో తెలియని విషయాలు తెలుస్తాయి.

ఒక విషయాన్ని ఉన్నది ఉన్నట్లుగా తెలుసుకోవటమే తత్త్వము అనబడుతుంది. ఈ తత్త్వజ్ఞానము వల్ల మిధ్యాజ్ఞానము నశిస్తుంది. దీనివల్ల రాగద్వేషాలు పోతాయి. అప్పుడు కర్మలు చేయటం జరగదు. అందువల్ల పాపపుణ్యాలుండవు. పునర్జన్మ ఉండదు. సుఖదుఃఖాలు ఉండవు. దుఃఖము లేకుండా ఉండటమే మోక్షము. అని చెబుతున్నది న్యాయదర్శనం.



# 7. చార్వాకదర్శనం

దర్శనశాస్త్రాల్లో పూర్తిగా అవైదికమైనది 'చార్వాకదర్శనం'. ఇది చాలా పురాతనమైనది. ఋగ్వేదంలో చార్వాకమతాన్ని బలపరిచే విషయాలు ఉన్నాయి. నాస్తిక శిరోమణి అయిన చార్వాకుడు ఈ మతాన్ని ప్రచారం చేశాడు. చారు అంటే - అందమైన, తియ్యనైన, వాక్ అంటే మాట. మొత్తం మీద 'చార్వాకము' అంటే తియ్యనైన మాట, చెవులకింపైన మాట అని అర్థం. ఈ మతంలో చెప్పే విషయాలు అన్నీ హాయిగా, తీయగా, ఆచరించటానికి తేలికగా, సుఖంగా ఉంటాయి.

**యావజ్జీవం సుఖం జీవేత్ నాస్తిమృత్యో రగోచరః**
**భస్మీభూతస్య దేహస్య పునరాగమనం నకుతః**

జీవితం శాశ్వతం కాదు. పుట్టిన ప్రతిప్రాణి మరణించక తప్పదు. మన కళ్ళ ఎదుట బూడిద అయిపోయిన ఈ దేహము మళ్ళీ జన్మించటం జరగదు. కాబట్టి బ్రతికినంత కాలం సుఖంగా జీవించాలి.

స్థూలంగా చూసినట్లైతే ఇది చార్వాకుల సిద్ధాంతము. పరమేశ్వరుడు మోక్షప్రదాత కాదు. అసలు పరమేశ్వరుడే లేడు. అర్థశాస్త్రము, కామశాస్త్రము. ఈ రెండింటినీ అనుసరించి మాత్రమే మానవుడు నడుచుకోవాలి. పురుషార్థాలు నాలుగు కాదు. రెండే ధర్మార్థ కామ మోక్షాలలో, మధ్యలో ఉన్న అర్థకామాలే పురుషార్థాలు. పరలోకం అనేదిలేదు. పంచభూతాలలో ఆకాశాన్ని వీరంగీకరించరు. భూమి, నీరు, నిప్పు, గాలి. ఈ నాలుగే భూతాలు. కొన్ని వస్తువులు కలిపితే ఒక క్రొత్త వస్తువు ఏర్పడుతుంది. అలాగే ఈ నాలుగు భూతాల కలయిక వల్లనే దేహం ఏర్పడుతుంది. ఈ భూతాలచేరిక వల్లనే దేహంలో ఒక శక్తి అనేది ఏర్పడుతుంది. ఆ శక్తే చైతన్యము. ఆ చైతన్యంతో కూడిన దేహమే ఆత్మ. ఆత్మ అనేది ప్రత్యేకంగా లేదు. అది దేహంతోనే పుడుతుంది. దేహంతోనే నశిస్తుంది. భూతాల కలయికతో ఏర్పడిన చైతన్యము, అవి విడిపోయినప్పుడు నశించిపోతుంది. జీవితంలో స్త్రీ సౌఖ్యమే పరమమైన పురుషార్థము. దీనిలో దుఃఖము ఉన్నట్లైతే ఆ దుఃఖ భాగాన్ని వదిలిపెట్టి సుఖాన్ని మాత్రమే అనుభవించాలి. ముళ్ళున్నాయని గులాబి పువ్వుని కోసుకోవటం మానేస్తామా? పొట్టు ఉందని ధాన్యం ఉపయోగించటం మానెయ్యం కదా?

కష్టాలున్నాయని పనులు చెయ్యటం ఎప్పుడూ మానెయ్యం. గొడ్లు తినిపోతాయని పంటలు వెయ్యటం మానెయ్యం. బిచ్చగాళ్ళు వస్తారని వంట చెయ్యటం మానెయ్యం కదా ? అలాగే ప్రతిదాన్లోనూ ప్రతికూలమైన దాన్ని వదిలి, అనుకూలమైన దానివల్ల సుఖాన్ని అనుభవించాలి అనేదే చార్వాకుల భావము. పరలోక సుఖం లేనప్పుడు వ్యయప్రయాసలకు ఓర్చి యజ్ఞయాగాదులు ఎందుకు చెయ్యాలి? అనేది వీరి ప్రశ్న. పురోహితులు మంత్రాలు చదువుతారే కాని వాటిఅర్థం వాళ్ళకి తెలియదు కదా ? అర్థం తెలియని వేదాలను ఎందుకు చదవాలి? దేవతలు ఎక్కడున్నారు? వాళ్ళని చూసిన వారెవరు ? యజ్ఞాలలో ఆహుతులు ఎవరికివ్వాలి? ఈ ప్రశ్నలు వేసిన వాళ్ళు ఇప్పుడే కాదు వేదకాలంలో కూడా ఉన్నారు. వీరిది విచికిత్స సంశయము, అశ్రద్ధ గలవారని బృహదారణ్యకోపనిషత్తు చెప్పింది. కఠోపనిషత్తులో నచికేతుడు ఆత్మవిద్యను బోధించమని కోరినప్పుడు కొందరు ఉన్నది అంటారు. కొందరు లేదుఅంటారు. దాని అసలుతత్త్వం చాలా కొద్దిమందికి మాత్రమే తెలుసు అని చెబుతాడు యముడు. కాబట్టి ఆత్మ లేదనే వాదన చాలాకాలంగా ఉంది. వేదాల్లోనే కాకుండా కావ్యాలు, నాటకాలు, పురాణాల్లో కూడా ఈ విషయం చెప్పబడింది. రామాయణంలో శ్రీరాముడు భరతుడితో మాట్లాడుతూ అరణ్యకాండలో

**కచ్చిన్నలోకాయతికాన్ బ్రాహ్మణాంస్తాతసేవసే**
**అనర్థకుశలాహ్యేతే బాలాః పండితమానినః**
**ధర్మశాస్త్రేషముఖ్యేషు విద్యమానేషు దుర్బుదాః**
**బుద్ధిమాన్వీక్షకీం ప్రాప్యనిరర్థం ప్రవదంతితే ॥**

"ఓ భరతా ! నువ్వు లోకాయతులతో సహవాసం చెయ్యటం లేదు కదా ? వాళ్ళు అనర్థాలు లేపదీయటంలో చాలా నేర్పరులు. ఒట్టి మూర్ఖులే అయినప్పటికీ తాము చాలా గొప్పపండితులము అని చెప్పుకుంటారు. గొప్ప గొప్ప ధర్మశాస్త్రాలు ఎన్నో ఉన్నప్పటికీ, కుతర్కాలను ఆశ్రయించి, వాటికి పెడర్థాలు చెబుతారు." అంటాడు.

ఈ మతానికి "లోకాయుత మతము" అని ఈ దర్శనానికి "లోకాయుత దర్శనము" అని కూడా పేరు ఉన్నది. **లోక్యతే ఇతిలోకః** చూడబడేదే లోకము అని అర్థం. దీన్ని బట్టి లోకంలో మన కంటికి కనిపించేదే సత్యం. కాబట్టి లోకంలో

మనం జీవించినంత కాలం సుఖాలు భోగాలు అనుభవించాలి. మరణానంతర జీవితం గురించి మనకి తెలియదు కాబట్టి ఈ లోకంలో సుఖాన్ని అనుభవించటమే జీవిత పరమార్థం. అదే పురుషార్థం కూడా. ఇటువంటి భావాలు లోకంలో ఆయతమై ఉంటాయి. ఆయతము అంటే వ్యాపించటము అని అర్థం. అందుకే ఈ మతాన్ని "లోకాయతమతం" అని కూడా అంటారు. ఈ మతానికి 1. అక్రియవాదం 2. నాస్తికవాదం 3. అజ్ఞానవాదం 4. బార్హస్పత్యం అని కూడా పేర్లున్నాయి.

1. ఈ లోకంలో మనం చెయ్యాల్సిందేమీ లేదని చెప్పటం చేత దీన్ని "అక్రియవాదము" అంటారు.

2. వేదాలను, వైదిక కర్మలను నిందించేది కావటం చేత 'నాస్తికవాదం' అంటారు.

3. ఈ లోకమే సత్యం. ఇదే సర్వం, వాస్తవం. కంటికి కనిపించేదే తప్ప వేరేదేదీ లేదు. అని ఆత్మజ్ఞానాన్ని నిరసిస్తుంది కాబట్టి "అజ్ఞానవాదం" అంటారు.

4. ఈ మతాన్ని బృహస్పతి చెప్పాడు కాబట్టి 'బార్హస్పత్యం అంటారు.

రాక్షసులను ప్రక్కతోవ పట్టించటానికే బృహస్పతి వేదాలను నిరసిస్తూ నాస్తిక వాదాన్ని ప్రచారం చేశాడు అని పురాణాలు చెబుతున్నాయి. ఇంద్రియ సుఖమే ఆనందము. అటువంటి ఆనందం పొందటమే మానవుల కర్తవ్యము.

**అప్పుగొనియైన దొంగిలియైన లెస్స**
**జిహ్వాకింపైన దాని భుజింపవలయు**
**కంటికింపైన కాంతను కలవవలయు**
**బ్రతుకు దినముల మోక్షంబు వెతకనేల**

ఇది నాస్తికమతసారము. రామాయణంలో అయోధ్యకాండలో 'జాబాలి' నాస్తికమతాన్ని రాముడికి ఉపదేశించగా, రాముడు ఆ మతాన్ని ఖండిస్తాడు. నాస్తిక మతంలో ముఖ్యమైన సూత్రాలు :

1. **పృథివ్యాపస్తేజో వాయురితి తత్త్వాని**

(నేల, నీరు, నిప్పు, గాలి అనేవి తత్త్వాలు)

**2.** తత్సముదాయే శరీరేంద్రియ విషయసంజ్ఞా
(వాటి సముదాయమే శరీరము)

**3.** తేభ్యశ్చైతన్యమ్ (అవే శరీరానికి చైతన్యశక్తి)

**4.** కిణ్వాదిభ్యో మదశక్తివత్ విజ్ఞానమ్

**5.** మదశక్తివద్ విజ్ఞానమ్

**6.** చైతన్య వశిష్టః కాయః పురుషః
(చైతన్యం గల శరీరమే పురుషుడు లేక జీవుడు)

**7.** కామఏవఏకః పురుషార్థాః (కామ మొక్కటే పురుషార్థము)

**8.** మరణమే వాపవర్గః (మరణమే మోక్షము)

ఈ మతాన్ని బృహస్పతి ప్రచారం చేశాడు.

**అగ్నిహోత్రం త్రయోవేదాః త్రిదండం భస్మగుంఠనం**
**బుద్ధిపౌరుషహీనానాం జీవికేతి బృహస్పతి ॥**

అగ్ని హోత్రము, వేదాలు, దండము, భస్మలేపనము, వీటిని బుద్ధి, పౌరుషము లేనటువంటి వాళ్ళు జీవనోపాధి కోసం తగిలించుకుంటారు. అంటాడు బృహస్పతి.

ముళ్ళు గుచ్చుకోవటం, తేలు కుట్టటం వంటి బాధలే నరకం. ప్రజలను పాలించే ప్రభువే ఈశ్వరుడు. శరీర నాశనమే మోక్షము. శరీరము ఆత్మకన్న వేరు కాదు. రాహువు యొక్క తల అన్నప్పుడు, ఈ తల రాహువు కన్న వేరైనది కాదు.

**అగ్నిరుష్ణో జలంశీతం, సమస్పర్శస్తథానిలః**
**కేనేదం చిత్రితం ? తస్మాత్ స్వభావాత్సద్వ్యవస్థితః ॥**

నిప్పు వేడిగా ఉండటం, నీరు చల్లగా ఉండటం, గాలి సమశీతోష్ణంగా ఉండటం అనేవి సహజమైన లక్షణాలు. అది ఆ వస్తువుల స్వభావము దీనిని ఎవరూ చెయ్యనవసరం లేదు. అన్నాడు బృహస్పతి.

ఈ మతంలో వేదాలను, వేదకర్మలను తీవ్రంగా నిరసించారు. స్వర్గం లేదు మోక్షం లేదు. ఆత్మపరలోకం చేరదు. యాగంలో బలి ఇవ్వబడిన పశువుకు స్వర్గం వచ్చేట్లయితే, యజమాని తన తండ్రిని ఎందుకు బలి ఇవ్వడు? చచ్చిపోయిన వాళ్ళకి

శ్రాద్ధమువల్ల తృప్తి కలిగేటట్లైతే, ఆరిపోయిన దీపానికి నూనె వేస్తే మళ్ళీ అది వెలగాలి కదా? ప్రయాణం చేసే బాటసారికి ఆహారం కట్టి ఇవ్వటమెందుకు? ఇంట్లో శ్రాద్ధం పెడితే వారికి ఆకలి తీరిపోవాలి కదా ? స్వర్గానికి పోయిన జీవుడు ఇక్కడ పెట్టే శ్రాద్ధంతో తృప్తిపడేటట్లైతే, పై అంతస్తులో, ఉండే వారికి క్రింద ఉండే వారు శ్రాద్ధం పెడితే చాలదా? ప్రాణం పోయేదాకా సుఖంగా ఉండాలి. అప్పు చేసైనా సరే పప్పు తినాలి. కాలిబూడిదఅయిన దేహము తిరిగి ఎలావస్తుంది. దేహం నుంచి లేచిన జీవుడు బంధుమిత్రుల వియోగం భరించలేక ఎందుకు తిరిగి రాడు? ఇవి వీరి సిద్ధాంతాలు.

చార్వాక సిద్ధాంతంలో ప్రత్యక్షప్రమాణమే ముఖ్యమైనది. అనుమాన ప్రమాణంగాని, శబ్దప్రమాణం గాని వాళ్ళు నమ్మరు. ప్రత్యక్షప్రమాణం అంటే కంటికి కనిపించేది. అనుమానప్రమాణం అంటే ఊహ. పొగ వస్తోంది. కాబట్టి నిప్పు ఉండి ఉంటుంది. శబ్దప్రమాణం అంటే ఆప్తవాక్యం.

ఎవరెంత కాదన్నా మనం అనుమానాన్ని ప్రమాణంగా తీసుకుంటాం. దాన్ని సత్యమని నమ్మి పనులు చేస్తుంటాం. అయితే చార్వాకులు కొన్ని అనుమానాలు కాకతాళీయంగా నిజం కావచ్చు. ఒక్కొక్కసారి అవి తప్పు అని తేలవచ్చు అంటారు. ఉదాహరణ పొగ మంచు. కాబట్టి అనుమానం ప్రమాణం కాదు. అలాగే ఆప్తవాక్యం పట్ల విశ్వాసం ఉంచటం కూడా వ్యర్థప్రయాసే అంటారు చార్వాకులు.

**జర్భరీ, తర్ఫరీ, జేమనా** వంటి అర్థంలేని పదాలు వేదంలో వాడారు కాబట్టి వేదాలను రచించినవారు భండులు (దుచ్చేష్టులు) ధూర్తులు, నిశాచరులై ఉంటారు. కాబట్టి వేదం ప్రమాణం కాదు.

చార్వాకుల దృష్టిలో పంచభూతాలు లేవు. అవి నాలుగే. ఆకాశం అంటేనే శూన్యం. దానికి ప్రత్యేకసత్తా లేదు. నేల, నీరు, నిప్పు, గాలి వీటివల్లనే ఈ జగత్తు సృష్టించబడింది. అయితే చిత్రవిచిత్రమైన జగద్వస్తుజాలము ఎలా పుట్టింది? అనే దానికి వీరిదగ్గర సరైన సమాధానం లేదు. అది స్వాభావికంగా జరుగుతుందని చెబుతారు. నెమళ్ళకు ఇంతఅందమైన రంగులు ఎవరిచ్చారు? కోకిలకు అంత మంచిగొంతు ఎవరిచ్చారు? అంటే అదంతా స్వాభావికం అంటారు.

నాలుగుభూతాల వల్లనే శరీరం ఉత్పన్నమవుతుంది. శరీరం తప్ప ఆత్మ అనేది వేరుగా లేదు. చైతన్యమనేది ఆత్మయొక్క ధర్మం. శరీరాన్ని విడిచి ఆత్మ వేరుగా

ఉండదు. కాబట్టి శరీరమే ఆత్మ. అయితే ఆత్మవిషయంలో చార్వాకులలో నాలుగు భేదాలున్నాయి.

**1. దేహాత్మవాదులు :** శరీరమే ఆత్మ అని భావించేవారు.

**2. ఇంద్రియాత్మవాదులు :** ఇంద్రియాలతో కలిగే అనుభవాన్ని తీసుకుని, ఇంద్రియాలే ఆత్మ అని భావించేవారు.

**3. ప్రాణాత్మవాదులు :** ప్రాణం లేకపోతే శరీరంలో చలనముండదు. కాబట్టి ప్రాణమే ఆత్మ అని భావించేవారు.

**4. మనసాత్మవాదులు :** మనస్సు యొక్క సంకల్ప వికల్పాలలో జీవిస్తూ, మనస్సే ఆత్మ అని భావించేవారు.

వీరు పూర్తిగా భౌతికవాదులు. వీరికి అలౌకిక విషయాలపట్ల ఏ మాత్రం ఆసక్తి లేదు. ఈ దృక్పథంతోనే వారు మానవ జీవితం యొక్క కర్తవ్య అకర్తవ్యాలను బోధిస్తారు. భారతీయదర్శనాలన్నీ చతుర్విధపురుషార్థాలను చెబుతుండగా, చార్వాకులు మాత్రం ధర్మ, మోక్షాలను తిరస్కరిస్తారు. అనేక లౌకిక దృష్టాంతాలను చూపించి వైదిక పద్ధతులు కల్పితాలని నిరూపించటానికి ప్రయత్నిస్తారు. ధర్మం లేదు. అధర్మం లేదు. పాపం లేదు పుణ్యం లేదు. కాబట్టి వాటివల్ల ఫలితం కూడా లేదు. మన కంటికి కనిపించేదే లోకం. కాబట్టి బ్రతికినన్నాళ్ళు తిను, తాగు, ఆనందించు. కనిపిస్తున్న వాటిని వదిలి, కనిపించని వాటి కోసం ప్రాకులాడటం మూర్ఖత్వం అంటారు. చార్వాకులు మోక్షాన్ని నమ్మరు. వారి అభిప్రాయంలో ఈ శరీరం జీవించి ఉన్నంత కాలం మనిషి సుఖాలతోపాటు దుఃఖాలు కూడా అనుభవించాల్సిందే. మరణంతో అవన్నీ సమసిపోతాయి. జీవికి అత్యంత నివృత్తి కలుగుతుంది. కాబట్టి మరణమే మోక్షము. చార్వాకులదృష్టిలో లౌకికసుఖమే పరమార్థం. దాని కోసం అర్థకామాలు ఉపకరిస్తాయి. కాబట్టి మానవుడు ధర్మాధర్మాలు, పాపపుణ్యాలను గురించి ఆలోచించకుండా వీలైనంతగా ధనార్జన చెయ్యాలి. సుఖాలు అనుభవించాలి.

**యావజ్జీవేత్ సుఖం జీవేత్ రుణం కృత్వా ఘృతం పిబేత్**
**భస్మీ భూతస్య దేహస్య పునరాగమనం నకుతః ॥**

తగినంతగా సంపాదించలేనప్పుడు అప్పుచేసైనా సరే సుఖాలను అనుభవించాలి. అనేదే వీరి ముఖ్య సిద్ధాంతము.

# 8. జైనదర్శనము

'జినుడు' అంటే జయించినవాడు అని అర్థం. ఇంద్రియాలను జయించినవాణ్ణి జినుడు అంటారు. మనకి అర్థం అయ్యే భాషలో చెప్పాలంటే అంతరింద్రియ నిగ్రహము, బాహ్యేంద్రియ నిగ్రహము గలవాడు, శమదమాది గుణాలు గలవాడు మాత్రమే జినుడు అనబడతాడు. జినుని అనుసరించిన వారే జైనులు.

సృష్టి ప్రారంభంలో ఉన్నవాడు స్వాయంభువ మనువు. అతని కుమారుడు - ప్రియవ్రతుడు. ప్రియవ్రతుని కుమారుడు - అగ్నీధ్రుడు. అగ్నీధ్రుని కుమారుడు - నాభి. నాభి కుమారుడు ఋషభుడు అంటే ప్రియవ్రతునిముని మనవడు - ఋషభుడు స్వాయంభువ మనువు వంశంలో ఐదవవాడు. ఈ ఋషభుడే జైనమత స్థాపకుడు, మొదటి తీర్థంకరుడు. తీర్థంకరుడు అనే పదానికి - ప్రచారకుడు జైన మత ప్రవక్త అని అర్థం. దీనిని బట్టి జైనమతం చాలా ప్రాచీనమైనది అని తెలుస్తోంది. ఈ మతంలో తీర్థంకరులందరూ క్షత్రియులే. 20, 22 తీర్థంకరులు తప్ప, మిగిలిన వారంతా కూడా ఇక్ష్వాకు వంశంలోని వారే కావటం విశేషం. జైనమతంలో 19వ తీర్థంకరి **"మల్లినాథ"** అనే స్త్రీ. 23వ తీర్థంకరుడు కాశీరాజు అశ్వసేనుడి కుమారుడు **'పార్శ్వనాథుడు'** 24వ తీర్థంకరుడు **'వర్ధమాన మహావీరుడు'**

క్రీ.పూ. 599లో వైశాలి రాజ్యంలో ప్రస్తుతం బీహారు రాష్ట్రంలోని సుప్రసిద్ధ రాజైన సిద్ధార్థుడికి, త్రిశలాదేవికీ జన్మించాడు వర్ధమానుడు. ఇతడికి వర్ధమానుడు, వీరుడు, అతివీరుడు, మహావీరుడు, సన్మతి అని బిరుదులున్నాయి. వర్ధమానుడు బుద్ధునికి సమకాలీకుడు. బుద్ధుడికన్న కొంచెం పెద్దవాడు.

వర్ధమాన మహావీరుడు తన 28వ ఏట ఆధ్యాత్మిక జీవితాన్ని ప్రారంభించాడు. అప్పటి నుండి 12 సం॥ ఘోరమైన తపస్సు చేశాడు. ఆ తరువాత కొద్ది కాలానికే ఇతడు కేవలి అయినాడు. దిగంబరుడు కూడా అయినాడు. అన్ని వస్తువుల పరిపూర్ణ జ్ఞానాన్ని 'కేవలం' అంటారు. ఈ జ్ఞానం కలిగినవాడు 'కేవలి'. ఆ తరువాత తీర్థంకరుడని అంగీకరించబడ్డాడు. సర్వజ్ఞుడు, జినుడు, మహావీరుడు అని ప్రసిద్ధి చెందాడు. మొత్తం 72 సంవత్సరాలు జీవించాడు. జీవితంలో చివరి 30 సం॥లు మతప్రచారంలోను, సన్యాసవర్గ నిర్మాణంలోను కాలం గడిపాడు. ఇతని అనుచరులలో

చాలామంది రాజకుటుంబాల నుంచే వచ్చారు. ఇతని బోధనలు అంగీకరించి పోషించిన వారు అతని మాతృసంబంధుల సామంతరాజులు. వీరిలో స్త్రీ పురుషులకు వేరువేరుగా గృహస్థ, సన్యాస వర్గాలను ఏర్పాటు చేశాడు. వర్ధమానుడి బోధనలకు చాలామంది ఆకర్షితులై సంపూర్ణ దిగంబరులైనారు. పార్శ్వనాథుని అనుసరించిన వారు వస్త్రధారణ అవసరమని భావించారు. వారే శ్వేతాంబరులు. దీంతో జైనమతం శ్వేతాంబరులు, దిగంబరులు అని రెండు శాఖలుగా విడిపోయింది. వీరిద్దరికీ తేడా తత్త్వసిద్ధాంతంలోనే గాక, అసలు సూత్రాలలోనే కనిపిస్తుంది. పూర్ణసిద్ధి పొందిన వారు తిండి కూడా లేకుండా జీవించగలరని 'నాది' అనే భావన లేశమాత్రము ఉన్నప్పటికీ నిర్వాణము లభించదనీ, ఈ కారణంచేతనే వంటిమీద వస్త్రాలు కూడా ఉండకూడదని, స్త్రీలకు మోక్షము లేదని వీరి నమ్మకం. వస్త్రాలు కూడా లేకుండా, అలంకారాలు లేకుండా, తలవంచుకుని ఉండటమే తీర్థంకరుని లక్షణము అంటారు. వీరికి పవిత్ర గ్రంథాలనేవి లేవు. శ్వేతాంబరుల మతగ్రంథాలను వీరు ఒప్పుకోరు. జైనమతాన్ని బాగా ప్రచారంలోకి తెచ్చినవాడు వర్ధమాన మహావీరుడు.

ఈ జగత్తు ఎలా సృష్టించబడింది? అన్న ప్రశ్నకు జైనమతంలో సమాధానం లేదు. ఈ జగత్తు అనాదిగా ఉన్నది అని వీరి సిద్ధాంతము. అది దేనినుండీ ఆవిర్భవించలేదు. వికారం పొందలేదు. సత్యపదార్థం నుంచి అంతకన్నా రాలేదు. ఈశ్వరుడు జగత్తును సృష్టించలేదు. స్వతంత్రమైన అణుపదార్థాల కలయిక వల్లనే ఈ జగత్తు ఏర్పడింది. ఈ అణుపదార్థాలు రెండు రకాలు 1. జీవము 2. అజీవము

**1. జీవము :** ఆత్మ లేదా జీవులు అనేకులు. జీవులు అణుస్వరూపులు కారు. ఏ జీవుడు ఏ శరీరాన్ని పొందుతాడో, ఆ జీవుడు ఆ శరీరపరిమాణాన్ని కలిగి పాలలో నెయ్యిలాగా శరీరమంతా వ్యాపించి ఉంటాడు. ఆత్మ అనేది జడపదార్థం కాదు. ఏ జడపదార్థం నుంచి గాని, శరీరం నుంచి గాని పుట్టలేదు. జీవులలో జీవమే తప్ప పదార్థము అనేది ఏదీలేదు. ఆత్మ స్వయంప్రకాశి. దానికి పెరుగుట, తరుగుట అనేవి ఉన్నాయి. అంతవరకే కాని ఆత్మకు సంపూర్ణ నాశనం లేదు. ఆత్మ నిత్యమైనది. జీవి జన్మించినప్పుడు శరీరం చిన్నగా ఉంటుంది. ఆ సమయంలో ఆత్మకూడా చిన్నగానే ఉంటుంది. శరీరము పెరిగినకొద్దీ ఆత్మకూడా పెరుగుతుంది. జీవి మరణించినప్పుడు ఆత్మసూక్ష్మాకారం పొందుతుంది. తిరిగి జన్మించినప్పుడు ఏ

శరీరాన్ని పొందుతుందో, ఆ శరీర పరిమాణం పొందుతుంది. అంటే చీమలోని ఆత్మ చిన్నగాను, ఏనుగుయందున్న ఆత్మ పెద్దగాను ఉంటుంది.

ఏదైనా కర్మ చెయ్యటానికి, చెయ్యకపోవటానికి కర్త జీవుడే. కర్మఫలము అనుభవించేది కూడా అతడే. కర్మఫలాన్ని ఇచ్చేఈశ్వరుడు ఇంకొకడు లేడు. కర్మే కర్మ ఫలాన్నిస్తుంది. ఆత్మస్వచ్ఛమైనది. జ్ఞానస్వరూపమైనది. సుఖదుఃఖాలకు అతీతమైనది. ఆత్మ నాలుగు రకాలైన స్వరూపం కలిగి ఉంటుంది. అవి

1. అనంతదర్శనము 2. అనంతజ్ఞానము 3. అనంతానందము 4. అనంత వీర్యము. కర్మ మాలిన్యము కడిగి వేయబడిన ఆత్మకి ఈ అనంతచతుష్టయము స్వరూపంగా ఉంటుంది. కాబట్టి ఆత్మ అనేది అనంత చతుష్టాత్మకమైనది. కాని కర్మలవల్ల మాలిన్యమవుతున్నది. ఈ కారణం చేత పైన చెప్పిన అనంతదర్శనము మొదలైనవన్నీ పరిమితమవుతున్నాయి. అత్యంత ప్రయత్నం చేసి ఈ కర్మలను కడిగి వేసినట్లైతే, ఆత్మ తన సహజ స్థితిని పొందుతుంది. దీన్నే "సిద్ధావస్థ" అంటారు. కర్మలవల్ల కలిగిన పరమాణువులు ఆత్మలో ప్రవేశిస్తాయి. అది ఎలా అంటే పాలలో నీరులాగా, నూనెలో నెయ్యిలాగా ఆ మాలిన్యాలు ఆత్మలో ప్రవేశించి ఉంటాయి. ప్రతికర్మకీ ఫలితము అనేది ఉంటుంది. దాన్నించి తప్పించుకోవటం ఎవరికీ సాధ్యం కాదు. జైన ధర్మాన్ని ఆచరిస్తేనే అది సాధ్యమవుతుంది. కర్మ ఉన్నంతవరకు ఆత్మకు మాలిన్యం ఉంటుంది. ఆత్మకి మాలిన్యంఉంటే అజ్ఞాని అవుతుంది. అజ్ఞానంతో తనే అంటే ఆత్మే దేహము అని భావించటం జరుగుతుంది. ఈ కారణంచేతనే దేహానికి కలిగే సుఖదుఃఖాలన్నీ తనవిగా భావిస్తుంది. నిర్మలమైన జ్ఞానము కావాలి అంటే కర్మనంతటినీ కడిగి వెయ్యాలి. అయితే జైన సిద్ధాంతంలో కర్మకి ఆకారం ఉన్నది. దాన్ని జ్ఞాని మాత్రమే చూడగలడు.

ఇక్కడ ఇంకొక విషయం ఏమిటంటే జీవాత్మలు రెండు రకాలు 1. సంసారాత్మలు 2. ముక్తాత్మలు. సంసారాత్మలు మళ్ళీ రెండు రకాలుగా ఉంటాయి. 1. స్థావరములు 2. జంగమములు (చలనములు) స్థావరములు మళ్ళీ ఐదు రకాలు 1. భూమి 2. జలము 3. తేజస్సు 4. వాయువు 5. వనస్పతి. వీటిని కాయములు అంటారు. జీవులు వారి వారి పూర్వజన్మల కర్మ ఫలితాన్ని అనుసరించి ఈ జన్మలో శరీరాన్ని ధరిస్తాయి.

**2. అజీవము :** అజీవము ఐదు రకాలు అవి 1. ధర్మము 2. అధర్మము 3. ఆకాశము 4. పుద్గలము 5. కాలము.

**1. ధర్మము :** ఇక్కడ ధర్మము అంటే మనం చెప్పే ధర్మం కాదు. దీనివల్ల జీవులకు చలనశక్తి కలుగుతుంది. ధర్మముయొక్క ఉనికివల్లనే చలనము ఏర్పడుతుంది. చేప కదలటానికి నీరు ఏ రకంగా ఆధారమో, అలాగే జీవుల చలనశక్తికి ధర్మం ఆధారం. లోకమంతా ధర్మాన్ని ఆశ్రయించే ఉంటుంది. ధర్మము ఒకచోటి నుంచి ఇంకో చోటికి కదలదు. అది చలనము లేనిది. కాని జీవుల చలనశక్తికి కారణమవుతున్నది.

**2. అధర్మము :** ఇది పురుషుణ్ణి స్తంభింపచేస్తుంది. అతడు ముందుకు సాగిపోకుండా అరికట్టి జడపదార్థంగా చేస్తుంది. ధర్మము గతిస్వభావం కలిగి ఉండగా అధర్మం స్థితి స్వభావం కలిగి ఉంటుంది. ఇది మనం చెప్పే అధర్మము, పాపము వంటిది కాదు ప్రపంచమంతా వ్యాపించి ఉంటుంది. ధర్మానికి మల్లేనే అధర్మం కూడా జీవజడములకు ఉపకారి. అధర్మము జీవుల చలనాన్ని నిరోధించి, వాటికి విశ్రాంతి ఇస్తుంది. అధర్మమే గనక లేకపోతే జీవులకు విశ్రాంతి అనేది ఉండదు. నిరంతరము తిరుగుతూనే ఉంటాయి. ధర్మాధర్మాలు ఏవీ కూడా ఇంద్రియాలకు కనిపించవు కాని ఇవి రెండూ సర్వవ్యాపకాలు.

**3. ఆకాశము :** అవకాశం ఇచ్చేది ఆకాశం. ఇది రెండు రకాలు 1. లోకాకాశము 2. అలోకాకాశము

**1. లోకాకాశము :** లోకంలోని సమస్తాన్ని తనయందు ఇముడ్చుకొన్న దాన్ని లోకాకాశము అంటారు. ఇక్కడ సమస్తము అంటే ధర్మాధర్మాలు, కాలము, ద్రవ్యము, జీవులు, నైశ్చల్యము, నియామకము.

**2. అలోకాకాశము :** లోకాకాశానికి పైన శూన్యంగా ఉన్న దాన్ని అలోకాకాశము అంటారు. మొత్తంమీద ఆకాశము సర్వగతము, నిత్యము.

**4. పుద్గలము :** శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు పుద్గలము యొక్క లక్షణాలు. విభజించటానికి వీలు లేనటువంటి ప్రాథమిక ద్రవ్యశకలాన్ని అణువు అంటారు. ఇది విభజించటానికి వీలు లేకుండా, ఆది మధ్య అంతములు కలిగి ఉంటుంది.

దానికి స్పర్శ, రూపము, రసము, గంధములు గుణాలు. జైనమతంలో భూమి మొదలైన అణువులకు వేరువేరుగా ఆ జాతి గుణాలుంటాయి. అయితే వాటికి ఆ గుణాలు ఒక్కొక్కటే ఉంటాయి. కాని జైనమతంలో ప్రతి అణువుకు అన్ని గుణాలు ఉంటాయి.

**5. కాలము :** ఇది సూక్ష్మకణాత్మకము. కణాలు విభజించటానికి వీలు లేకుండా, అసంఖ్యాకంగా ఉంటాయి. ఇక్కడ గం॥ ని॥ సె॥ మొ॥న హద్దులు గల కాలాన్ని **'సమయ'** అంటారు. ఆద్యంత రహితమైన దాన్ని కాలము అంటారు.

విశ్వానికి మూలమనేది లేదు. ఈ జగత్తు సత్యమా? లేక నశించిపోయేదా? జగత్తు దానిలో ఉన్న పదార్థాలు ఒక్కొక్కటిగా భావిస్తే అది శాశ్వతమే. ఇలా మొత్తం కాకుండా, వేరు వేరు భాగాలుగా భావించినప్పుడు, ఆ క్షణంలో మార్పు వస్తోంది. కాబట్టి అవి వినాశం పొందేవే అని గుర్తించాలి.

**జ్ఞానము :** జైనమతంలో జ్ఞానము ఐదు రకాలు. జ్ఞానానికి ఐదు ద్వారాలుంటాయి. అవి

1. మతి 2. శ్రుతి 3. అవధి 4. మనఃపర్యాయము 5. కేవలజ్ఞానము

**1 మతి :** ఇంద్రియాల చేత తెలుసుకొనే సామాన్య జ్ఞానాన్నే 'మతి' అంటారు. దీనిలోనే స్మృతి, అనుమానము, ఉపలబ్ధి, భావన, ఉపయోగము అనేవి ఉన్నాయి. జ్ఞానానికి ముందు దర్శనము ఉంటుంది. దానివల్ల వస్తువుయొక్క భౌతిక రూపం తెలుస్తుంది.

**2. శ్రుతి :** శబ్దం నుంచి గ్రహింపబడేది. సాక్ష్యము లేక సంజ్ఞల ద్వారా గ్రహించబడేది. లబ్ధి (సహకారము) భావన (శ్రద్ధ) ఉపయోగము (విషయగ్రహణం) నయము (వస్తు జ్ఞానవిశేషము) ఇవన్నీ ఇందులోనే ఉంటాయి.

**3. అవధి :** ఇతర ప్రదేశాలలో గాని, ఇతర కాలాలలో గాని ఉన్నటువంటి వస్తువులను గురించి తెలుసుకునేది. దూరశ్రవణం, దూరదర్శనం మొదలైన శక్తులకు సంబంధించిన జ్ఞానము.

**4. మనఃపర్యాయము :** దీన్నే మనోగ్రహణశక్తి అంటారు. ఇతరుల మనోభావాలు తెలుసుకునే జ్ఞానము. ఎదుటి మనిషి మనసులో ఉండే ఆలోచనలు తెలుసుకునే శక్తి.

**5. కేవలజ్ఞానము :** దీన్నే పరిపూర్ణజ్ఞానము అంటారు. వస్తువుల యొక్క రూపము, గుణము మొదలైన విశేషాలు తెలుసుకునేది. దేశకాల వస్తువుల చేత పరిచ్ఛిన్నము కానిది. సర్వజ్ఞము అతీంద్రియము అయిన ఆత్మజ్ఞాన పరాకాష్ఠ స్థితి. ఈ స్థితిలో మానవుడు శారీరక అవధులను అతిక్రమించిపోతాడు. ఇది అనుభవైక వేద్యమైన పరిపూర్ణ జ్ఞానము. పరిశుద్ధమైన ఆత్మగల పరమపురుషుల (కేవలులు)కే ఈ స్థితి కలుగుతుంది.

**స్యాత్‌వాదము (సప్తభంగీనయము)**

జైనమతంలో **'స్యాద్‌వాదము'** ముఖ్యమైనది. ఒక వస్తువుకి ఒక ధర్మం ఉన్నది అని మనం తెలుసుకోవటమే "నయ" అనబడుతుంది. అయితే మనకు తెలియని ధర్మాలు అనేకం ఆ వస్తువులో ఉండచ్చు. అందుచేత మనక తెలిసిన ధర్మం మాత్రమే ఆ వస్తువుకు ఉన్నది అని చెప్పలేం. ఈ కారణంచేత "బహుశః ఇది ఉండచ్చు" "ఇది కావచ్చు" అని చెప్పటం సరియైన పద్ధతి. ఇక విషయానికి వచ్చినట్లైతే మనకున్న జ్ఞానం చాలా తక్కువ. అందుకే మనకు తెలిసినదంతా 'నయమే'. మరి పూర్ణజ్ఞానం ఎవరికి ఉంటుందో వారు సర్వజ్ఞులు. ఈ జ్ఞానము తీర్థంకరులకు మాత్రమే ఉంటుంది.

జైనమతం ప్రకారం మన అనుభవంలోఉన్న ప్రతివిషయము, మనమే నిర్ణయం చేసినప్పటికీ, దాన్ని గురించి నిస్సందేహంగా చెప్పలేం. స్థిరమైన నిర్ణయం కూడా చెయ్యలేము. ఏ విషయమైనా చెప్పాలి అంటే "బహుశః కావచ్చు" అని చెప్పాలి. దీన్నే "స్యాత్" అంటారు. ఈ మతం ప్రకారం తత్త్వాలు అనేకాలు. తత్త్వము యొక్క స్వరూపం నిర్ణయించాలి అంటే, దానియొక్క వివిధ దృక్పథాల ద్వారానే నిర్ణయించాలి అంతేగాని ఒకే దృక్పథంతో నిర్ణయించరాదు. ప్రతివస్తువుకీ అనేక ధర్మాలుంటాయి. ఇవి మనచేత కల్పించబడినవి కాదు. నిజమైనవి. సహజంగా ఉన్నవి. ఆ ధర్మాలన్నీ ఆ వస్తువులో ఉంటాయి. అందుచేత మనం తీసుకున్న నిర్ణయాలు సత్యమైనవే కావచ్చు. అలా అని ప్రతిసారి అలాగే జరుగుతుంది అని చెప్పలేం. కొన్నిసార్లు మన నిర్ణయాలు నిజంకూడా కాకపోవచ్చు. అలాంటప్పుడు దీన్ని "తాత్కాలిక సత్యము" అంటారు. 'స్యాత్' ఏడు రకాలుగా ఉంటుంది. అవి

1. స్యాదస్తి 2. స్యాన్నాస్తి 3. స్యాదస్తినాస్తి 4. స్యాదవక్తవ్య 5. స్యాదస్తి అవక్తవ్యా 6. స్యాన్నాస్తవక్తవ్యా 7. స్యాదస్తినాస్తిఅవక్తవ్యా

**1. స్యాదస్తి:** బహుశః ఉన్నది. ఒక వస్తువు ఒకచోట ఉన్నదనుకోండి. మనం దాన్ని ఉన్నది అని చెబుతాం. కాని జైనులు అలా చెప్పరు. 'బహుశః అది ఉన్నది లేకపోతే ఉండవచ్చు' అంటారు. ఈ మతం ప్రకారం ఏదైనా వస్తువు ఉన్నది అని చెప్పాలంటే 1. పదార్థము 2. స్థలము 3. కాలము 4. స్వభావము అనే వాటిని పరిగణనలోకి తీసుకుని ఆ వస్తువు ఉన్నది అని చెప్పాలి కాని అన్ని కోణాల్లోనుంచి పరిశీలించి ఆ వస్తువు ఉన్నది చెప్పటం సాధ్యపడదు. ఉదా॥ ఒక కుండ, మట్టితో చేసినది. ఒక గదిలో ఉంది. అది ఈ సమయంలో ఉన్నది. ఇంకో సమయంలో అంటే కొద్దిసేపటి తరువాత అది అక్కడ అలాగే ఉండాలని లేదు. మనం చూసినప్పు డున్నది. ఇప్పుడు ఉండాలని లేదు అందుకే 'బహుశః ఉండవచ్చు' అంటారు.

**2. స్యాన్నాస్తి:** బహుశః లేదు. ఇందాక ఉదాహరణగా గదిలో కుండని చెప్పాం. కాని ఇంకొక దృక్పథంతో గనక చూసినట్లైతే, ఆ కుండ మట్టిది కాకపోవచ్చు. ఆ సమయంలో అది అక్కడ లేకపోవచ్చు. దాని ఆకారము, ఎత్తు, రంగు ఆ విధంగా ఉండి ఉండకపోవచ్చు. ఇందాక చెప్పిన స్థలంలో ఉండకపోవచ్చు. అంటే మొదట చెప్పిన విధంగా ఆ కుండ అక్కడ లేదు. అందుకే 'బహుశః లేదు' అని చెప్పవలసి వస్తుంది.

**3. స్యాదస్తినాస్తి:** ఉండటానికి ఉన్నది లేదు అంటే లేదు. పైన చెప్పిన నాలుగు విషయాలు 1. పదార్థము 2. స్థలము 3. కాలము 4. స్వభావము దృష్టిలో పెట్టుకుని చూసినట్లైతే ఆ వస్తువు ఉన్నదని చెప్పవచ్చు. లేదా లేదని కూడా చెప్పవచ్చు

**4. స్యాదవక్తవ్య :** బహుశః చెప్పటానికి సాధ్యపడదు. పైన మనము కుండ (ఘటము) ఒక రకంగా ఉన్నదని, ఇంకొక రకంగా అయితే లేదని చెప్పటం జరిగింది. ఇలా పరస్పరము విరుద్ధంగా ఉండే భావాలను ఒకే కాలంలో చెప్పటం సాధ్యం కాదు. అందుకే దీని అవక్తవ్యము అంటారు.

**5. స్యాదాస్తి అవక్తవ్యా :** ఇక్కడ ఉన్నది దాని వక్తవ్యము కాకపోవచ్చు. ఇందాక చెప్పిన నాలుగు విధాలయిన లక్షణాల దృక్పథంలో నుంచి అవక్తవ్యము అని రెండు భావాలు ఏర్పడతాయి. ఇక్కడ స్థితి అవ్యక్తము అనే రెండు భావాలున్నాయి.

**6. స్యాన్నాస్త్యవక్తవ్యా :** బహుశః నాస్తి అవక్తవ్యము కావచ్చు. కుండ అనేది ఇందాక చెప్పిన నాలుగు రకాలయిన లక్షణాల దృక్పథం నుంచి ఆ వస్తువు లేదు. అవక్తవ్యము ఇక్కడ భావము దాని అవక్తవ్యము అని చెప్పబడింది.

**7. స్యాదస్తినాస్తి అవక్తవ్యా :** బహుశః ఉన్నది, లేదు. అవక్తవ్యము ఒకే వస్తువు ఒక క్షణంలో ఒక దృక్పథంలో ఉన్నదని. ఇంకొక దృక్పథంలో లేదని చెప్పినట్లైతే అవక్తవ్యమని చెప్పబడింది.

ఈ ఏడింటిలోను మొదటి రెండూ ముఖ్యమైనవి. ఎందుకంటే వీటిలో మొదటిది **1 భావనిర్ణయం :** ఇందులో వస్తువు అతికష్టంమీద 'ఉన్నది' అని తెలుస్తుంది. ఇది భావనిర్ణయము అంటే మట్టితో తయారైన కుండ, ఆ కాలంలో, ఆ రూపంలో ఉన్నది అని అతికష్టం మీద సాధించిన నిర్ణయము. ఇక రెండవది **అభావ నిర్ణయము.** ఒక వస్తువు అది కుండ అనుకోండి. పరద్రవ్యంతో (మట్టిది కాదు) ఇంకొక చోట, ఇంకో సమయంలో లేదు అని చేసిన నిర్ణయము ఈ నిర్ణయాలన్నీ సదసదాత్మకాలు, భావాభావాలు, ఉన్నవి లేనివి, తానైనది తాను కానిది అని రెండు రకాలుగా ఉంటాయి. ఇక్కడ విచిత్రం ఏమిటంటే లోకంలో కుందేలు అనేది ఉంది. కొమ్ము కూడా ఉంది. ఈ రెండూ విడివిడిగా అయితే ఉంటాయి. కాని కలిసి మాత్రం ఉండవు. అదే కుందేటి కొమ్ము. ఈ జగత్తులో గాలినేడలు, కుందేటి కొమ్ము వంటివి ఉండవు. అందుకే 'స్యాదస్తినాస్తి' ఉండను ఉంది. లేను లేదు. అనబడుతుంది. ఈ రకంగా స్యాత్ వాదంలో మొదటి రెండూ ముఖ్యమైనవి. మూడవదాన్ని కూడా కొంతవరకు అంగీకరించాల్సిందే కాని మిగిలినవాటికి అంత ప్రాముఖ్యత లేదు.

జైనమతం ప్రకారము దేన్నీ ఖచ్చితంగా చెప్పటానికి వీలులేదు. ఇది ఇంతే కావచ్చు. ఇంకేమైనా కావచ్చు అని మాత్రమే చెప్పగలము. ఇక్కడ గుర్తుంచుకోవలసిన విషయం ఏమిటంటే ఒకే వ్యక్తి ఒకరికి తండ్రి, ఒకరి కొడుకు, ఒకరి అన్న. ఒకరికి తమ్ముడు. అంటే ఈ జగత్తులోని ప్రతివస్తువుకూ మిగిలిన వస్తువులతో ఏదో ఒక రకంగా సంబంధం ఉంటుంది. దాన్ని మనం ఖచ్చితంగా చెప్పగలుగుతాము. కాని జైనులు చెప్పరు. ఉదాహరణకి బల్లమీద ఒక పుస్తకం ఉంది. మనం అదే మాట చెబుతాం. కాని జైనులు మాత్రం అలా చెప్పరు. "బహుశః బల్లమీద పుస్తకం ఉన్నది" అంటారు. దీనికి కారణం ఏమంటే అన్ని కాలాలలోను పుస్తకం బల్లమీద

ఉండదు కదా. ఇంకో ఉదాహరణ చూడండి. బంగారాన్ని మనం బంగారం అనే అంటాం. కాని ఇది బంగారం కావచ్చు అని జైనులంటారు. ఎందుకంటే ఇందులో బంగారమే కాకుండా ఇతర పదార్థాలు లేదా ద్రవ్యాలు అందులో ఉండచ్చు. ఈ కారణంచేత ఇది బంగారమే అని నిశ్చయంగా చెప్పటం కష్టం.

**కర్మసిద్ధాంతం :** జైనమతం ప్రకారం కర్మ అంటే మనం చేసే పనికాదు. సామాన్యంగా మనం చేసే పనులని కర్మ అంటాం. కాని ఇక్కడ కర్మ అంటే పనులు కాదు. కర్మ ద్రవ్యరూపమైనది. అది ఇంద్రియగోచరము కాని అతిసూక్ష్మకణాల సముదాయము. ఈ పదార్థంతోనే జగత్తంతా నిండి ఉంది. అనాది నుంచి వస్తున్న ఈ ద్రవ్య సంపర్కదోషం వల్లనే జీవి ప్రస్తుతజన్మని అనుభవిస్తూ, ఇంకా కొత్త ద్రవ్యాన్ని సంపాదించుకుంటున్నాడు. మనోవాక్కాయముల వ్యాపారంతో జీవుడిలో కొన్ని కణాలు లేదా అణువులు ప్రవేశిస్తున్నాయి. ఈ కర్మపదార్థంవల్లనే శరీరం ఏర్పడుతున్నది.

జీవిని ఆశ్రయించిన ఈ కార్మిక ద్రవ్యము అనేక కార్యాలని ప్రేరేపిస్తుంది. ఇక్కడ కర్మ 1. భౌతిక స్వభావముగల ద్రవ్యమని 2. మానసిక స్వభావం గల ద్రవ్యము అని రెండు రకాలు. జీవుడు సిద్ధావస్థ పొందే వరకు క్రొత్త కర్మ పదార్థం అతనిలో ప్రవేశిస్తూనే ఉంటుంది. అలాగే జీవిలో నుంచి కొంత పదార్థం బయటకి పోతూ ఉంటుంది. జీవుడు ముక్తావస్థ చేరేదాకా ఈ పదార్థం (కర్మ) అతడిలో ఉంటుంది. జీవుడు ముక్తుడైతే, ఈ కర్మ కొంచెం కూడా అతనిలో ఉండదు. ఈ కర్మవల్లనే జీవుడు మరణానంతరము పుణ్యపాపాల ననుసరించి జన్మలు ఎత్తుతాడు. హిందువుల లాగానే జైనులు కూడా కర్మ సిద్ధాంతాన్ని అంగీకరిస్తారు.

జీవులు కర్మనుంచి విముక్తి పొందటానికి రెండు మార్గాలున్నాయి. 1. మనోవాక్కాయ కర్మలతో రాగద్వేషాలు ఆత్మలో ప్రవేశిస్తాయి. దీన్నే **అస్రవము** అంటారు. కాబట్టి అవి ప్రవేశించకుండా అరికట్టటము. ఇదే అస్రవాన్ని అరికట్టటము అంటారు. 2. కర్మలు ఆత్మలో ప్రవేశించకుండా నిరోధించటం. దీన్ని **సంవరము** లేదా నిరోధము అంటారు. ఈ రెండు పద్ధతులూ ఆచరణలోకి తేవలసిందే.

జైనమతం ప్రకారము ముక్తిని కోరేవారు ఆత్మని అంటిఉన్న కర్మపంకిలాన్ని పూర్తిగా కడిగి వేయ్యాలి. దీనికి తపస్సు, ధర్మాచరణ (పుణ్యకార్యాలు) వైరాగ్యము, తత్త్వచింతన కావాలి. జైనమతంలో రక్షకుడు అనేవాడు ప్రత్యేకంగా ఎవరూ లేరు.

కాబట్టి మనం చేసిన పాపాలను క్షమించటం అనేది ఉండదు. అలాగే భక్తుడికి గాని, కర్మయోగికి గాని ప్రత్యేకస్థానము, గౌరవము లేవు. జైనమతంలో నైతిక ప్రవర్తన, సర్వభూతదయ ముఖ్యమైనవి. వీరు పూర్తిగా అహింసావాదులు. హానికరమైన పాము, తేలు వంటి వాటిని కూడా చంపరు. రాత్రి సమయంలో దీపం వెలిగిస్తే, దానిచుట్టూ పురుగులు చేరి చచ్చిపోతాయి కాబట్టి దీపం కూడా వెలిగించరు. నేలమీద నడిచేటప్పుడు కాళ్ళక్రింద పడి క్రిమికీటకాలు చచ్చిపోతాయి కాబట్టి, నేలని ఊడుస్తూ నడుస్తారు. దానము, సత్యము, ఉపవాసము వంటి వాటిని పరమధర్మంగా పాటిస్తారు.

జైనులలో శ్వేతాంబరులు, దిగంబరులు అని రెండు శాఖలున్నాయి. పార్శ్వనాథుడు శ్వేతాంబరశాఖని, వర్ధమానమహావీరుడు దిగంబరశాఖని వ్యాప్తి చేశారు. ముక్తపురుషులు లోకాన్ని జయించిన వారు కాబట్టి 'జినులు' అనబడతారు. అలాగే లోకాన్ని తరింపజేసేవారు 'తీర్థంకరులు' జైనమతంలో వర్ణవ్యవస్థ ఉన్నది. కాని వ్యక్తియొక్క యోగ్యతను బట్టి వర్ణనిర్ణయం చేస్తారు. మానవుడు పాపం చెయ్యటానికి ఉన్న ఎనిమిది కారణాలలోను వర్ణము ఒకటి. అందుచేత ఆ వర్ణవ్యవస్థను నశింపచేయనివాడు జినుడు కాలేడని వారి వాదన. వీళ్ళు హిందూ ధర్మంలోని వర్ణవ్యవస్తని తీవ్రంగా వ్యతిరేకిస్తారు. జైనమతంలోని దిగంబరుల ప్రకారం స్త్రీకి మోక్షం లేదు. అయితే శ్వేతాంబరులు స్త్రీకి కూడా మోక్షమున్నది అంటారు. జైనమతంలో స్త్రీ సన్యాసినులు కూడా ఉండేవారు. జైనులకి కూడా మంత్రాలు, తంత్రాలు, యోగము, మహిమలు ఉన్నాయి.

**సిద్ధావస్థ:** జైనమతం ప్రకారం జీవులు సిద్ధావస్థలో ఏ విధమైన కర్మ లేకుండా, సచ్చిదానంద స్వరూపులై ఉంటారు. ఆ సమయంలో ఆత్మకి పుణ్యము కాని, పాపము కాని ఉండరాదు. ఈ మతంలో ప్రతిమానవుడు ఒక దేవుడే అని చెప్పచ్చు. ఎందుకంటే ఆత్మకి తన సహజ రూపమైన 1. అనంతదర్శన 2. అనంతజ్ఞాన 3. అనంత సంతోష 4. అనంత వీర్యములు గలవారై ఉంటారు. వాస్తవంగా చూసినట్లైతే అనంత శబ్దంతో చెప్పబడేవన్నీ ఒకే వస్తుస్వరూపాలు. ముక్తి పొందినవారు మిగిలిన వారి ముక్తికోసం పాటు పడతారు. చివరకు ఈ ముక్తులు, ముక్తులు నివసించే లోకం చేరి అనంత చతుష్టయానుభూతితో స్థిరంగా ఉంటారు. సంపూర్ణ దుఃఖనాశనమే

మోక్షము. జైనమతాన్ని, హిందూధర్మాన్నీ పోల్చి చూసినట్లైతే ఉపనిషత్తులలో చెప్పే ఆత్మకీ, జైనుల ఆత్మకీ తేడా చాలా తక్కువ. ఉపనిషత్తులలో ఆత్మ ఒక్కటే. కాని జైనుల ఆత్మలు అనేకాలు. ఇదే ఈ రెండింటికీ మధ్య గల తేడా. ఇక్కడ గమనించ వలసిన విషయం ఇంకోటుంది. ముక్తాత్మల యందు కర్మలేశము కూడా ఉండరాదు అన్నారు జైనులు. ఆత్మలయందు లింగభేదం లేదు. ముక్తి పొందిన వారందరూ సచ్చిదానంద స్వరూపులే. ఒక ఆత్మకు ఇంకొక ఆత్మకు తేడా లేనప్పుడు, ఇన్ని ఆత్మలున్నాయని చెప్పటం వీలుకాదు. అనంత చతుష్టయం కలిగినది కూడా అనంతమైనదే. అంతే కాని పరిచ్ఛిన్నమైనది కాదు. ఈ పరిచ్ఛిన్నత అనేది మాయవల్ల కలుగుతోంది. అలాగే జైనులు చెప్పే అపరిచ్ఛిన్నత కూడా అనాత్మవల్లే కలుగుతుంది. అనాత్మ సంబంధం లేని ఆత్మలు పరిచ్ఛిన్నమైనవి కావు. ఈ రకంగా జైనమతమంతా అద్వైతాన్నే బోధిస్తున్నది.

జైనమతంలో ఐదుగురు ప్రసిద్ధమైన తీర్థంకరులున్నారు. వారు 1. పూర్ణకాశ్యపుడు 2. మక్ఖలిగోశాలి 3. అజితకేశకంబళుడు 4. ప్రకృథకాత్యాయనుడు 5. సంజయవేలట్టి పుత్రుడు. వీరందరూ విడివిడిగా దర్శనాలు వ్రాశారు. వీరి దర్శనాలకే 'తీర్థంకరదర్శనము' అని పేరు.

**పూర్ణకాశ్యపుడి** దర్శనాన్ని **అహేతుక వాదము,** అక్రియవాదము అన్నారు. ఆత్మకర్మ చెయ్యదు. ఆత్మకు కర్తృత్వ, భోక్తృత్వాలతో సంబంధం లేదు. కాబట్టి మంచి పనిచేసినా, అది ఆత్మకి అంటుకోదు. హింసకీ, అహింసకీ, పుణ్యానికీ, పాపానికీ తావు లేదు. అబద్ధమాడటం, పరస్త్రీ సంగమం, మాంసభక్షణలాంటివి ఏవి చేసినా పాపం అంటదు. యజ్ఞము, తపస్సు, దానము, సత్యము, సంయమనము వంటి కర్మలద్వారా పుణ్యం రాదు అంటాడు పూర్ణకాశ్యపుడు. ఇతని బోధనలు పామరజనాన్ని బాగా ఆకర్షించాయి. కాని నైతిక జీవనం సాగించే వారిని ఆకర్షించ లేకపోయినాయి.

**మక్ఖలిగోశాలుడు** అజీవక సంప్రదాయానికి చెందిన తీర్థంకరుడు. అజీవకులు అంటే ప్రత్యేక నియమాలతో జీవనం సాగించేవారు. వీరు కఠిన నియమాలు పాటిస్తూ, సమస్త జీవరాశి పట్ల మిక్కిలి దయచూపేవారు. మద్యమాంసాలు నిషేధించారు. అనాయాచితంగా లభించిన దానితో జీవితం గడిపేవారు. ఇతరులను కష్టపెట్టేవారు

కాదు. వస్తువులన్నీ నశిస్తాయి. తిరిగి జన్మిస్తాయి. ఇది వారి సిద్ధాంతం. దీన్నే పరివర్తన వాదము అంటారు. అన్ని ప్రాణులు, పదార్థాలు మారతాయి. మార్పు చెందే ప్రతిదానికీ ప్రాణమున్నది. రాళ్ళు, రప్పలు, గాలి, నీరు కూడా ప్రాణం కలిగి ఉన్నాయి. ప్రతి పదార్థానికీ ఇంద్రియాలుంటాయి. కొన్నింటికి ఒకే ఇంద్రియం ఉంటుంది. మరికొన్నింటికి మూడు లేదా ఐదు ఇంద్రియాలుంటాయి. దేవతలకు ఆరు ఇంద్రియాలుంటాయి. జీవి ఒక జన్మ తరువాత ఇంకొక జన్మ ఎత్తుతుంది. అయితే సంస్కారం పొందిన జీవిమాత్రమే శుద్ధిపొంది దుఃఖం నుంచి విముక్తి చెందుతుంది అదే ముక్తి దీన్నే **'సంస్కారశుద్ధివాదము'** అంటారు. కేవలం చావుపుట్టుకల వల్ల జీవిశుద్ధుడవుతాడు. శుద్ధుడైనజీవికి దుఃఖం ఉండదు అని గోశాలుడు బోధించాడు. ఇతడి బోధనల ప్రభావం కొంతవరకు తరువాత కాలంలో వచ్చిన బుద్ధుడి మీద పడింది.

**అజితకేశకంబళుడు** దానం, యజ్ఞం, హోమాలు వృధా అని, వీటివల్ల పొందేదేమీ లేదని చెప్పాడు. మంచి చెడు, పుణ్యపాపాల ఫలితమే స్వర్గనరకాలు అన్నాడు. అంతే స్వర్గనరకాలను చూసినవాళ్ళు లేరు. జీవులన్నీ నాలుగు భూతాల కలయిక వల్లనే ఏర్పడ్డాయి. వీటి కలయిక గనక విడిపోతే మరణం సంభవిస్తుంది. మరణించిన తరువాత ఆత్మ ఉన్నదనుకోవటం అవివేకం అని బోధించాడు. ఈ వాదాన్ని **'ఉచ్ఛేదవాదము'** అన్నారు.

**ప్రకృథకాత్యాయనుడి** దర్శనాన్ని **'సప్తకాయవాదము'** అన్నారు. నేల, నీరు, నిప్పు, గాలి, సుఖం, దుఃఖం, జీవం అనేవే ఆ ఏడు పదార్థాలు. ఆత్మ అకర్త అని ఇతడి భావన.

**సంజయవేలట్టి పుత్రుడు** ఏది మంచో, ఏది చెడో మనకు తెలియదు. మనం అనుకున్నట్లుగాక వేరే విధంగా జరిగితే మనం బాధ పడతాం. పరలోకము, కర్మ ఆత్మ మొదలైన వాటిని గురించి ఇదమిత్థంగా ఏమీ చెప్పలేము అన్నాడు. అందుకే ఇతడి వాదాన్ని **సందేహవాదము, నిక్షేపవాదము** అన్నారు.

మొత్తంమీద తీర్థంకరులందరూ కర్మవల్ల ప్రయోజనం లేదు అన్నారు. పుణ్యపాపాలు, స్వర్గనరకాలు లేవన్నారు. ఆ రోజుల్లో బహుళ ప్రచారంలో ఉన్న వైదిక మతానికి విరుద్ధమైన భావాలను వీరు ప్రకటించారు. వీరి ప్రభావం బుద్ధుడి మీద చాలావరకు ఉంది.

# 9. బౌద్ధదర్శనం

బౌద్ధమతాన్ని ప్రచారం చేసినవాడు బుద్ధుడు. కపిలవస్తు నగరాన్ని పాలించిన శాక్యవంశస్థుడైన శుద్ధోధనమహారాజు కుమారుడు. బుద్ధుని తల్లి మాయాదేవి. బుద్ధుని చిన్నతనంలో శుద్ధోధనుడు జ్యోతిష్కులను రావించి ఇతని జాతకం అడిగాడట. అప్పుడు వారు ఈ కుమారుడు మహర్జాతకుడు. అయితే గొప్పచక్రవర్తి కావాలి లేదా పరివ్రాజకశిరోమణి కావాలి. అన్నారట. చివరకు జ్యోతిష్కులు చెప్పినట్లుగానే పరివ్రాజకశిరోమణి అయినాడు బుద్ధుడు. బుద్ధుడు అంటే – క్లేశాలు, ఉపక్లేశాలు మహాక్లేశాల నుంచి విముక్తుడైనవాడు అని అర్థం. క్లేశము అంటే పాళీభాషలో- ప్రమాదము, భ్రమ అని అర్థం. అసలు పేరు **సిద్ధార్థుడు.** బుద్ధుడు తన సూత్రాలన్నీ పాళీభాషలో వ్రాశాడు.

బుద్ధుడు జన్మించిన కాలంలో పరిస్థితులన్నీ అస్తవ్యస్తంగా ఉండేవి. ఆ రోజుల్లో ప్రజలు వేదాలను అత్యంతప్రమాణంగా అంగీకరించేవారు. అలాంటి వారికి సంఘంలో ప్రత్యేకమైన స్థానం ఉండేది. దేశంలో వైదిక కర్మకాండ ఆచరణలో ఉండేది. వేదాలలో కూడా బ్రాహ్మణులకు అత్యంత ప్రాముఖ్యత ఉండేది. బ్రాహ్మణ ధర్మాలను అనుసరించేవారు తక్కువ కులాలవాళ్ళని హీనంగా చూసేవారు. యజ్ఞయాగాదులలో చేసే పశుహింస హింసకాదని అనేక జంతువులను యజ్ఞంలో బలి ఇచ్చేవారు. కొంతమంది ఘోరమైన తపస్సే పరమపురుషార్థమని భావించి, అడవులలో తపస్సు చేస్తుండేవారు. కఠోర నియమాలు పాటించి శరీరాన్ని శుష్కింప చేసేవారు. మండుటెండలో ఒంటికాలి మీద నుంచుని జపంచేసేవారు. దొంగ సన్యాసులు బయలుదేరి గృహస్థులను మోసంచేస్తున్నారు. పరలోకంలేదని, దేవుడు లేడని, పునర్జన్మలేదని చెబుతుండేవారు.

ఆత్మ ఉన్నదా ? లేదా ? పరలోకం సంగతి ఏమిటి ? స్వర్గ నరకాలున్నాయా? ఈ ప్రశ్నలకు సమాధానాలు గందరగోళంగా ఉండేవి. దేవుడున్నాడని, అతడే సర్వశక్తి సంపన్నుడని, అతడే సృష్టికర్త, సర్వనియంత, సర్వసాక్షి అని కొందరు, దేవుడున్నాడో లేదో తెలియదని, మానవుడే సర్వశక్తి సంపన్నుడని, మానవుణ్ణి మించిన శక్తి. ఇంకోటి లేదని, కొందరు వాదిస్తుండేవారు. తత్త్వవిచారణ చేసేవారు కొందరైతే,

దాన్ని ఖండించే వారు కొందరు. మోక్షమున్నదని కొందరు, లేదని కొందరు, మోక్షాన్ని తొందరగా పొందలేమని కొందరు వాదించేవారు. ఈ బిక్షువులు, పరివ్రాజకులు, తీర్థంకరులు, బ్రాహ్మణులు, గణికులు, సంశయవాదులు, జడవాదులు, అంతా బయలుదేరి తమ వాదాలే పరమ సత్యమని ప్రజలకు బోధించేవారు. అటువంటి సమయంలో నేపాల్ ప్రాంతంలోని కపిలవస్తునగరాన్ని రాజధానిగా చేసుకుని రాజ్యం చేస్తున్న సూర్యవంశపు రాజు శుద్ధోధనుడికీ, అతని భార్య మాయాదేవికి 'లుంబినీ' వనంలో క్రీస్తు పూర్వం 567లో బుద్ధుడు జన్మించాడు. బుద్ధుడు జన్మించిన ఏడవరోజునే అతని తల్లి మరణించింది. ఇతనిపేరు సిద్ధార్థుడు. సంకల్పించినపని నెరవేరే వరకు ప్రయత్నం చేసేవాడు అని అర్థం. ఇతడికి 'సర్వార్థసిద్ధి' అనే పేరు కూడా ఉంది.

సిద్ధార్థుడికి అన్ని విద్యలు నేర్పించి యశోధర అనే అందమైన కన్యతో వివాహం చేశాడు శుద్ధోధనుడు. అయితే సిద్ధార్థుడి భార్య పేరు గోప, గోపిదేవి అని 'లలిత విస్తారము' అనే గ్రంథములో వ్రాయబడింది. సుఖంగా సంసారం చేస్తున్న సిద్ధార్థుడు ఒకరోజున నగరం చూట్టానికి వెళ్ళాడు. త్రోవలో ఒక వృద్ధుడు కనుపించాడు. అతడు నడవలేకుండా ఉన్నాడు. శరీరం ముడతలు పడిపోయింది. కళ్ళు కనపడటం లేదు. చెవులు వినపడటం లేదు. అడుగు పడటం లేదు. ఇంకొంత దూరం వెళ్ళిన తరువాత ఒక కుష్ఠురోగి కనిపించాడు. ఇంకొంత దూరం వెళ్ళిన తరువాత ఒకమృతదేహం కనుపించింది. అంత్యక్రియలు చెయ్యటానికి దాన్ని తీసుకుపోతున్నారు. ఈ మూడు దృశ్యాలు చూసిన సిద్ధార్థుడి మనస్సు వికలమై పోయింది. తాను చూసిన దృశ్యాలను గురించే ఆలోచిస్తున్నాడు. నెమ్మదిగా భోగములందు విరక్తి కలిగింది. జీవితం మీద విరక్తి కలిగింది. క్రమేణా ఆధ్యాత్మిక చింతన, తత్త్వవిచారణ, మొదలైంది. అసలు దేవుడనే వాడున్నాడా ? ఉంటే జీవులు కష్టాలు పడుతుంటే ఎందుకు చూడడు? లోకమంతా దుఃఖమయమై ఉంది. ఆ దుఃఖాన్ని నివారించటం ఎలా ? జగత్తులో అంతా నశించేదే. నాశరహితమైనది ఏది ? సత్యాన్వేషణ చెయ్యాలంటే ఇంట్లో ఉండకూడదు. ఇల్లు వదిలిపెట్టి పోవాలి. అని ఆలోచించి ఒకరోజు అర్థరాత్రి ఎవరికీ చెప్పకుండా భార్య యశోధర, కుమారుడు రాహులుడు వీరిని వదిలి తన ఇరవైతొమ్మిదవఏట సత్యాన్వేషణ కోసం బయలుదేరాడు.

బింబిసారుని రాజ్యంలోగల రత్నగిరికొండ మీద ఒక గుహలో ఉండి ఉపనిషత్తులు అభ్యసించాడు. తృప్తి కలగలేదు. బింబిసారుడు యజ్ఞ చేస్తున్నాడు. ఆ యజ్ఞం కోసం కొన్ని గొర్రెలను తోలుకుపోతున్నారు. అందులో ఒకదాని కాలు విరిగి నడవలేక పోతోంది. సిద్ధార్థుడు ఆ గొర్రెను భుజాన వేసుకుని బింబిసారుడి దగ్గరకు పోయి, అహింసను గురించి అతనికి చెప్పి, ఆ యజ్ఞం మాన్పించాడు. హిరణ్వతీ నదీ తీరంలో నివసిస్తున్న 'నాకాద కాలమనుడు' అనే ఋషి దగ్గర సకల శాస్త్రాలు నేర్చుకున్నాడు. అక్కడే సిద్ధార్థుడికి 1. కౌండిన్యుడు 2. అశ్వజితుడు 3. భద్రకుడు 4. వప్రుడు 5. మహానాముడు అనే వారు శిష్యులైనారు. ఆ శిష్యులతో కలిసి గయలో నిరంజనానది ఫల్గుణనదితో కలిసే చోట కోతులు రాల్చినవి, చిలకలు కొరకగా క్రింద పడిన పండ్లు తింటూ ఆరు సంవత్సరాలు తపస్సు చేస్తూ సత్యాన్వేషణ చేశాడు. అన్నపానాదులు లేకపోవటం వల్ల శక్తి లేక ఒకరోజున క్రిందపడి మూర్ఛపోయాడు. అప్పుడు అతని శిష్యులు చూసి తపోభంగమైనందువల్లే ఇలా జరిగింది అని భావించి వాళ్ళు తమ గురువును అలా వదిలి వెళ్ళిపోయారు. కొంతసేపటికి అటుగా పోతున్న గొర్రెలకాపరి సిద్ధార్థుణ్ణి చూసి, పాలు పోసి అతన్ని బ్రతికించాడు. ఆరు సంవత్సరాలు పూర్తయినా సిద్ధార్థుడికి సత్యము తెలియలేదు.

ఒకరోజున సిద్ధార్థుడు ఒక పొదమాటున తపస్సు చేసుకుంటుండగా అటువైపుగా వెడుతున్న దేవదాసీలు తమలో తాము మాట్లాడుకుంటున్నారు. అందులో ఒకావిడ "వీణవాయించేటప్పుడు హెచ్చు తగ్గులు లేకుండా శ్రుతి సవరించాలి. తీగను గట్టిగా బిగిస్తే తెగిపోతుంది. బిగువు తక్కువైతే సరిగా మ్రోగదు. కాబట్టి కావలసినంత వరకే తీగను బిగించాలి" అంది. ఆ మటలు విన్నాడు సిద్ధార్థుడు. అవి తన కోసమే భగవంతుడు దేవదాసి ముఖతః చెప్పించాడు అని భావించాడు. శరీరం నాశనమయ్యేంత తపస్సు పనికిరాదు. అన్నపానాదులు లేకపోతే శరీరము, మనసు కూడా పని చెయ్యవు. కాబట్టి అంత కఠినమైన తపస్సు పనికి రాదని నిశ్చయించుకున్నాడు. ఆ సమీపంలో ఉన్న పల్లెలో ఉండే ఒక భూస్వామికి పిల్లలు లేరు. ఆయన భార్య తనకు పిల్లలు పుడితే వనదేవతకు పాయసం సమర్పిస్తానని మొక్కుతుంది. ఆమె పేరు సుజాత. ఆమెకు పిల్లవాడు పుట్టాడు. దాంతో పాయసం పిల్లవాణ్ణి తీసుకుని అడవికి వెళ్ళింది. అక్కడ పొదమాటున కూర్చున్న సిద్ధార్థుణ్ణి

చూసి, అతడే వనదేవత అనుకుని పాయం సమర్పించి, పిల్లవాణ్ణి ఆశీర్వదించమంది. ఇంతలో పిల్లవాడు పాకుతూ, ప్రక్కనే ఉన్న బోధివృక్షం దగ్గరకు పోయాడు. సిద్ధార్థుడు ఆ పిల్లవాణ్ణి ఎత్తుకుని ఆశీర్వదించి, ఆ చెట్టు క్రింద పూర్ణజ్యోతి ప్రత్యక్షమయ్యేదాకా అక్కడ నుంచి కదలను అని ప్రతిజ్ఞ చేసి, ధ్యానంలో కూర్చున్నాడు. ఇక్కడ విచిత్రం ఏమిటంటే బుద్ధగయలో ఉన్నది రావిచెట్టు. పుస్తకాలలో వ్రాసింది మర్రిచెట్టని ఏది ఏమైనప్పటికీ గయలో ఒక చెట్టుక్రింద సిద్ధార్థుడు 'బోధము' పొందాడు. బోధము అంటే జ్ఞానము. అప్పటి నుంచీ అది బోధివృక్షమయింది.

సిద్ధార్థుడు బుద్ధభగవానుడయిన రాత్రి ఆయన అనేక విషయాలను చూశాడని బౌద్ధగ్రంథాలు వ్రాశాయి. అనేక పాపాలు ఆయన్నిచుట్టు ముట్టినాయి. అందమైన అప్సరాంగనలు ఆయన చుట్టూ తిరుగుతూ నాట్యం చేశారు. యశోధర వచ్చి దీనాతి దీనంగా విలపించింది. ఇలా అనేక విషయాలు చూశాడు. అయితే మొదటి జాములో సిద్ధార్థుడు తన పూర్వజన్మలను, రెండవజాములో సమస్త లోకాలను, మూడవ జాములో ప్రతీత్యసముత్పాదాన్ని చూశాడని, నాల్గవజాములో నిర్వికల్పమైన సర్వజ్ఞస్థితిని పొందాడని అశ్వఘోషుడు 'బుద్ధచరిత్ర'లో వ్రాశాడు. సిద్ధార్థుడు దేనికోసం సమస్త భోగాలు వదలుకున్నాడో, దేనికోసమైతే పడరాని కష్టాలు పడ్డాడో, అది, ఆ అమృతము ఆయనకి ఆ రోజున వైశాఖ పూర్ణిమనాడు రాత్రి లభించింది. సిద్ధార్థుడు బుద్ధుడైనాడు.

వారణాసి దగ్గర **"ఋషిపతనమృగదానము"** అనే చోట తన ఐదుగురు శిష్యులకు బౌద్ధదీక్ష నిచ్చాడు. అక్కడే అశోకుడు సారనాథ స్థూపాన్ని నిర్మించాడు. ఆ తరువాత కపిలవస్తు నగరానికి వెళ్ళి తన తండ్రి శుద్ధోదనుడికి, భార్య యశోధరకు, కుమారుడు రాహులుడికీ బౌద్ధదీక్ష ఇచ్చాడు.

**బౌద్ధమతం :** ఆ కాలంలో ఉన్న సాంఘిక పరిస్థితులు, మూఢనమ్మకాలు, విశ్వాసాలు, ఆచరణలు నిశతంగా పరిశీలించాడు బుద్ధుడు. ప్రజలు మనోనిగ్రహం కోసం కఠినమైన నియమాలు పాటించేవారు. అర్థం తెలియకపోయినా మంత్రాలు కంఠస్థం చేసేవారు. యోగాసనాలు వేసేవారు. ఒంటి కాలిమీద నిలబడి తపస్సు చేసేవారు. వీటన్నింటినీ పరిశీలించిన బుద్ధుడు ఆద్యంతాలు లేని వాదోపవాదాలు, తాత్త్విక సిద్ధాంతాలు మానవుణ్ణి దుఃఖసాగరం నుంచి విముక్తి చేయలేవని గుర్తించాడు.

వేదాలు అపౌరుషేయాలని ఒప్పుకోలేదు. మాధవసేవ కన్న మానవసేవయే మిన్న అని గుర్తించాడు. యజ్ఞయాగాదులతోను, కర్మకాండతోను, పురోహితులతోను, స్వర్గనరకాలతోను ప్రమేయం లేని ఒక నూతన సిద్ధాంతాన్ని ప్రబోధించాడు. మానవుడు హృదయ పరివర్తన, అంతఃకరణ శుద్ధి, దయ, మనోనిగ్రహం మొదలైన నైతిక విలువలు కలిగి ఉండాలి. శీలం, సత్యం జీవకారుణ్యం, ధర్మాచరణ అనేవి బుద్ధుని బోధనలలో ముఖ్యాంశాలు. గతంలో లేనటువంటి ధర్మదీక్షకు ప్రాధాన్యత నిచ్చాడు. బౌద్ధమతంలో దైవప్రసక్తి, వాదనకోసం చేసే తత్త్వవిచారణలకు తావులేదు. ఈ లక్షణాలు బౌద్ధమతానికి ప్రత్యేక స్థానాన్నిచ్చి, బహుళ జనాదరణ పొందేటట్లు చేశాయి. అసంఖ్యామైన ప్రజలు, రాజులు కూడా బౌద్ధాన్ని స్వీకరించారు. విపరీతమైన వాదాలు, విరుద్ధభావాలు ఎక్కువగా ఉన్న ఆ రోజులలో బౌద్ధం ఒక దివ్యతేజస్సు అయింది. బుద్ధుడు హేతువాది అయినప్పటికీ తర్కాలద్వారా ఇతరుల భావాలు. సిద్ధాంతాలు ఖండించటం ఇతని ధ్యేయం కాదు. దేవతలతోనూ, అతీతశక్తుతోను సంబంధం లేకుండా సహజమైన పద్ధతిలో, జనసామాన్యానికి అర్థమయ్యే రీతిలో సత్యాన్ని పరిశీలించటానికి ప్రయత్నం చేసి **హేతువాది** అయ్యాడు. తాను చెప్పదలచుకున్న విషయాలు అనుమానం లేకుండా స్పష్టంగా చెప్పాడు. తాను నమ్మినసత్యంద్వారా లోకంలో దుఃఖాన్ని రూపుమాపటానికి ప్రయత్నించాడు. బుద్ధుడు అన్ని భావాలను, సిద్ధాంతాలను తీసుకుని, నిశతంగా పరీక్షించి, పరీక్షలో తట్టుకుని నిలబడ్డ వాటినే ప్రచారం చేశాడు. తాను నమ్మిన సత్యాలనే శిష్యులకు బోధించాడు.

**లక్షణత్రయము :** ప్రపంచంలో ఉన్న పదార్థాలన్నింటిలోనూ, అనుభవాలన్నింటి లోనూ కూడా మూడు లక్షణాలుంటాయనే మూల విశ్వాసం బౌద్ధమతంలో కనిపిస్తుంది. వీటినీ బౌద్ధ లక్షణత్రయం అంటారు. అవి 1. దుఃఖము 2. అనిత్యము 3. అనాత్మ

**1. దుఃఖము :** దుఃఖము యొక్క స్వరూపం కాని, స్వభావం కాని, అందరికీ అంత తేలికగా అర్థంకావు. అవి **అర్హాతులకు** మాత్రమే అర్థమవుతాయి. కొన్ని దుః ఖాలు ప్రత్యక్షంగా కనిపిస్తాయి. అయితే ఈ దుఃఖాలకు రోగము, ముసలితనము, మరణము అనేవి కారణాలు. దుఃఖమనేది అందరికీ ఉంటుంది. అది సర్వసామాన్యం. భౌతిక శరీరమే దుఃఖమయము. ఏది దుఃఖమయమో అది ప్రతికూలం. ఏది

అనుకూలమో అది దుఃఖమయం కాదు. ఈ లోకంలో నిర్వాణం మినహా అన్నీ ప్రతికూలాలే, దుఃఖమయాలే కాబట్టి ప్రతికూలమైన దాన్ని నిషేధించాలి. ఈ లోకంలో మనకు అన్నీ ప్రతికూలమూ కావు, అనుకూలమూ కావు. మనలో త్యాగబుద్ధి లేనంత కాలం, నిర్వాణం పొందాలన్న కోరిక లేనంతకాలం సత్యం తెలుసుకోలేం. రాగద్వేషాలు, మోహం ఉన్నంతకాలం అనుకూలంగా కనిపించే ప్రతికూలాలను పొందటానికి ప్రయత్నిస్తాము. నిరాశ నిస్పృహలు మనలను ఏమీ చెయ్యలేవు. నిరాశ పెరిగితే పట్టుదల కూడా పెరుగుతుంది. దాంతో మోహం ఇంకా పెరుగుతుంది. దీనివల్ల కలిగేదంతా దుఃఖమే. ప్రాపంచిక సుఖాల అసలు స్వరూపం తెలియక, వ్యామోహంలో పడి నిర్వాణ సుఖాన్ని, శాంతిని మరిచిపోతాం. నిర్వాణమనేది అనిర్వచనీయమైనఆనందస్థితి. కాబట్టి నిర్వాణన్ని కోరేవారు ప్రాపంచిక సుఖాలను మరిచిపోవాలి. లోకంలో సుఖంగా కనిపించేవేవీ సుఖాలు కావు. అవన్నీ దుఃఖ కారకాలు, క్షణికమైన సుఖాన్నిస్తాయి. కాని ఆ తరువాత తీరని దుఃఖాన్ని మిగులుస్తాయి. నిర్వాణమనేది శాశ్వతమైన ఆనందం. అర్హాతులు ప్రాపంచిక సుఖాలు చూసి దుఃఖపడతారు. అవి దుఃఖ కారకాలని వారు గుర్తిస్తారు. ప్రాపంచిక సుఖాలకు నిర్వాణం భిన్నంగా ఉంటుంది. దుఃఖమే భయం, దుఃఖమే అశాంతి అదే భ్రమ, శ్రమ కూడా. ఈ దుఃఖాన్నే 'భవము' అన్నారు బౌద్ధులు.

**2. అనిత్యం :** ఈ జగత్తులో అన్నీ అనిత్యమే. ఏదీ శాశ్వతం కాదు అన్నాడు బుద్ధుడు. దీన్నే క్షణభంగురవాదము అన్నారు. ఈ జగత్తులో కారణం లేకుండా ఏదీ జరగదు అంటూ అనిత్యాన్ని కార్యకారణ సంబంధంతో ముడి వేశారు బౌద్ధులు. ప్రతి సంఘటనకీ వెనక ఏదో ఒక కారణం ఉండి తీరుతుంది. వృద్ధిక్షయాలు కారణం లేకుండా జరగవు. పుట్టిన ప్రతిదీ గిట్టక మానదు. నశించిన ప్రతిదీ మళ్ళీ పుట్టక మానదు. పుట్టిన ప్రతివస్తువు కొంతకాలంపాటు పెరుగుతుంది. ఆ తరువాత నశిస్తుంది. దీన్నే ధర్మం అంటారు. జగత్తులో అన్నీ ధర్మానుగుణంగానే నడుస్తాయి. అయితే బౌద్ధులవాదం ఉపనిషత్తుల వాదంతో సరిపోదు. మనస్సు అనేది ఒక ప్రవాహం లాంటిది చిత్తవృత్తి అనేక భావాల పరంపరల వల్ల ఏర్పడుతుంది. ఈ జగత్తులో ప్రతిదీ క్షణికమే. అంతా క్షణభంగురమే ప్రపంచానికి ఆద్యంతాలు అనేవి లేవు. జగత్తులో ఒక పదార్థం నుంచి ఇంకొక పదార్థం పుడుతుంది. అంతేకాని

శూన్యం నుంచి మాత్రం కాదు. ప్రతిజీవికీ జనన మరణాలు సహజం. వీటి మధ్యన అనేక మార్పులు జరుగుతాయి. ఈ మార్పులు అనిత్యం, క్షణికం. స్వధర్మంతో గాని, అతీంద్రియ శక్తులతోగాని ఏ వస్తువూ హటాత్తుగా ఊడిపడదు. ప్రతి కదలికకూ, స్థితికీ, సంఘర్షణకు ఏదో ఒక కారణం తప్పనిసరిగా ఉంటుంది. ఆ కారణం మనకి కనిపించాలని ఏమీ లేదు. ఒక్కోసారి కనిపిస్తుంది. ఒక్కోసారి కనిపించదు. మనకి కనిపించినంత మాత్రాన కారణం లేదని మాత్రం కాదు. అతీతశక్తుల వల్ల గాలిలో నుంచి వస్తువులు పుడతాయని చెప్పటం అవివేకం. పదార్థంలో మార్పు అనేది ఒక్కసారిగా రాదు. అది ప్రతిక్షణం మార్పు చెందుతూనే ఉంటుంది. క్షణంలో జరిగే మార్పు మనం గుర్తించలేం. **బుద్ధఘోషుడు** జీవిత ప్రమాణం గురించి వివరిస్తూ ఒక ఆలోచన అంటే భావన మనస్సులో ఎంతవరకూ ఉంటుందో అంతకాలమే జీవితకాల ప్రమాణం ఉంటుంది. ఒక ఆలోచన నశించిన తరువాతనే వేరొక ఆలోచన వస్తుంది. ఈ రెండు ఆలోచనల మధ్య ఖాళీ ఉండదు. అలా రెండు ఆలోచనల మధ్య ఖాళీ లేనప్పుడు అది పరంపరగానే ఉంటుంది. ప్రతివస్తువుకు, పదార్థానికి పుట్టుక, స్థితి, జర, మరణం (నిరోధం) అనే లక్షణాలుంటాయి. ఈ లక్షణాల వల్లనే ప్రతివస్తువూ, ప్రతి క్షణం మారుతూ ఉంటుంది. అయితే ఈ విషయం మీద బౌద్ధులకు ఏకాభిప్రాయం లేదు. ఈ లక్షణాలు పదార్థంలో ఒకేసారి ప్రవేశిస్తాయని సర్వాస్తివాదులు, ఒకదాని తరువాత ఒకటి వస్తాయని సౌతాంత్రికులు, రకరకాలుగా చెప్పారు. భౌతిక పదార్థాలలో నిరంతరం జరిగే మార్పునే అనిత్యము లేక శూన్యము అన్నారు.

**3. అనాత్మ:** జగత్తులో సర్వమూ అనాత్మ అనేది బౌద్ధంలో మూడవ లక్షణం. బుద్ధుడి కాలం నాటికి వైదిక, బ్రాహ్మణమతాలు "ఈ ప్రపంచానికి మూలం అవిద్య" అని చెప్పాయి. ఈ అవిద్య అనేక రకాలుగా ఉంటుంది. శరీరం అశాశ్వతం. శరీరంకన్న వేరైన శాశ్వతమైన పదార్థం ఇంకొకటి ఉన్నది, అనే వాదనను బౌద్ధులు అవిద్య అన్నారు. ఈ అవిద్య నశిస్తే గాని నిర్వాణం ప్రాప్తించదు. మనం చేసే "పనులన్నింటికీ కర్తగా, భోక్తగా శాశ్వతమైన ఆత్మ ఒకటి ఉన్నది. అది ఒక జన్మ నుంచి ఇంకొక జన్మకి కర్మఫలాన్ని తీసుకువస్తుంది." అని నమ్మటం అవివేకం అన్నారు. పరలోకం లేదు, కర్మఫలం లేదు అనే చార్వాకుల సిద్ధాంతాన్ని నమ్మలేదు.

శరీరము, జీవుడు వేరనే సిద్ధాంతాన్ని, శాశ్వతమైన ఆత్మ ఉన్నదనే సిద్ధాంతాన్నీ బుద్ధుడు అంగీకరించలేదు. ఆత్మ, శరీరం వేరని భావించే వారు ఆత్మశాశ్వతం అని నమ్ముతారు. జ్ఞానంవల్లనే ఆత్మానందం వస్తుంది అంటారు. కాబట్టి వీరికి బ్రహ్మచర్యం, సత్యం, అహింస వంటి నైతిక విలువలతో ప్రయోజనం లేదు. కేవలం జ్ఞానం కోసమే ప్రయత్నిస్తారు. కాని ఆత్మలేదు అంటే కొంతమంది మిథ్యాదృష్టికి లోబడి సత్కార్యాలు చెయ్యటం మానేస్తారు. వీటివల్ల ప్రమాదమున్నది. అందుకే ఆత్మ ఉన్నదా ? లేదా అనే విషయంలో బుద్ధుడు మౌనం పాటించాడు. ఈ రెండు వాదాలూ సరైనవి కావని బుద్ధుడి నమ్మకం. అందుకే ఈ రెండు వాదాలకూ తటస్థంగా "మధ్యమ మార్గాన్ని" బోధించాడు.

**ఆర్యసత్యచతుష్టయము :** సత్యాన్వేషణ కోసం ఇంటి నుంచి వెళ్ళిపోయిన బుద్ధుడు కొన్ని విషయాలను గ్రహించాడు. వాటినే ఆర్యసత్యాలు అంటారు. అవి 1. దుఃఖము 2. దుఃఖ సముదాయము 3. దుఃఖ నిరోధము 4. దుఃఖ నిరోధమార్గము. ఈ నాలుగే ఆర్యసత్యాలు.

**1. దుఃఖము :** లోకంలో సర్వం దుఃఖమయమని చెప్పాడు బుద్ధుడు. తల్లి గర్భంలోంచి భూమ్మీద పడేటప్పుడు తల్లీ, బిడ్డ పడే వేదన అంతా దుఃఖం. బాల్యంలో దుఃఖం. సంసారం దుఃఖం ముసలితనం మరీ దుఃఖం. అవయవాలు పట్టుతప్పుతాయి. ఇంకొకరి మీద ప్రతిదానికీ ఆధారపడాలి. తీరని కోరికల వల్ల దుఃఖం. తీరిన కోరికలు శాశ్వత ఆనందానివ్వవు కాబట్టి దుఃఖం. ఈ రకంగా దేహము, భావాలు, సంకల్పాలు అన్నీ దుఃఖాలే. కోరికలన్నీ దుఃఖకారణాలే. నిర్వాణమే జన్మకి తరుణోపాయము. సంసారానికి ఆది అంతము లేవు. అలాగే దుఃఖానికి కూడా ఆది లేదు కాని అంతం ఉన్నది. మానవులు కోరికలకు దాసులవటం వల్లనే నిర్వాణం పొందలేకుండా ఉన్నారు. రాగద్వేషాలను జయించనంత వరకు నిర్వాణానికి అర్హులు కారు. సంసార సాగరమే దుఃఖపూరితము. లోకమంతా దుఃఖసాగరంలో కొట్టుకుపోతూ ఉండగా జ్ఞానజ్యోతులకోసం జనం ఎందుకుప్రయత్నించరు? అని అడిగాడు బుద్ధుడు.

**2. దుఃఖ సముదాయం :** ఇదే దుఃఖ కారణమయిన అజ్ఞానము. మనం అనుభవించే దుఃఖానికి కారణమున్నది. అదే అజ్ఞానము. జనన మరణ కారణాలను

వివరిస్తూ అవి దుఃఖానికి ఎలా దారి తీస్తామో ఇక్కడ చెప్పబడింది. వస్తువుయొక్క ఉనికి గాని, దానిలో జరిగే మార్పుల గాని ఆ వస్తువు యొక్క అస్తిత్వాన్ని తెలియచేస్తాయి. ఆ వస్తువు అస్థిత్వం మీదనే దాని మార్పు, వినాశం ఆధారపడి ఉంటాయి. వస్తువు పుట్టినప్పుడే, దాని వినాశబీజాలు కూడా అందులోనే ఉంటాయి. అందుకే ప్రతిపదార్థం నశించి తీరుతుంది. నశించటం అంటే అస్థిత్వంలో మార్పు. ప్రతివస్తువూ తాను నశించటానికి ముందే, మరొక రూపాన్ని పొందటానికి కావలసిన పునాదులు వేసుకుని మరీ నశిస్తుంది. అంటే క్రొత్తగా వచ్చిన వస్తువు పాతదాన్నుంచి వచ్చిందే కాని, క్రొత్తది కాదు. పాతరూపానికీ, క్రొత్త రూపానికీ పోలికలుండాలని లేదు. సాధారణంగా కొన్ని పోలికలుంటాయి. ఇదే వస్తువుల ధర్మం. ఏ వస్తువుకూ సొంత అస్థిత్వము లేదు. అవస్థానుక్రమమే వస్తుస్వరూపం. ఈ జగత్తులో వస్తువులన్నీ ఒక దాని మీద ఒకటి ఆధారపడి ఉంటాయి. దీనివల్ల వస్తువుల ఉనికి స్వభావం మారుతుంది. వస్తువుయొక్క ధర్మం దానిలోనే సూక్ష్మంగా నిక్షిప్తమై ఉంటుంది. వస్తువు సూక్ష్మావస్థ నుంచి స్థూలావస్థకు ఎలా వచ్చేదీ ఈ వాదన వివరిస్తుంది. ఈ వాదం దుఃఖానికి గల కారణాలను వివరిస్తుంది.

**3. దుఃఖ నిరోధం :** ప్రపంచం అంతా దుఃఖమయము అని మొదటి ఆర్య సత్యం, ఆ దుఃఖానికి కారణమున్నదని రెండవ ఆర్యసత్యం చెబుతున్నాయి. దీనివల్ల ఇదంతా కార్యకారణ దృష్టితో జరిగిందని అర్థం అవుతోంది. అయితే కారణాన్ని నివారించటం ద్వారా కార్యాన్ని నివారించవచ్చు అనే భావాన్ని మూడవ సత్యం చెబుతున్నది అంటే దుఃఖ కారణాన్ని నివారించటం ద్వారా దుఃఖాన్ని నివారించవచ్చు అంటాడు బుద్ధుడు. మిగిలిన మతాలు కూడా దుఃఖానికి కారణమున్నదని అంగీకరించాయి. దుఃఖము ఆదిదైవికం, ఆది భౌతికం, ఆధ్యాత్మికం అని మూడు రకాలు అంటారు సాంఖ్యులు. వైదిక మతము, దర్శనాలు దుఃఖాన్ని కర్మ సిద్ధాంతంతో ముడిపెట్టాయి. పునర్జన్మ, కర్మ సిద్ధాంతాల ద్వారా దుఃఖాన్ని జన్మజన్మలకు పంపిణీ చేశారు. దుఃఖనివారణకు నైతిక విధానం ఒక మార్గం. భగవంతుడి అనుజ్ఞతోనే దుఃఖ నివారణ అవుతుందని ఒక్క అద్వైతులు తప్ప అందరూ ఒప్పుకున్నారు. కాని బుద్ధుడికి ఇవేవీ రుచించలేదు దుఃఖమనేది దైవాధీనం కాదనీ, దాన్నుంచి తప్పించుకునే ఉపాయం మన చేతుల్లోనే ఉందనీ, చెప్పాడు. దుఃఖాన్ని నివారిస్తేనే నిర్వాణప్రాప్తి

జరుగుతుంది అన్నాడు. దీనికి హేతుబద్ధమైన నైతిక మార్గం సూచించాడు. దుఃఖ నివారణ దైవాధీనంకాదు కాబట్టి, దుఃఖాన్ని ఈ జన్మలోనే నివారించవచ్చు అన్నాడు బుద్ధుడు.

**4. దుఃఖనిరోధమార్గము :** ఆర్యసత్యాలలో ఇది నాల్గవది. దీనిలో ఎనిమిది అంగాలున్నాయి. అందుకే దీన్ని **అష్టాంగమార్గము** అన్నారు. ఈ మార్గమే దుఃఖ నిరోధానికి సోపానము. బౌద్ధుల నీతి, మానవ మనస్తత్వం మీద ఆధారపడి ఉంటుంది. ప్రతి కార్యానికి మూడు అంశాలుంటాయి. అవి 1. సంకల్పం చెయ్యటం 2. కార్యం 3. ఫలితం, సంకల్పం గనక మంచిదైతే, అది నెరవేరకపోయినా శీలాభివృద్ధికి తోడ్పడుతుంది. మంచి సంకల్పం మంచి ఫలితాన్నే ఇస్తుంది. ఇక కర్మలు రెండు రకాలు 1. రాగద్వేషాలు లేనివి పవిత్రకర్మలు. ఇవి అహంకార మమకారాలను నశింపచేసి, నిర్వాణమార్గం చూపుతాయి. మంచి కర్మలు పుణ్యాన్నిస్తాయి. 2. స్వార్థంతోను, కామంతోను, సుఖలాలసతోను చేసేవి అపవిత్ర కర్మలు ఇవే చెడు కర్మలు. దుఃఖాన్నిస్తాయి.

బుద్ధుడు అపరిమితమైన రాగద్వేషాలు, వైరాగ్యము పనికి రావన్నాడు. సత్యాన్వేషణ చేసేవాడు విపరీత మార్గాలు అనుసరించరాదు. కామానికి దాసుడు కారాదు. సుఖలాలసత పనికి రాదు. అలాగే ఉపాసన ద్వారా శరీరాన్ని శుష్కింప చేసుకోరాదు. మధ్యేమార్గమే శ్రేయోమార్గం ఇదే అష్టాంగ మార్గం.

**అష్టాంగమార్గము :** ఇది ఎనిమిది మార్గాల సమాహారం. 1. సమ్యక్‌దృష్టి 2. సమ్యక్ సంకల్పం 3. సమ్యక్ వచనం 4. సమ్యక్ కర్మ 5. సమ్యక్‌జీవనం 6. సమ్యక్ వ్యాయామం 7. సమ్యక్‌స్మృతి 8. సమ్యక్ సమాధి. అసలు సమ్యక్ అనే పదానికి అన్నీ, లెస్సగా, సరియైన చక్కగా అని అర్థం. మంచి దృష్టి, మంచి సంకల్పం, మంచి మాట, మంచి పని, మంచి నడవడి, మంచి వ్యాయామము, మంచి ఆలోచన. ఇవే అష్టాంగ మార్గము.

**1. సమ్యక్‌దృష్టి :** ఆర్యసూత్రాలను చక్కగా అర్థం చేసుకోవటమే సమ్యక్‌దృష్టి. నూరు సంవత్సరాలు అగ్నిని ఉపాసన చేసేవారి కన్న, ఒక్కరోజు సక్రమంగా ప్రవర్తించే వారే గొప్పవాళ్ళు అన్నదే బౌద్ధసూక్తి. జీవులన్నింటి యందు దయ, ప్రేమ కలిగి

ఉండటమే సమ్యక్ దృష్టి. హోమాలు, దానాలు, సురాపానం వంటివి భ్రాంతిని కలిగిస్తాయే గాని మానవుణ్ణి శుద్ధి చేయలేవు.

**2. సమ్యక్ సంకల్పం :** సమ్యక్‌దృష్టే సమ్యక్ సంకల్పానికి దోహదం చేస్తుంది. మనం చేసే పనులన్నీ మన ఆలోచనలను బట్టే ఉంటాయి. చెడ్డ ఆలోచనలున్న వాళ్ళు చెడుపనులు, మంచి ఆలోచనలున్న వాళ్ళు మంచి పనులు చేస్తారు. మనలో చెడుభావాలు తొలగిపోవాలి అంటే ముందుగా సమ్యక్‌దృష్టి అలవరచుకోవాలి. అన్ని విషయాలు చక్కగా అర్థం చేసుకుని, జీవులన్నింటి యందు దయ, ప్రేమ గలిగి ఉండాలి. ఇప్పుడు మనం చెయ్యదలచుకున్న పనులు, సంకల్పాలు మంచివా? చెడ్డవా ? అని ఆలోచించి మంచి సంకల్పాలనే ఎన్నుకోవాలి. అంటే సమాజానికి ఉపయోగపడే పనులే చెయ్యాలి. దీనికోసం అవసరమైతే కఠోరమైన నిర్ణయాలు తీసుకోవాలి. అలా చెయ్యాలంటే మనోనిగ్రహం, ఆత్మస్థైర్యం కావాలి. ఎట్టి పరిస్థితులలోను ధైర్యాన్ని కోల్పోకూడదు. సమ్యక్ సంకల్పంవల్లనే సుగుణాలన్నీ సాధించవచ్చు. కాబట్టి వాటన్నింటికీ సమ్యక్ సంకల్పం ప్రథమ సోపానం.

**3. సమ్యక్‌వచనం :** సమ్యక్ సంకల్పం నుంచే సమ్యక్ వచనం వస్తుంది. చక్కని సంకల్పానికి చక్కని మాటలు మరింత మంచి రూపాన్నిస్తాయి. చక్కని మాటే సంఘంలో మనిషికి పేరు ప్రతిష్ఠ, గౌరవం తెచ్చి పెడుతుంది. మంచి మాటల ద్వారానే మానవుల మధ్య మంచి సంబంధాలు నెలకొంటాయి. ఎప్పుడైతే మంచి మాటలే మాట్లాడుతూ ఉంటామో, అప్పుడు మంచి ఆలోచనలే చెయ్యాలి. అనే భావన కూడా వస్తుంది. మన మాటలు భావాలను ప్రతిబింబింప చేస్తాయి. అందుకే బౌద్ధులు సత్యవచనానికి ఎక్కువ ప్రాధాన్యత నిచ్చారు. ఎటువంటి పరిస్థితులలోనూ పరుషవాక్యాలు పలకరాదు. అబద్ధంఆడరాదు. అనవసరమైనవిషయాలు మాట్లాడరాదు. వాక్కును నిగ్రహించుకోవాలి. ఇది మానసిక ప్రశాంతత నిస్తుంది. మానసిక నిగ్రహాన్ని కలిగిస్తుంది. అందుకే భర్తృహరి **వాగ్భూషణమె భూషణంబు** అన్నాడు. అలాగే భారతంలో **సూనృతవాక్యము మేలు చూడగన్** అన్నారు.

**4. సమ్యక్‌కర్మ :** సమ్యక్‌కర్మ అంటే మంచిపని. చక్కటిపని అని అర్థం. మనం ఏ పని చేసినా అది పదిమందికీ ఉపయోగపడేటట్లు ఉండాలి. ఇలాంటి పనులు

మనిషిని గొప్పవాడుగా చేస్తాయి. మంచిశీలము, ప్రవర్తన అనేవి నిర్వాణానికి సోపానాలు. అహింస, బ్రహ్మచర్యం, అస్తేయం (దొంగతనము చెయ్యకుండా ఉండటము) అనేవి పవిత్రశీలాన్ని పెంచుతాయి. శీలం లేనివారికి నిర్వాణం సిద్ధించదు. మోసము, దంభాచారాలు లేని కర్మలే నిర్వాణానికి మార్గాలు. బాహ్యప్రవర్తనే కాదు. అంతఃప్రవర్తన కూడా పవిత్రంగా ఉండాలి.

**5. సమ్యక్‌జీవనము :** ఇదే సక్రమమైన జీవనం. జీవనాధారం. ఉపనిషత్తులలో చెప్పినట్లుగా ఆహారశుద్ధిని బౌద్ధులు అంగీకరించారు. ఆహారశుద్ధివల్ల మానసిక శుద్ధి ఏర్పడుతుంది. శ్రమపడి ఆహారాన్ని సంపాదించుకోవాలి. ఆహారం విషయంలో ఇతరులకు బాధ కలిగించరాదు. హింస పనికిరాదు. అంటే శాఖాహారము, పవిత్రమైన ఆహారాన్నే తీసుకోవాలి. హింసని బౌద్ధులు పూర్తిగా ఖండించారు.

**6. సమ్యక్‌వ్యాయామం :** మానసికమైన ఉద్రేకాలను నిగ్రహించేందుకు ఇది దోహదం చేస్తుంది. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలనే అరిషడ్వర్గాలు మనసును ఉత్తేజపరుస్తాయి. దురాలోచనలు దూరం చేసి, మంచి ఆలోచనలను ప్రోత్సహించాలంటే వ్యాయామం అవసరం. దురాలోచనలను అణచెయ్యకపోతే అవి మనసంతా పాడుచేస్తాయి. మనసును మంచిభావాలతో నింపటానికి బుద్ధుడు ఉపాయపంచకాన్ని చెప్పాడు. అవి ఐదు విధాలు.

1. మనసుని మంచి భావంతో నింపాలి.

2. దురాలోచనలు ఏవీ కార్యరూపంలోకి రానీయకూడదు.

3. దురాలోచనలను మనసునుంచి దూరం చెయ్యాలి.

4. దురాలోచనలకు కారణాలను నిశతంగా పరిశీలిస్తే అవి మనసు నుంచి దూరమవుతాయి.

5. మనోబలాన్ని నిగ్రహించి, అంతఃకరణ బలాన్ని పెంచాలి.

**7. సమ్యక్‌స్మృతి :** ఇంద్రియాల శక్తిని అణచివేయటానికి ఉపయోగించేది సమ్యక్‌స్మృతి. ఇదే సత్యాన్వేషణకు అభ్యాసం. దీనివల్ల ముందు మంచిమనః ప్రవృత్తి కలుగుతుంది. బౌద్ధమతంలో ప్రార్థనలకు బదులుగా ధ్యానానికి ప్రాముఖ్యత నిచ్చారు. ధ్యానాన్ని నాలుగు దశలుగా విభజించారు.

**1. ఏకాంతవాసం :** ధ్యానానికి ఏకాంతవాసం ముఖ్యమైనది. ఈ స్థితిలో ఆత్మవిమర్శ జరుగుతుంది. అంతర్దృష్టి వృద్ధి చెందుతుంది.

**2. చిత్తశాంతి :** ఈ దశలో చిత్తశాంతికి తగిన సాధనసంపత్తిని సమకూర్చుకుని, ఉత్సాహంతో ధ్యానంచేస్తూ ఆనందం పొందుతారు.

**3. అహంకారం లేకపోవటం :** ఈ దశలో వాంఛలన్నింటినీ అరికట్టి సుఖశాంతులు పొందుతారు.

**4. పూర్ణశాంతి :** ఇది సమాధిస్థితి. ఇదే ధ్యానానికి పరమావధి. సమ్యక్స్మృతివల్ల ధ్యానం వస్తుంది. మనోనిగ్రహం ద్వారా ప్రాణికోటి మీద అనురాగం ఏర్పరచు కోవాలని, తద్వారా సర్వసమతాభావం సిద్ధిస్తుందని బౌద్ధుల భావన. ధ్యానమనేది కామాన్ని తగ్గించి ఇంద్రియ నిగ్రహానికి తోడ్పడుతుంది. ధ్యానం చాలా గొప్పదని భావించారు బౌద్ధులు. సమాధిని పొందగోరేవారు ధ్యానంతో ప్రారంభించి వివేకాన్ని, విచారాన్ని పొంది, కోరికలు, మోహము, సుఖము వదలివెయ్యాలి.

**8. సమ్యక్ సమాధి :** ఇంతవరకు చెప్పిన వాటన్నింటినీ ఆచరిస్తేనే ధ్యానం సిద్ధిస్తుంది. ధ్యానం ద్వారానే సమాధి స్థితికి చేరుకోగలం. అతీంద్రియ శక్తులు సాధించటానికి చేసే యోగాభ్యాసం, కోరికలతో చేసే మంత్రతంత్రాలు సరైనవి కాదన్నాడు బుద్ధుడు. వింతలు చెయ్యటకోసం, ఇతరులను ఆకర్షించటం కోసం చేసే యోగశక్తిని బుద్ధుడు నిరసించాడు. సమాధిస్థితి పరమానందాన్నిస్తుంది అన్నాడు. నైతికవిలువలకు బౌద్ధమతంలో అత్యంత ప్రాముఖ్యత ఉన్నది. ఆ నైతిక విలువల సాక్షాత్కారరూపమే సమ్యక్సమాధి.

**ప్రతీత్యసముత్పాదవాదము :**

సిద్ధార్థుడు బోధివృక్షం క్రింద కూర్చుని జ్ఞానియైనాడు. ఆ తరువాత మానవ జీవితానికి తృష్ణేకారణము అని చెప్పాడు. దుఃఖానికి కారణమైన తృష్ణ, దానికి కారణమైన జరామరణాలు, వాటికి కారణమైన అవిద్య బుద్ధుడికి గోచరించాయి. మిగిలిన కారణాలు కూడా అవగతమైనాయి. అవిద్య దుఃఖానికి మూలకారణంగా గోచరించింది. జన్మ ఉన్నప్పుడే జరామరణాలు కలుగుతాయి. జన్మ గనక లేకపోతే అవి ఉండవు. "ఇదంతా దుఃఖమని తెలుసుకున్నాను. అది అశ్రవ(దోష)

సముదాయమని, ఇది అశ్రవనిరోధమని, ఇది అశ్రవ విరోధగామిని ప్రతిపత్ (జ్ఞానం) అని నేను తెలుసుకున్నాను" అని భోదిసత్త్వుడే స్వయంగా ప్రకటించాడు.

బౌద్ధమతంలో **ప్రతీత్యసముత్పాదము** చాలా ముఖ్యమైనది. ఇది జీవుడి యొక్క ఉత్పత్తి, నాశనములను తెలుపుతుంది. ఇది పన్నెండు విధాలు.

1. అవిద్య - వేదాంతులు చెప్పే నేను అనే అవిద్య
2. సంస్కారము - పాపపుణ్యాల ఫలితము
3. విజ్ఞానము - నామరూపాలను తెలియచేసేది
4. నామరూపాలు - విజ్ఞానము నామరూపాలను, నామరూపాలు విజ్ఞానాన్ని పోషిస్తాయి. ఇవి పరస్పర ఆధారభూతాలు
5. షడాయతనములు - ఇంద్రియాలు ఐదు. మనస్సు ఒకటి. మొత్తం ఆరు.
6. సంయోగము - ఇదే స్పర్శ. ఇంద్రియాల వల్ల ఏర్పడుతుంది.
7. వేదన - అనుభవము
8. కామము - ఇదే తృష్ణ. ఇది వేదనవల్ల ఏర్పడుతుంది.
9. సంగమము - సంయోగశక్తి, ఉపాదానము, మోహము. జీవించాలనే కోరిక.
10. పరిణామము - ఇదే 'భవము' పునర్జన్మకి కారణమైన కర్మ
11. జన్మ - ఇదే పునర్జన్మ
12. జరామరణాలు - జీవితంలో ఆఖరున కలిగేవి

ఇవన్నీ వరుసగా ఒకదానివల్ల ఇంకొకటి కలుగుతాయి. 'ప్రతీత్యసముత్పాదన' అంటే ఒక వస్తువు నాశనమయితే దాని స్థానంలో ఇంకొకటి ఉత్పత్తి అవుతుంది. ఇప్పుడు చెప్పిన పన్నెండు పదార్థాలలోనూ వరుసగా ఒకటి నశిస్తే రెండవది పుడుతుంది. ఇదంతా ఒక ప్రవాహంలాగా సాగిపోతుంది. వీటిలో ఏదీ, దేనికీ కారణము కాదు, కార్యము కాదు. ఈ ధర్మాలన్నీ తమకు తామే కారణాలు. వీటిని ఎవరూ పుట్టించరు. ఇవి స్వయంగానే పుడతాయి. కాని ముందున్న పదార్థం లేకపోతే తరువాత పదార్థం ఉత్పన్నం కాదు. ఇవన్నీ అనిత్యాలు, క్షణభంగురాలు. దుఃఖం నుంచి విముక్తి కావాలంటే జననమరణాల వలయం నుంచి తప్పించుకోవాలి.

అంటే జీవితంనుంచి పారిపొమ్మని కాని, ఆత్మహత్య చేసుకోమని కాని అర్థం కాదు. జీవితానికి భయపడి పారిపొమ్మని బౌద్ధం చెప్పలేదు. జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కో గలిగినప్పుడే జననమరణాల వలయం నుంచి తేలికగా తప్పించుకోగలం.

అవిద్య అన్ని అనర్థాలకు మూలం. జరామరణాల వల్ల లభించిన పునర్జన్మలో అవిద్య నిక్షిప్తంగా ఉంటుంది. ఈ అవిద్యను గనక నిర్మూలించగలిగితే దుఃఖం సగంపైగా నాశనమై పోతుంది. కాబట్టి అవిద్యానిర్మూలనం అన్నింటికన్నా ముఖ్యం. అయితే అవిద్యానిర్మూలనం అంత తేలిక కాదు. ఒక జన్మలో జరగదు. అవిద్య చెట్టుకు తల్లివేరు లాంటిది. తల్లివేరును నాశనం చేస్తే, చెట్టంతా నాశనమై పోతుంది.

ఆర్యసత్యాలను తెలుసుకోకపోవటమే అవిద్య. భూతభవిష్యద్వర్తమానాలను తెలుసుకోకపోవటం కూడా అవిద్యే. దీన్నే **'విపర్యాసము'** అని కూడా అంటారు. దుఃఖము, దుఃఖ కారణాలు తెలుసుకుని, వాటి నుంచి వైదొలగటానికి ప్రయత్నించాలి. **సత్కాయదృష్టి** అంటే శాశ్వతమైన ఆత్మ ఉన్నదని అది ఒక జన్మనుంచి ఇంకో జన్మకు వస్తుందని భావించటం. ఈ సత్కాయదృష్టే అవిద్య. ఇది సత్యాన్ని మరుగుపరుస్తుంది. అవిద్య కారణంగా మానవుడు చేసే కర్మల ఫలితాన్నే **'సంస్కారము'** అంటారు. ఈ సంస్కారాలు రెండు రకాలు 1. పుణ్యసంస్కారాలు 2. అపుణ్యసంస్కారాలు. సంస్కారము అంటే కర్మఫలం అని అర్థం. అందుకే ఇవి పుణ్యకర్మలు, పాపకర్మలు.

**ధర్మాచరణము :** బౌద్ధగ్రంథాలలో **'ధర్మపదము'** అనే గ్రంథం ప్రసిద్ధమైనది. ప్రతి బౌద్ధుడు దీన్ని తప్పకుండా చదవాలి. ఈ లోకంలో పాపాత్ములు సుఖపడతారు. పుణ్యాత్ములు కష్టాలు పొందుతారు అనే సత్యాన్ని గ్రహించాడు బుద్ధుడు, **'ధర్మపదం'**లో

**సుజీవం అహిరీకేన కాకనూరేన ధంసినా ।**
**సక్ఖన్దినాపగచ్చేన నంకి లిటెన జీవితం ॥** **18-10**

సిగ్గు లేనివాడు, కాకిలాగా, దుస్సాహసి అయినవాడు. ఇతరులను అవమానించే వాడు, ఇతరులకు హాని చేసేవాడు, ధూర్తుడు, పాపాత్ముడు ఈ లోకంలో సుఖంగా జీవించగలుగుతాడు.

**హిరీమతా చ దుజ్జీవం నిచ్చంసుచిగవేసినా ।**
**అలీనేనప్పగచ్ఛేన సుద్ధజీవేన పస్సతా ॥** **18-11**

వినయశీలుడు, పుణ్యచరితుడు, ఆశలేనివాడు, కళంకరహితుడు, వినయ సంపన్నుడు, జ్ఞాని దుర్భరమైన జీవితం గడపుతాడు. అని చెప్పబడింది.

అయినప్పటికీ ధర్మాత్ముడికి పరలోక సుఖము, ఉత్తమజన్మ కలుగుతాయి. జ్ఞాని జన్మరాహిత్యం పొందుతాడు. నిర్వాణం పొందాలంటే ధ్యానం కావాలి. ఆదర్శజీవనము లేనివారికి ధ్యానం కుదరదు. జీవితం పవిత్రంగా ఉండాలంటే కొన్ని ఆదర్శధర్మాలను చెప్పారు. అవి

1. దానము 2. సత్ప్రవర్తన 3. ఓర్పు 4. దీక్ష 5. ధ్యానము 6. వివేకము 7. సాధనసంపత్తి 8. పట్టుదల 9. బలము 10. జ్ఞానము. వీటన్నింటిలోకి ఉత్తమమైన ధర్మము **అన్ని ప్రాణులయందు ప్రేమ కలిగి ఉండటము.** అయితే బౌద్ధులు చేయరాని పనులను ప్రత్యేకంగా చెప్పారు. అవి 1. హత్య 2. దొంగతనము 3. వ్యభిచారము 4. అబద్ధాలాడటము 5. దూషణ 6. డాంబికం 7. మూర్ఖప్రసంగం 8. ఇతరుల వస్తువుల యందు కోరిక. 9. ద్వేషము 10. విపర్యయము (వ్యత్యాసము) వీటిలో మొదటి మూడు దేహానికి తరువాత నాలుగు వాక్కుకు, చివరి మూడు మనసుకు సంబంధించినవి.

అయితే మనసును వశపరచుకున్నవాడు కష్టాలను జయిస్తాడు. మనస్సుమీదనే ధర్మము ఆధారపడి ఉంది. ధర్మంమీదనే జ్ఞానం ఆధారపడి ఉన్నది. కాబట్టి మనస్సు పరిశుద్ధంగా ఉండాలి.

గురువునందు నమ్మకం ఉంచాలి. కాని గ్రుడ్డిగా నమ్మరాదు. గురువు చెప్పిన దానిలో సత్యాసత్యవివేచన చేసి నిర్ణయించాలి. బౌద్ధమతంలో శీలము, ధర్మానుష్ఠానము, సర్వప్రాణుల యందు దయ, అహింస, త్యాగము మొదలైనవి ఉత్తమ గుణాలు. 'ధర్మము' అంటే లోకహితాన్ని కోరటమే. ఈ మతంలో గృహస్థులను– ఉపాసకులని, సన్యాసులను–శ్రమణులు, భిక్షువులు అని అంటారు. గృహస్థులకు కఠిన నియమాలు లేవు. సన్యాసులకు నియమాలున్నాయి కాని అవి ఉపనిషత్తులలో చెప్పినంతగా ఉండవు. సన్యాసం తప్పకుండా తీసుకోవాలనే నియమము లేదు. గృహస్థులకు నిర్వాణసుఖం కలగదు. పుణ్యలోకాలు మాత్రమే

కలుగుతాయి. నిర్వాణం కావాలంటే తప్పకుండా సన్యసించాలి. తరువాత కాలంలో గృహస్థులకు కూడా నిర్వాణం కలగవచ్చు అన్నారు. బౌద్ధులు స్వర్గనరకాలను అంగీకరించారు.

**పునర్జన్మ :** వేదాంతులలాగానే బౌద్ధులు కూడా కర్మసిద్ధాంతాన్ని, పునర్జన్మని అంగీకరించారు. వేదాంతుల ప్రకారము మరణించిన దేహంలోని జీవుడే పునర్జన్మ ఎత్తుతాడు. కాని బౌద్ధుల ప్రకారం మృతదేహం వదలిన వాడొకడు, పునర్జన్మ ఎత్తేవాడు ఇంకొకడు. పునర్జన్మకు కారణాలయిన వ్యక్తిగత ధర్మాలు, తృష్ణ, నూతన రూపంలో పునర్జన్మ పొందుతున్నాయి. పశుపక్ష్యాదులకు మరణసమయంలో పునర్జన్మకు కావలసిన భావాలు సిద్ధంగా ఉంటేనే, పునర్జన్మ లభిస్తుంది. అటువంటి భావాలు సిద్ధంగా లేనివారు, ఆకస్మికమరణానికి గురైనవారు, గంధర్వులై, పునర్జన్మకు అవసరమైన సామాగ్రి (భావాలు) సంపాదించుకుని, గంధర్వరూపం వదలి పునర్జన్మ ఎత్తుతారు.

**చాతుర్వర్ణాలు :** చాతుర్వర్ణ వ్యవస్థను బుద్ధుడు తీవ్రంగా ఖండించాడు. **ధర్మపథం**లో "పాపాలను పారద్రోలినవాడు - బ్రాహ్మణుడు, శాంతచిత్తుడు- శ్రమణుడు, మాలిన్యాన్ని కడిగివేసినవాడు- సన్యాసి" అని చెప్పబడింది.

**నిర్వాణము :** నిర్వాణము అంటే నాశనమవటం. నిర్వాణుడు - ముక్తినొందెడి వాడు అని అర్థం. అయితే బౌద్ధంలో నిర్వాణము అంటే విశ్వసించటం, చల్లార్చటము, ఆర్పివేయటము, ఏమీ లేకుండా పోవటము అని అర్థం. రాగద్వేషాలు లేకుండా యోగముద్రలో, సమాధిస్థితిలో ఉండటమే నిర్వాణం. కామక్రోధాలు పూర్తిగా అదుపులో ఉండటమే నిర్వాణం. నిర్వాణస్థితిలో కోరికలనీ పూర్తిగా నశిస్తాయి. శూన్యత, అనిమిత్త, అప్రణిహితం (ముందు ఏమీ లేకపోవటం) ద్వారానే నిర్వాణం సిద్ధిస్తుంది. ఈ మూడు నిర్వాణానికి మార్గాలు. అర్హాతావస్థ చేరినవారికి పునర్జన్మ ఉండదు. బౌద్ధులలో స్థిరవాదులు అనిత్యాన్ని అంగీకరిస్తే, మహాయానులు శూన్యాన్ని అంగీకరించారు. శూన్యమంటే ఏమీ లేకపోవటం అన్నది సామాన్యార్థం. శూన్యానికి ఇరవైనాలుగురకాలుగా అర్థంచెప్పారు. శూన్యం అంటే అనాత్మ అని కూడా అర్థం. శారీరక, మానసిక ధర్మాలు అనిమిత్త స్థితిలో ఉపశమిస్తాయి. ఇచ్ఛా, వ్యామోహం, క్రోధం అన్నీ నశిస్తాయి. మనస్సు నిశ్చలంగా, నిర్మలంగా ఉంటుంది. కోరికలు తీర్చుకోవాలనే ఆరాటం ఉండదు. నిర్వాణంకావాలన్న కోరికతప్ప ఇంకా ఏ విధమైన

కోరికా ఉండరాదు. నిర్వాణం పొందగానే ఆ కోరిక కూడా నశిస్తుంది. నిర్వాణం రెండు రకాలు 1. ఉపాధిశేష నిర్వాణము 2. అనుపాధిశేష నిర్వాణము. ఇవి ఉపనిషత్తులలో చెప్పే జీవన్ముక్తి, విదేహముక్తి లాంటివి.

ఉపాధిశేష నిర్వాణంలో అరిషడ్వర్గాలు నశిస్తాయి. మనస్సులో వాటికి స్థాన ముండదు. కాని వ్యక్తి ఇంకా జీవించి ఉంటాడు. అనుపాదిశేష నిర్వాణంలో అమరత్వం, శాంతి, నిర్భయత్వం ఉంటాయి. మొదటి రకం నిర్వాణంలో పంచస్కంధాలు పవిత్రరూపంలో ప్రకాశిస్తాయి. అంతేగాని నశించవు. జీవించాలనే కాంక్ష కూడా నశిస్తుంది. బుద్ధుడు తన ముప్పైఆరవ ఏట బోధివృక్షం క్రింద ఈ స్థితిని పొందాడు. ఇతడు జీవన్ముక్తునితో పోల్చబడతాడు. ఈ నిర్వాణము నిర్వికల్ప సమాధిస్థితిగా చెప్పవచ్చు. అనుపాధి నిర్వాణంలో వ్యక్తి మరణంతోపాటు స్కంధజీవితం కూడా పూర్తవుతుంది. అర్హాతుడు నిర్వాణం పొంది అదృశ్యుడవుతాడు. నిర్వాణము అంటే అమరత్వం. మానవ స్వరూపాన్ని అధిగమించటం. ధర్మాన్ని పూర్తిగా ఆచరిస్తూ, మరణభయం లేకుండా ఉండే వారికి ఇలాంటి స్థితి ప్రాప్తిస్తుంది. ఇది అద్వైతులు చెప్పే విదేహ కైవల్యస్థితి లేదా మహాసమాధిలాంటిది. నిర్వాణం శాశ్వతమైనది. నాశనం లేనిది, అనంతం అత్యంతం. నిర్వాణం ఉత్పాదితమైంది కాదు. నిర్వాణం అభూతం. నిర్వాణం అపవృత్తం (వచ్చేది కాదు పోయేది కాదు) నిర్వాణం అమరణం. నిర్వాణం నివృత్తం కాదు. దుఃఖనివృత్తే నిర్వాణమని బౌద్ధులు అంగీకరించారు.

**నిర్వాణదశలు :** సంస్కృతంలో 'క్లేశము' అంటే దుఃఖము, కష్టము అని అర్థం. కాని పాళీభాషలో భ్రమ, ప్రమాదము అని అర్థం. క్లేశం రెండు రకాలు 1. దర్శనక్లేశము 2. భావక్లేశము.

**1. దర్శనక్లేశము :** ఇది ఐదు రకాలు

**1. సత్కాయదృష్టి :** పంచస్కంధాల వల్ల అహంకారం, చైతన్యం ఏర్పడతాయని చెప్పటం.

**2. అనుగ్రహదృష్టి :** శాశ్వతవాదాన్ని నమ్మి, దానిమీద విశ్వాసంతో ఉండటం.

**3. మిథ్యాదృష్టి :** దేన్ని గురించీ సరైన అభిప్రాయం లేకపోవటం.

**4. దృష్టిపరామర్శ :** పై చెప్పిన భావాలలో ఏదోఒకదానికి లొంగిఉండి, అలా ఎందుకుంది? అనే పరామర్శ లేకపోవటం.

**5. శీలవ్రత పరామర్శ :** విపరీతమైనసుఖం లేదా దుఃఖాన్ని సహనంతోను సంతోషంతోను అనుభవించటం.

**2. భావక్లేశము :** ఇది ఐదు రకాలు

1. ఉన్నదాంతో తృప్తి చెందకుండా లేనిదాని కోసం ప్రాకులాడటం.
2. ద్వేషము, పగ చాల ఎక్కువగా, క్రూరంగా ఉండటం.
3. ప్రతివారి మీద కోరిక ఉండటం. ఇదే మోహం
4. మోసగించాలనుకోవటం
5. ప్రతివిషయాన్ని అనుమానంతో చూడటం. ఇదే విచికిత్స.

బౌద్ధులు ఈ రెండింటినీ మహాక్లేశాలు అన్నారు. ఇవే కాకుండా ఇంకా అనేక ఉపక్లేశాలున్నాయి. క్లేశాలను నాశనం చెయ్యటమే దుఃఖనివారణ. దుఃఖనివారణే నిర్వాణము. మహాక్లేశాల నుండి విముక్తి పొందినవాడు శ్రమణుడు. ఉపక్లేశాలు, మహాక్లేశాల నుంచి విముక్తుడైన వాడు ప్రత్యేకబుద్ధుడు అనబడతాడు. సర్వ దుఃఖాలు, క్లేశాలు అధిగమించి యోగస్థితిలో ఉండేవారిని హీనయానులు 'అర్హుడు' అని, మహాయానులు 'బోధిసత్వుడు' అని అంటారు. అర్హతావస్థ పొందిన వాడే నిర్వాణం పొందుతాడు. అర్హతావస్థ చేరి, నిర్వాణం పొందటానికి నాలుగు మార్గాలున్నాయి.

**1. స్రోతాపన్నుడు :** ఈ స్థితిలో దర్శన హేయక్లేశాలు వదలి ప్రశాంతచిత్తుడవుతాడు. ఇతడికి ఏడుజన్మలకన్నా ఇంకా ఎక్కువ ఉండవు.

**2. సకృదాగామి :** ఈ దశలో అరిషడ్వర్గాలు, మోహనీయ క్లేశాలు అన్నీ జయిస్తాడు.

**3. అనాగామి :** ఇక తిరిగిరాడు. ఇతడికి మరణం లేదు.

**4. అర్హాత్వం :** ఈ దశకు చేరిన ప్రతివారు నిర్వాణం పొందుతారు.

బుద్ధుని తరువాత వందసంవత్సరాలకు బౌద్ధ సంఘము సమావేశమయింది. ఇదే మొదటి సంగీతి. (సభ) ఈ సభ మహాకాశ్యపుడి అధ్యక్షతన ఐదువందల

